# సచ్చిదానందము

( జీవితచరిత్రము )

గ్రంథకర్త:

త్యాగి

ప్రకాశకులు:

శ్రీమార్కండేయభవనము.

నరసరావుపేట,

గుంటూరుజిల్లా.

1935



[వెల రు 1—0—0

# కృతిసమర్పణము.

ఈ గ్రంథము

శ్రీ వేదాద్రిలక్ష్మీనృసింహస్వామివారి దివ్యపాదపద్మ

ములకు భక్తియుక్తముగా సమర్పించఁబడినది.

శాపగ్రస్తశిలామయీం సువదనా
ముజ్జీవ్యయారాజత
స్స్వర్గంగాప్రభవస్య మర్త్యభువనే
యా హేతుతాం ప్రాప్నుతః
యా భక్తావనతత్పరా శ్రుతగిరా
మూనం సదా తిష్ఠత
స్తౌ పాదౌ నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౧॥

సర్గే యత్ర విశాం తృతీయకులినా
మావిర్భవోఽభూత్పురా
హైరణ్యాక్షసహోదరాసుహరణం
యత్రాభవ ద్భీకరం
సర్వైశ్వర్యఫలప్రదానచతురా
యాభ్యాంచసంధార్యతే
తావ్యూరూ నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౨॥

ప్రహ్లాదార్తిహరార్థ దైత్యదళన
ప్రావీణ్య సందర్శనే

# కృతిసమర్పణము.

ఈ గ్రంథము
శ్రీ వేదాద్రిలక్ష్మీనృసింహస్వామివారి దివ్యపాదపద్మ
ములకు భక్తియుక్తముగా సమర్పించఁబడినది.

శ్వాసగ్రస్తశిలామయీం సువదనా
ముజ్జీవ్యయారాజత
స్స్వర్గంగాప్రభవస్య మర్త్యభువనే
యా హేతుతాం ప్రాప్నుతః
యా భక్తావనతత్పరా శ్రుతగిరా
నూనం సదా తిష్ఠత
స్తౌ పాదౌ నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౧॥

సర్గే యత్ర విశాం తృతీయకులినా
మావిర్భవోఽభూత్పురా
హైరణ్యాక్షసహోదరానుహరణం
యత్రాభవ ద్భీకరం
సర్వైశ్వర్యఫలప్రదానచతురౌ
యాభ్యాంచసంధార్యతే
తౌ పూరయౌ నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౨॥

ప్రహ్లాదార్తిహరార్థదైత్యదళన
ప్రావీణ్యసందర్శనే

సవ్యాన్యోద్యత ఘోర ఖడ్గ నఖరా
నిత్యం క్వణ త్కంకణౌ
శత్రూణామభయప్రదానకరణే
ముద్రాంకితా వవ్యయా
తౌ హస్తౌ నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౩॥

స్వీయాద్వేణురవా త్ప్రియాసువచనా
త్తార్క్ష్యస్యతోషస్వనా
త్వైకుంఠస్థిత దివ్యవాద్యనినదాత్
ప్రద్యుమ్నసంభాషణా
స్పక్తా త్త్రిస్వరపవ పేయ మభవ
ద్వేదాద్రి మధ్యాసత
స్తే శ్రోత్రే నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౪॥

గోగోపాలక వత్సకాశ్చ బహుధా
గోపీజనాః సర్వధా
శ్రీరాష్ట్రే స్తనయా తథైవ వసుధా
యోగీంద్రబృందారకాః
యద్వీక్షా మనవాప్య జన్మనిఖిలం
వ్యర్థం పురా మేనిరే
తే నేత్రే నితరాం శుభాని దిశతాం
లక్ష్మీనృసింహప్రభోః ॥ ౫॥

# తొలిపలుకు.



ఇందుఁ బలుకునది సత్యము. పలికించునది హృదయము. నడక స్వాభావికము. వ్యక్తిసహజములగు తప్పొప్పులు విశేషములు. గుణగ్రహణము రసజ్ఞులకార్యము.

# వి ష య సూ చి క.

—————:o:—————

# సచ్చిదానందము

## మొదటి ప్రకరణము.

——:0:——

### శాంతిపురము.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం డగుభగవం తుని సృష్టియం దపారపారావారపరివేష్టితంబైన భూమండల మున భరతఖండము విరాజిల్లుచుండు. ఆద్యంతరహితాపౌరు షేయవేదచోదితమతాలవాలంబును, అనేకశతసహస్రవర్షపరి మితనాగరికతావిజృంభణచరిత్రాత్మకంబును, అఖిలవిధనిమ్నో న్నతభూప్రదేశగిరివనరేఖాలంకృతంబును, అవర్ణ్యసమస్తభూ జలవాయుచరజంతుసంతానసంశోభితంబును నగుభరతవర్షంబున నత్యంతరమణీయంబై యాంధ్రదేశమొప్పు. ఆంధ్రవిష్ణురాజ రాజకృష్ణరాయాద్యసమానసార్వభౌమసంపాదితకీర్తియు నన్నపా ర్యప్రభృతిమహాకవిశ్రేష్ఠమండితభాషాస్ఫూర్తియు, రామదా సాదిభక్తలోకప్రత్యక్షీకృతజగదారాధ్యచక్రవర్తియు, అనంత ధనకనకవస్తువాహనసకలభోగానువర్తియు నగునాంధ్రదేశమూర్తి

కన్నులపండువై యలరారుచుండు. ఆంధ్రదేశాంతర్గతం బగు గోదావరీమండలంబున శాంతిపురంబను నొక్క పల్లియగలదు. అశేషశేముషీశోభితు లగునందలిజనులు సర్వవర్ణముల వారును ధనధాన్యపుత్రపౌత్రాదిసమస్తసంపత్సంశోభితులు, విపులతటాకస్వాదుస్వచ్ఛజలములు వారి శాల్యన్నభోజనశీలురను జేయును. సమీపస్థవనంబులవలన పత్రపుష్పఫలకాష్ఠాదికములు సులభలభ్యములగును. ఆయూరిదక్షిణదిశయం దెడతెగక పాఱు వాగు, నీటిమడుగులతోడను నిసుకతిన్నియలతోడను శోభిల్లి చిన్నపెద్దలందఱకు విహారస్థలమగును. లక్షణములనుబట్టి యిది ఋషిపల్లెయనుటకు సంశయములేదు.

శాంతిపురమునఁ బ్రాతఃకాలదృశ్యము లింటింటను కడు దర్శనీయముగ నుండును. వృద్ధురాండ్రగుట నిద్దురరామి పెందలకడనె మేల్కాంచి దివ్వెవెలిగించి రాటములముందు గూర్చుండి పాటలబాడుచు నేకాగ్రచిత్తత నభ్యసించువారు పోలె దారముపై దృష్టినుంచి సోమరు లగుతరుణ వయస్కులకు నీతినిబోధింపవచ్చినగృహదేవతలోయనఁ బ్రకాశించు ముదుసలియవ్వలును, తాముగూడ నరుణోదయకృత్యములఁ దీర్చి నారవేయుచు పెరుగుబుడ్డివలెనున్న తమ నెరసినతలలను మాటిమాటికి పైకెత్తి వికాసముతోఁ దమగృహశోభ నీక్షించు వృద్ధపురుషులును, పగలెల్ల గృహకృత్యంబులఁ బట్టమహిషులవలె నిర్వహించి రాత్రి గాఢనిద్రజెందియుఁ బెందలకడ

మేల్కాంచి గృహాలంకరణంబునం దాసక్తు లగునింటికోడండ్రును, స్వస్వవర్ణనియతధర్మాచరణోద్యుక్తు లగుబ్రహ్మక్షత్రియవైశ్య యువకులును, కాల్యకరణీయంబులఁ దీర్చి కంచంబులనారగించి పటిష్ఠంబు లగుసుందరవృషభంబులఁ బూన్చినయరకలతోఁ బొలంబుల కేగుకృషీవలులును, రాత్రులయందు దుచ్చెలతోఁ బడిపిన పాత్రగుడ్డలలో నటునిటు దొరలుచుఁ దమ నిష్కళంకముఖాంబుజముల బ్రహ్మానందమును వెలువరచు శిశువు లును, పెందలకడ లేచి యాహారమునకై యిటునటుదిరుగు శ్వాన కుక్కుటమార్జాలాదిజంతుసంతానంబును, బిడ్డలకు పాలిచ్చు తల్లులఁజూచి, ‘ యింతటి పక్షపాతమా మమ్ములఁగట్టివైచి మీ శిశువులఁ గుడుపుకొనుటయా ’, యనున ట్లంబారవంబులు సేయు లేఁగలును, లేఁగలకుఁ బ్రతిరవంబులిచ్చు నాలేఁగల తల్లులును గన్నులపండువై కర్మాచరణంబున భగవంతుని మెప్పించు కర్మ యోగులసమావేశమా యిది యనిపించుచుండెను.

ఇఁకను మధ్యాహ్న సమయంబున శిష్టాచార సంపన్ను లగుబ్రాహ్మణులనివేదనాఘంటారావంబులును, ఇండ్లకువచ్చు సవికల యెద్దులమెడలయందున్నగ్రైవేయములఘుంటికాఠంకార రవంబులును శీఘ్రగతి గృహవ్యాపారరక్తు లగుగృహిణుల కంకణనిక్వాణంబులును, చిఱుతపాపల కాళ్లగజ్జియలఘల్లుఘల్లు గను నాదంబులును మిళితమై శ్రుతిపేయ మధురధ్వనికారణం బగును. సాయంసమయ మగుడు తమ తమ కృత్యములఁదీర్చి,

రచ్చబండలపైఁ గూర్చుండి, లౌకికవిశేషవిషయములఁ జర్చించువారును, బయళ్లయందిసుక తిన్నెలపై నానందముతో విహరించువారును, దేవాలయంబుల దేవతావందనాదికం బాచరించువారును. ప్రొద్దు గ్రుంకవచ్చినయతిథుల సత్కరించువారును, శయనమున ప్రతిభా ప్రదర్శనముఁ జేయువారును నై పలుతెఱంగుల ప్రజ లానందింతురు.

శాంతిపుర ప్రజలు న్యాయశీలురుగాన వారికి వైరము లరుదు. స్వల్పవివాదకారణము లున్నను నా యూరికరణము వాని నత్యంతసులభముగఁ బరిష్కరించును. దృఢకాయులును, కడు సమర్థులును పలుకుబడి గలవారును నగునాయూరి యధికారులు గ్రామ సామరస్యమున కెంతయుఁ దోడ్పడుచుందురు. వివిధ వర్ణంబులవారు తమవృత్తుల నిరాతంకముగ నాచరించుటం జేసి సర్వవిధ సామరస్యసహిత మగుచిన్ని సామ్రాజ్యమునవలె నా యూరుండును. అచట న్యాయార్థికమతాది శాఖలు వేఱుపఱుపకయే జీవనభాగములుగ వర్తిలును. ప్రభుత్వమున కీయవలసినపన్నుల ననర్గళముగఁ జెల్లించుటవలన వారికే ప్రభుత్వమునఁగాని రాజబాధ లేకుండెను.

ఈ చిన్నపల్లియను, పురమను టెట్లు? చాళుక్యాన్వయసంభవు లగుచక్రవర్తులకాలమున నీ యూరు గొప్పపట్టణముగ నుండెడిదఁట. అప్పు డీ యూర నేడు పేటలును దగిన జన

ధనసమృద్ధియు నుండెడిని. పలుచోటుల నిప్పటికిని పాటి దిబ్బలు కలవు. వానిని త్రవ్వినప్పు డందు ప్రాంతరోళ్లు, నాణె ములు మృణ్మయపాత్రములు మొదలగునవి దొరకును. అచ్చటి యుత్తరపుచెఱువుకట్టపై నిప్పటికినున్న మల్లికార్జున లింగమునకు ముందుగఁ బ్రతిదినమును శవములు పోవుచుండె డివి. అందుల కా దేవుని, "పీనుగుల మల్లయ్య" యని యిప్పటికిని బిలుతురు. మఱియు మామిడీశ్వరాలయ మొండు గలదు. తత్సమీపమున విష్ణువర్ధనాదినృపులశాసనములు పెక్కులు గలవు.

శాంతిపురమునందు పెద్దచెఱువని యొక చెఱువునకును, చిన్నచెఱు వనియు దొంగల చెఱువనియు రెండవ చెఱువునకును పేళ్లుగలవు. దొంగల చెఱువును గూర్చి యొక గాథ గలదు.

శాంతిపురము ప్రసిద్ధివహించిన కాలమున నొక గొప్ప కఱవు తటస్థించెను. మిడుతలబాధవలన పంటలన్నియు నశిం చినవి. ప్రజలు మలమలమాడుచుండిరి. ధనికులయిండ్లఁ గూలి చేసి కూడు సంపాదింతమను వారు కొందఱును, పుణ్యు లెవరైన బిచ్చమిడుదురా యనువారు కొందఱును, విసికివేసరి దొంగతనముచేనైన జీవింతుమని నిశ్చయించువారు కొందఱును, ధనికు లగుబంధువులపంచలఁ జేరెడువారు కొందఱును, ఆకు అల ములు దిని వనముల నివసించువారు కొందఱును, అభోజ్యము లగుపదార్థములఁ దిని యనారోగ్యపీడితులగువారు కొంద

ధానునై లోకమల్లకల్లోలముగ నుండెను. పలుచోట్ల రాజ
ధర్మశాలలు భోజనమిడి సాయముఁ జేసినను ప్రజల కాపదా
యము చాలనయ్యెను. ఆ సమయమున శాంతిపురసమీప
గ్రామవాసులు కొందఱు రైతులు క్షుద్బాధ కోర్వక శాంతి
పురమునకు వచ్చి యచటి మేటిధనాధిపతియింటి కేగిరి.
వారందఱు నాతని నప్పుగాఁ గొంతధన మిమ్మని బ్రతిమాలిరి.
అతఁడును మిగుల ధర్మబుద్ధికలవాఁడు గావున వారలకు వల
సిన ధనమంతయు నప్పుగానిచ్చి వడ్డిలేకయే కఱవు గడచిన
పిదప తిరుగ నిమ్మని వారిని బంపించెను. రైతులు మిగుల
సంతసించి యా యూరిబయట ధనపుసంచులతో నా సాయం
కాలము విడిసిరి.

వారిలో నొకఁ డిట్లనెను, "అన్నా, సెట్టి ధర్మా
త్ముఁడు. వాని ధనముతోఁ గఱవుతీరును. గవ్వలతో లెక్కించి
మఱల నాతని పైక మీయవలయు". మఱియొకఁ డిట్లనియె,
"అయ్యో నీ వెంత పొరపడితివి. సెట్టి వెఱ్ఱివాఁడు పత్ర
ములు లేకుండ ధనమిచ్చినాఁడు. ఇఁక మన మీ ధన మీయ
నిచో మనల నిర్బంధపఱచుసాధన మాతని కెద్దియు లేదు.
కఱవునుండి కోలుకొనుట కష్టము. ధనము చెల్లించుటయుఁ
గష్టమే అపాయమునందు ధర్మము బంధింపదు". అని చెప్పు
టయు రైతు లనేకులు సంతసించి మొదటివాని మాటను
ద్రోసివైచిరి. దుష్పథము చులకనగ నంగీకరింపఁ బడును
గదా!

ఆ సమయమున దగ్గతి పొలములో దృష్టిపరిహారము నకై కఱ్ఱకుఁ దగిలించియున్న కపాల మొకటి పకపక నవ్వెనా గెను. వారటు జూచి భయాశ్చర్యచకితులై నిశ్చేష్టులైరి. కపాలమిట్లు వాకొనఁ దొడఁగె, "మిత్రులారా! మీ ముచ్చ టలను సమగ్రముగ వింటిని. పరులనుగూర్చి మాటలాడు నప్పుడుగాని, రహస్యాలోచనము చేయునప్పుడు గాని గోడ లకుఁ జెవులుండునని మీ రెఱుఁగవలయు. నేనేగాక మీ ప్రసం గముల వినువారు పెక్కురు గలరు. భారతమునఁ జెప్పబడినట్లు "వేదములును బంచభూతములు, ధర్మువు, సంధ్యలు నంత రాత్మయున్ యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదార్థము లివియుండగా నరుఁడు దక్కొన నేర్చునె తన్ను ముచ్చిలన్". సర్వాంతర్యామి యగుపరమే శుని కన్నుమూయనచ్చునా? కృతము ననుభవింపక తప్పించు కొనువాఁడెవఁడు నామాటల నాలకించి ధర్మమార్గ మవలంబిం పుఁడు" అని మిన్నకుండెను.

అంతఁ గాఁపు లొండొరులమోములఁ జూచుకొనిరి. వారిలోనొకఁ డిట్లనెను. "అన్నా! తెలిసియో తెలియకయో పాపముఁ జేయనుంటిమి. దాని నిప్పుడే తప్పించుకొనవలయు. దుష్ప్రపంచమునఁ గొట్టుకొనిపోవుమనకు ధర్మదేవత కపాలరూప మున తారకమైనది. ఈ హితవాక్యమును నిరసించుట యురిఁ ద్రోసికొనుటయే యగును. సెట్టి ధనము దుర్వ్యయము చేయ

రాదు. మన మా ధనమును మరల నిచ్చుటయుఁ గష్టమే. ఇప్పు డొక యుపాయ మే నూహించితి. ఒక చెఱువు త్రవ్వింపు మని మనము సెట్టినడుగవలయు. ఆ చెఱువును ద్రవ్వుటలో మన మందఱము నాబాలగోపాలము కూలిఁజేసి జీవింపవలయు. సెట్టి అందుల కంగీకరింపనిచో ధనము నిచ్చివేయవలయు. ధర్మమున నశించిన నిచ్చటికష్టములు తీఱి పరలోకమున సుఖము గల్గును. అధర్మమున సుఖించిన దాని కనేకమడుంగులు మఱి యొకజన్మమున ననుభవింపవలయు".

ఈ మాటల కందఱు వల్లెయనిరి. సెట్టికడ కేగ సెట్టియు సమ్మతించెను. వా రాలోచనచేసిన స్థలమునఁ జెఱువు త్రవ్విం పఁబడియె. ధన మపహరింపఁ దలచినవారు త్రవ్విన చెఱువు గాన దానిని దొంగల చెఱువని ప్రజలు పిలిచిరి.

శాంతిపురమునకు సమీపమున శిబిచక్రవర్తియాగముఁ జేసినపవిత్రక్షేత్రము గలదు. మఱియు నా పట్టణపు బాహ్యోద్యానము లెంతయని వర్ణింపఁగలము. మందమలయా నిలమనోహరంబులును, శుకపికశారికాసుస్వరమధురంబులును, బహుళశీతలచ్ఛాయాసంపాదకములును, వివిధమధురఫలస్వా దుతాలవాలంబులును, అతిరుచిరవల్లీమతల్లికాకుసుమగంధాయి తంబులును, నగునావనంబులు సార్వకాలికముగ గ్రామవా సుల కానందదాయకము లగును. మఱియు,

సీ॥ ఛలవేషములు దాల్చి జపమాలికలు ద్రిప్పఁ
పంచాక్షరీమంత్రపఠన లేదు
రణమన్న నటుచూపి ధనమన్న నిటుచూపు
శౌర్యధైర్యౌదార్యచణులు లేరు
ఏడుసారులు దివాలేయైనఁ బిల్చియు
పిల్లనిచ్చెడు నట్టి విధము లేదు
దున్నక విత్తక తులలేని కృషి లేక
పండుపండు మటంచుఁ బలుకు లేదు
బ్రాహ్మణుల క్షత్రియుల వైశ్యవర్ణమునను
శూద్రులందున నాపురి శోధసేయ
సత్యశౌచ స్వధర్మ్మముల్ జరుగునెపుడు
కృషులు వర్ధిల్లు వ్యర్థపుఁగృతులు లేక ॥

---

# రెండవ ప్రకరణము.

—:o:—

## సచ్చిదానందము



శాంతిపురమున నొక్క సద్బ్రాహ్మణకుటుంబ ముండెను. తద్వంశపురుషులు విప్రోచితషట్కర్మాచరణంబునను దయాసత్యశౌచాదిసుగుణావలంబనమునను వాక్చమత్కృతియందును, కార్యకౌశలమునందును బ్రహ్మవిద్యానుభూతియందు నసమానులు. మఱియు వారు స్వకులధర్మనిర్వాహణముతోఁ బాటు సమున్నతరాజకీయోద్యోగనిర్వాహణంబునను దక్షులే. సకలగుణఘనఘను లగునాపూరుషులు వంశపారంపర్యముగఁ బరమోదారు లగుటవలన శాంతిపురమున వారిగృహనామ మగునుదారపదము సార్థకమని ప్రశంసింపనివారు లేరైరి. పరిసర గ్రామములలోఁ దత్పరిపోషితదేవాయతనములు పెక్కులు కలవు. నిగ్రహానుగ్రహసమర్థులగుటచే వారు దుర్జనభయంకరులును సుజనమనోరంజకులునై యుండిరి. తద్గృహజనితులును నదృష్టవశమునఁ దద్గృహాగతులు నగునారీమణులు పతివ్రతలనియు ధర్మతత్పరలనియు విద్యాపరిశోభితలనియు నాధ్యాత్మికజిజ్ఞాసువులనియుఁ బ్రసిద్ధి వడసిరి. వారు స్వల్పైహికసుఖములఁ దృణప్రాయముగ నెంచితఱియగునపుడు స్వర్గభోగముం జూఱగొను మృతపతికళేబరములతోఁ జితిపై సహగమనోద్యోగము

నేయుటకును దగియుండిరి. ఆయింటిస్త్రీపురుషులు నీతినిబోధిం చుట యాచరణమూలకముగనేగాని యుపన్యాసమూలకమునం గాదయ్యె. వారిం జూచి సన్మార్గాచరణాసక్తులైన లోకులు తమకృతజ్ఞతం దెల్పుటకు వారియింటికి విధివిహారముచేసి వచ్చుచుందురు. అంత స్త్రీత్వములం జక్కంబఱచుకొనియే వారు బాహ్యతీర్థములయానందము ననుభవింప నేగుచుండిరి. ఇట్టి కుటుంబమున జనించినశిశువుల కుగ్గుబాలతోడనే ధర్మ మల వడుననుట యతిశయోక్తి కాదుగదా!

ఇట్టియుదారకుటుంబమునం బురుషోత్తముండను సత్పు రుషుం డుండెను. బహుకాలము ప్రభుత్వోద్యోగముం జేసితన మితభాషణశీలమున నందఱిమన్ననలను బడసినపురుషోత్తముం డీతండు. జవసత్వము లుడుగకున్నయీాడుననె యాధ్యాత్మిక కృషి నర్థించి యతం డుపకారవేతనము నొందెను. సరసనంగీత ధోరణిని నిత్య మాతండు భగవన్నామకీర్తనము నేయును. శ్రీవిష్ణుస్వరూపులనుగ భావించి యతిథులను నభ్యాగతుల నాతం డర్చించును. స్వీయధనపరిమితి ననుసరించి పరుల కుప కారముల నేయుచుండును. మితత్వ మాతనివద్దనే లోకులు నేర్చుకొనందగును. మితాహారము, మితవిహారము, మితభాష ణము, మితకార్యాచరణము గలిగియుండియు భగవద్భక్తి యం దమాత్ర మాతనికి మితత్వ మలవడదయ్యెను. భక్తిభా వమున భగవంతునియందు లీనమైనప్పు డాతనికి మితామిత

వివేకము దుర్ఘటమగుచుండెను. పురుషోత్తముఁడు సుందరశరీర శోభితుఁడు. అతనియిల్లాలిపేరు గుణవతి. ఆమెయుఁ బేరునకుఁ దగినట్లు సుగుణములును సుగుణములకుఁ దగినసౌందర్యమును గలిగి పతివ్రతయనియు కర్మయోగినియనియుఁ బ్రసిద్ధిఁ జెందెను. ఆమె తనశిశువునకుమాత్రమే తల్లిగాక లోకులకందఱకును దల్లియనుట సమంజసము. ఆమెకందఱును శిష్యులే యైరి. శాంతిపురమునందలిబాలికలు చిత్రకళాభ్యాసమునం దామెకు శిష్యురాండ్రు. ఆపురిలోనిస్త్రీలు లౌకికకార్యనిర్వాహణమునను బ్రహ్మజిజ్ఞాసయందును నామెకు శిష్యురాండ్రు. పురుషు లాబాలవృద్ధము పతివ్రతాలక్షణమును కర్మయోగ రహస్యము నామెయాచరణమువలన గ్రహించి తామట్లామెకు శిష్యభావమును నెఱపుచుండిరి. నవవసంతబాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠకామినీకుహూకారమంజుల మధురిమయు, శీతలతుషారకణసహిత మందమలయానిలసుఖసాహచర్యమును, పరబ్రహ్మవిశ్వలీనపరమస్వరానందసమ్మోహనస్థితియును, గుణవతీకోమలకంఠనిర్గతభక్తిగీతములు శాంతిపురప్రజలకు సంపాదించుచుండును.

పుష్పంబును దావియునుబోలె గుణవతీపురుషోత్తములు సదానందసంయోగమున భగవదారాధనమునఁ గాలము గడపుచుండిరి. సుగుణపుష్పసంజనితఫలమన వారి కొక్కసుతుఁ డుదయించెను. తమయాధ్యాత్మికౌన్నత్యమును సూచించునన

ల్లాతనయునకు వారు "సచ్చిదానందము" అని నామము నుంచిరి. ఈ నామము సార్థకమా? నిరర్థకమా? లోకమున నసత్యజీవను లెందఱు హరిశ్చంద్రనామధారకులు లేరు? జగమునఁ గులట లెందఱు దమయంతులు లేరు. ప్రపంచమున శుంఠ లెందఱు ప్రహ్లాదులు లేరు. వారలకుఁ దగిననూతన నామములు వ్యవహారములోనికి వచ్చుచునే యుండును. సార్థక నామధేయములన నయ్యవియే. తలిదండ్రు లుంచునామములు వారిసదిచ్ఛయు సద్భావమును సదాశయమును వెల్లడించును గాని వేఱుకాదు. తలిదండ్రు లుత్తమనామము నీయవలయును. అనూహ్యమైన యీవిశ్వమునకుఁ గారణమైనవిషయి యగు పరమాత్మ యేనామమునకుఁ దగఁడు? నామరహిత మగునా పరాత్పరాంశమునకు నుత్తమనామకరణమే శ్రేయస్కరము. వ్యక్తిపరిణామావశ్యకత ననుసరించి యానామధారకుఁ డుత్తముఁ డనఁబడునుగాక! యధముఁ డనఁబడునుగాక. అది తల్లిదండ్రులకు విచారణీయము కాదు. కావున సచ్చిదానందనామకరణము సమంజసమగును. భగవద్భావనమును బ్రపంచమునం దంతటను జేయవలసినమానవుఁడు పుత్రునియందుఁగూడ నట్టిభావస్ఫురణముగలుగుటకు సన్నామకరణము ననుష్ఠింపఁదగును. సచ్చిదానందము గుణవతీపురుషోత్తములకేగాక శాంతిపురప్రజల కందఱికి నానందదాయకుఁడై యల్లారుముద్దుగాఁ బెఱుగుచుండెను.

సచ్చిదానందము తేజోవంతుఁ డగుబాలుఁడు. సుందర శరీరుఁడు. ఆతనినందఱును వేయికన్నులఁ గాపాడుచుండిరి.

కతని కై దవసత్సరము వచ్చునప్పటికి సచ్చిదానందము దుం డుకుస్వభావముగలవాఁడనిలోకులనుకొనఁజొచ్చిరి. ఇంటిలోని వస్తువుల నాశనముసేయుటబాలుర కజ్ఞానజనితము. దానిని తలి దండ్రులు సహింతురు. కాని యిరుగుపొరుగిండ్లకేగి వారివస్తు వులను నాశనముచేయుటయు వారిశిశువులను గొట్టివచ్చుటయు సహింపరానివి. పశువులన్ననీతనికి భయములేదయ్యె. ఒకా నొకసమయమునఁ బశువులమంద కడ్డముగ నిలుచున్నయీతని నొకపోట్లయెద్దు పడఁగ్రుమ్మఁ ద్రొక్కినది. పాపము గుణవతి యెటనుండియో తత్క్షణమున వచ్చి బాలుని రక్షించినది. ఒకా నొకసమయమున నింట నెవ్వరును లేనప్పుడింటిలోనిగుడ్డలన్నిటి నొక్కచోటికిఁ జేర్చి యీతఁడు నిప్పంటించెను. సాహసురా లగునాతనితల్లి యెటనుండియో దీనినిగ్రహించి వచ్చి కొలఁది బిందెలనీళ్లతో నాయగ్నినిఁ జల్లార్చెను. ఆతనిని బాఠశాలకుఁ బంపుట యొకగండ మయ్యెను. తండ్రిగారు బలవంతమునఁ బాఠశాలకుఁ బంపఁగా నతఁ డింతలో నింటికి వచ్చుచుండెను. ఉపాధ్యాయుఁ డీమూర్ఖునికి విద్యరాదని పురుషోత్తములతన యుని బహిరంగముగ ననుటకు నోరాడక లోలోన ననుకొను చుండెను. ఒకసహాధ్యాయి సచ్చిదానందమున కిట్లుచెప్పుచుం డెడువాఁడు. "వలేయి బల్లోకిలాకపోతే పంతులుగాలు నీ నోంతు పలపలపల కోత్తాదులోయి". ఇంతయేలయని తల్లి తాను బాలునివిద్యాభ్యాసముఁ జేయింప మొదలిడెను. ఆమె

సమర్థురాలుగనుక యాతనిమేధాశక్తిని గ్రహించి యాతని స్వభావమునకనువుగ విద్య నారంభించెను.

మాతృదేవతాసన్నిధానమున సచ్చిదానందమునకు విద్య వచ్చుచుండెను. ఆయమ తగురీతిని శిక్షసేయునుగావునను నాహారమునత్యంత ప్రేమతో నిడుచుండెనుగనుకను నాతని కామెయందు భయమును బ్రేమయుఁగూడ నుండెను. ఈతఁ డొక విధముగ నేకసంధాగ్రాహి యనవచ్చును. తల్లిగారు చెప్పిన విద్యను వడివడిగ నామె కప్పగించుచుండెను. అతిశీఘ్రముగ వచ్చినవిద్య సామాన్యముగఁ జిరకాల ముండదనుభీతిచేఁ దల్లి మరలమరల నదువుమని యాతని నుద్బోధించుచుండెను. కాని యాతఁ డొక్క-పర్యాయము చదివి గ్రహించి వారము నప్పగించి యాటల కేగుచుండెడువాఁడు.

సచ్చిదానందమునకుఁ గథలన్న నాస క్తమెండు. ఆధ్యాత్మికచింతానిమగ్నులగుతలిదండ్రు లాతనికి లౌకికము లగు కథలు సెప్పరైరి. అందువలన నతఁ డొక కథకురాలి నాశ్రయించెను. శాంతిపురమున సుబ్బమ్మ యనుముదుసలి యొక్కతె యుండెను. ఆమె శాంతిపురపూర్వవృత్తాంతములను తదితరము లగుకథలను సచ్చిదానందమునకుఁ జెప్పుచుండెను. కథఁ జెప్పునప్పుడు భావోద్దీపనము రసపోషణముఁ జేయుచు హస్తవిన్యాససహితకథనమున నమోఘముగ జనరంజనముఁ జేయుశక్తి

యూమె కంఠెను. సచ్చిదానంద మెచ్చటను గాన్పింపకపోయినను సుబ్బమ్మయింట నుండునని తలిదండ్రులకు ధ్రువమయ్యెను. అతఁడు తదాసక్తి చేసిన దుడుకుపనుల మానుమని యాసించి, వారు నిరోధింపరైరి. ఇట్టి సహవాసము బాలుని కపారలోక జ్ఞానసాధన మయ్యెను.

దుఃఖపూరిత ప్రపంచమున హృదయసుకుమారపుష్ప మెప్పటికప్పుడు రాలిపోకుండఁ జేయునది యాశాబంధము. ఆశ వలన మానవుఁడు భావిఫలచింతఁ జేయుచుండును. ఈలోకుల భావిఫలచింతయే లోకమున జ్యోతిష్కులకును సాముద్రిక శాస్త్రజ్ఞులకును జీవనాధారము. ఒకానొకరోజున శాంతిపుర మున కొకయోగి వచ్చెను. ఆతఁ డదృష్టఫలమును జక్కగ చెప్ప గలఁ డని ప్రతీతిఁ గలిగియుండెను. అనేకు లాతనిదర్శనమున కేగిరి. గుణవతియు సచ్చిదానందమును వెంటనిడికొని యోగి కడకేగి యాతనికుపాహారములను సమర్పించి తనబాలునిభావి వృత్తాంత మడిగెను. యోగి బాలుని దగ్గరకుఁ బిలచెను. తల్లి బాలుని యోగితొడపైఁ గూర్చుండఁబెట్టెను. సచ్చిదానందము శాంతముగనుండెను. యోగి యిట్లనెను. "ఈబాలునినేత్ర మున నొకమంచికళ యున్నది. దానివలన నీతని కాధ్యాత్మిక జ్ఞానము గలుగుననియు మహోన్నతస్థానము నీతఁ డాక్రమించు ననియు పరమసాత్త్వికస్వభావుఁడు కాగలఁడనియు నానమ్మ కము". ఈమాటలు గంభీరముగ నుచ్చరించి యా యోగి

మౌనమును వహించెను. బాలుని మూకతనము నెఱిఁగియున్న ప్రజ లామాటలు విశ్వసింపఁజాలరైరి. గుణవతి మాత్ర మామాటలయందుఁ బరమవిశ్వాస ముంచెను. ఆమె యోగికి నమస్కరించి యింటి కేగి యావార్తను బురుషోత్తముల కెఱిఁగించెను. ఆదంపతులయానందమునకు మేరలేదు. తనయుని యున్నతినిగూర్చి యానందింపనితలిదండ్రు లుందురా? అందును ఆధ్యాత్మికచింతాప్రియు లగువీరు తమకుమారునిభావిసాత్త్విక స్థితిని భావించి భావించి పరమానందమగ్ను లగుటయం దాశ్చర్య మేమున్నది.



# మూడవప్రకరణము.

—:0:—

## పూర్వవృత్తాంతములు.

సచ్చిదానందమునకు ముదుసలిసుబ్బమ్మ కథలు చెప్పె నంటిమి. ఆమె సాలెత. సుమారు నూఱువత్సరములవయస్సు కలది. తనకును తనపెద్దలకును గలిగినయనుభవములన్నియు నామె యేకరువుపెట్టుచుండెను. సచ్చిదానందము నిద్రాహార ములైనను ఆసింపక వాని నాలించుచుండెను. ఆమె యప్పు డప్పుడు చెప్పినవానిని మాకుఁదెలిసినంతవఱకు సంగ్రహించి వ్రాయుచున్నాము.

"నాయనా మారోజులకును నిప్పటిరోజులకును బోలి కయేలేదు. ఇది పిడపకాలము. మాదియును మాపెద్దలది యును సత్యకాలము. అప్పటిమనుష్యు లాజానుబాహువులు. ఇప్పుడు వెంపలిచెట్లకు నిచ్చెనలువేయువారు పుట్టుచున్నారు. జడిచొప్పనొక్కఁడే తేఁగలిగినదినములు పోయినవి. ఇవతల చెంబు తీసి యవతలఁబెట్టలేనివారిరోజులు వచ్చినవి. తలకు రాగిడిచంద్రవంకలు తిరుగుడుఁబువ్వులు, చెవులకు విధవిధము లగు జూకాలు, ముక్కులకు బులాకులు, అడ్డబాసలు, మెడలో మంగళసూత్రములు పలకసరిపట్టెడలు పగడాలదండలు, చేతు లకు దండకడియాలు గోట్లు గాజులు, కాళ్లకందెలుకడియాలు,

చేతి వ్రేళ్లకుంగరాలు, కాలి వ్రేళ్లకు మట్టెలు మొదలగు నాభరణములను ధరించి కావలసినంతపసుపు పూసికొని కావలసినంత కుంకమబొట్టు పెట్టుకొని ముత్తైదువలు మహాలక్ష్మితల్లులవలె నుండువారు. ఇప్పు డందములేదు చందములేదు. సొమ్ములులేవు గిమ్ములులేవు. ఒళ్లుగనపడకుండా దిట్టమైనచీరలు లేవు. రవికెలు లేవు. పసపుకుంకమకాటుకలు లేకుండ పాడునొసళ్లాడు చున్నా రిప్పటిమహాతల్లులు.

పూర్వకాలములో జిన్నలును బెద్దలును జిబ్బున చీది యెఱుగరు. రాళ్లు తిని రాళ్లు హరించుకొనగలరు. అడ్డెడుగుగ్గిళ్లొక్కసారె ఫలాహారమున కొక్కనికి జాలునవిగావు. ఇప్పుడు తినను లేరు. హరించుకొనను లేరు. పైగ చిత్రవిచిత్రములైనరోగములు. ఇంతవానికీ గాకయే. అంతవానికి నుష్ణమే. పొద్దున లేచినప్పటినుండియు దలనొప్పి యని యొకరు, పడిసె మని యొకరు, కాలునొప్పి యని యొకరు, కన్నుతీపని యొకతె, కడుపులో పోటని యొకతె దిక్కుమాలినరోగములతో దీపులు తీసికొనుచు మూలగూర్చుండి మూల్గుచుండుట యిప్పటి యాచారము. మా కేదైనను కర్మముచాలక వచ్చినను లంకణములతోను కఠినపథ్యముతోను టక్కున కట్టిపోవునది. ఇప్పుడు తియ్యనిరోగములు కమ్మనిమందులు. ఈరెండిటికి అంతులేదు పంతులేదు. మనుష్యులు పోయినను రోగములు పోవుటలేదు. ఈసాభాగ్యమునకే యిప్పటిది నాగరకతయని

ప్రాక్స్వప్రాణికేమియుఁదెలియదని మురిసి ముక్కలగుచున్నా రిప్పటివారలు.

పోనిండు శరీరముల కేమి మనస్సులు మంచివా? చిన్న నాఁపట్టున శ్రీరామరక్ష అని తిని కూర్చుండువారే కాని యిరుగుపొరుగు కష్టసుఖము విచారించుట యిచ్చిపుచ్చు కొనుట మంచిచెడ్డలుమాట్లాడుకొనుట మట్టుమర్యాదలతోఁ ప్రవర్తించుట చిన్నపెద్దతారతమ్యము తెలిసికొనుట అతిథుల నభ్యాగతుల నర్చించుట లిప్పు డెక్కడనున్నవి? మాకాల ములో నూరిలోనికిఁ గ్రొత్తమనుష్యుఁడు రాగానే మేమందఱ మాతనిచుట్టును జేరి యూరుపేరు విచారించి మాయింటికి రా, మాయింటికి రా, యని బలవంతముఁజేసి తీసికొని వెళ్లు వారము. అతనికిఁ బోసికొనుటకు వేడినీళ్లిచ్చి కలియో గం జయో మాతోపాటారగింపఁ జేయుదుము. ఊరిలో నెవరింట నైనను జబ్బుచేసినయెడల నందఱమువెళ్లి విచారింతుము. తగిన సలహా చెప్పుదుము. దురదృష్టమున మరణమే సంభవించిన యెడల మే మందఱమును మిక్కిలి దుఃఖింతుము. పెద్దలగువారు స్మశానముదనుక వెళ్లి వచ్చుచుందురు. చచ్చిపోయినవాని బంధువులవద్దఁ గూర్చుండి కొందఱము వారి నోదార్తుము. వారు బీదవారైనచోఁ గావలసిన సాయమంతయుఁ జేయువా రము. ఒకయింటిలో శిశువుపుట్టినచో నూరికందఱికి నుత్సవమే. ఒకయింటిలోఁ గాయలువిరివిగఁ గాసినచో నిరుగుపొరుగు

వారికిఁ బెట్టకుండ తినము. ఒక్కయింటిలో గొడ్డీనినప్పుడు చుట్టు పట్లవారందఱును జున్నారగింపవలసినదే. పూర్వము వానలు మిక్కుటముగ నుండెను. జనసమ్మర్దము తక్కువగానుండుట చేత వ్యవసాయముచేయువారులేక భూము లనేకములు బీళ్లుగా నుండెను. బీళ్లలో కుందురు, పిల్లిపిసర, గలిజేరు, గాడిదగడప, గరికె మొదలగు పశువులమేతలు విరివిగాఁ బెరుగుచుండెను. పశువులు చెక్కగమేసి పాలను సమృద్ధిగ నిచ్చుచుండినవి. నేతికిని బెరుగునకును కొదువ యుండెడిదికాదు. కూర లమ్ము కొనుట నేటికిఁజూచినానుగాని మే మెప్పుడును ఎఱుఁగము. ధాన్యము గూడ నతిచౌకగ నుండినది. ఈ మాయకాలమున నన్నియు లిగాదాలే. పూర్వము వ్యాజ్యములు తక్కువ. ఉన్న వానిని సులభముగఁ బెద్దలు పరిష్కరించుచుండిరి.

మేము చక్కనిగుడ్డలను నేయుచుంటిమి. ఇప్పటిగుడ్డలు మూడురోజులలో నెగిరిపోవును. అట్లని పూర్వము నాజూకు వస్త్రములు లేకపోలేదు. మానాయనమ్మగారు కష్టించి మిక్కిలి సన్ననినూలు వడకినది. దానితో మాతండ్రి మిక్కిలి పలు చనివస్త్రమునేసి చిన్నపెట్టెలోఁ బెట్టి చేతిలో నిముడ్చుకొని రాజుగారికి మేమానుగా నియ్యగా వారాయనకు వేయివరా లిచ్చిరి. ఆడబ్బుతో మానాయనగారు మహావైభవముగా మాపెండ్లిండ్లన్నియుఁ జేసిరి. నాపెండ్లికి నూరువిళాయికర్ర లతో నూరేగింపు జరిగినది. ఒకబ్రాహ్మణుఁడు సెనగ

కాయలో నిముడునంతసన్ని నిజందెములజతనుదయారుచేసి రాజా గారికి సమర్పించి నూరువరాలు బహుమతిఁ బొందెను. అనేక వర్ణములతోఁ జిత్రపటములను గీయువారు మనయూరిలో నుండిరి. పూర్వము కఱవులు తక్కువ. కఱవు వచ్చినను ధనికులవద్ద ధనరాసు లుండుటచేత ధనపుపాతరలు దీయగనే గఱవు దీరుచుండెను. నిక్షేపమునంటి రోజు లవి. తోలుబొమ్మలాటగాండ్లు వచ్చినప్పుడు మాసంబరము చెప్ప నలవికాదు. వీధిభాగవతులు నాటకము లాడుచుండినప్పుడు మాసంతోషము వర్ణింప వీలుకాదు. దొమ్మరవాండ్రు వచ్చినప్పుడు మాయానందమునకు మేరలేదు. గంగిరెద్దులాట సమీపించినప్పుడు మాయుత్సాహమునకుఁ దుదిలేదు. పంబలవాండ్లు రుంజవాండ్లు వీరముష్టివాండ్రు ఇంకనెందఱో వచ్చి మాప్రమోదమునకంతులేకుండఁ జేయుచుండిరి. ఇప్పు డాయుత్సాహమంతయు నశించినది. నిరాదరణముచే నాజాతులన్నియు నశించుచున్నవి. కొంపకు విప్రవినోదులుగూడ నిప్పుడు మందునకైనఁ గానవచ్చుటలేదు.

ఇకను బూర్వకాలపుకష్టములను బేర్కొందును. చిన్న జమీందారులును చిన్నచిన్నరాజులును నెల్లప్పుడును తగవులాడుచుండుటచే జనధననష్టము లున్నను గ్రామజీవనమునకు మాత్ర మాటంక ముండెడిదిగాదు. మహారాష్ట్రు లొకసారి మనయూరిసమీపముననున్న చెర్లపురముకోటను ముట్టడించిరి.

ఎన్ని నెలలు ముట్టడించినను కోట స్వాధీనము కాదయ్యెను. తుట్టతుదకు విసుగుఁజెంది యీకోటలోని కన్ని నెలలనుండియు నాహారపదార్థము లెట్లువచ్చుచుండిన దని వారువిచారించిరి. ఒకగొల్లది ద్రోహముచేసి మహారాష్ట్రులకు చర్లపురిలోనుండి వెలుపలికి వెళ్లుటకు నిర్మింపఁబడినభూబిలమార్గమును జూపించెను. వా రాబిలమును బంధింపగనే కోట స్వాధీన మయ్యెను. మహారాష్ట్రులు ధనరాసులను కొల్లగొట్టుకొని పోయిరి.

మఱియొకమారు పిండారీలు వచ్చి రాయపురమును ముట్టడించిరి. అచ్చటిజమీందారులు ఫిరంగులను బ్రయోగించి వారిని దరిమివేసిరి. అప్పుడప్పుడు మరాటీలును పిండారీలును వచ్చి గ్రామములను దోచుకొనుచుండిరి. ఇట్టివి మా తాతగారికాలములో నెక్కువగా నుండెను. దోపిడిదొంగలు వచ్చినప్పుడు ప్రజలు చేలలోనికిని కొండలలోనికిని బరుగెత్తువారు. వారిధనములన్నియు భూస్థాపితములుగాన దొంగల కవి లభ్యమయ్యెడివి కావు. అందులకు వారు దొరకిన ప్రజలను ధనము చూపింపుమని బాధించుచుండిరి. ఒకపరి దొంగలు మా తాతగారినోటిలో కారము కుక్కి ధనము చూపించుమనిరి. వారి కాయన మట్టిదిబ్బ నొకదానిని జూపించి యందు వారు వెదకుచుండ సందు జేసికొని పారిపోయిరి. మనయూరిలో కనుమూరి రామయ్యగారితాత కడుదరిద్రుఁడు. ఒకనాఁడు బందిపోటు జరుగుచుండ నాతఁ డూరిలోనే దాగియుండెను. వీధిలో

నాతఁ డొకగుజ్జుమును జూచెను. దానిపై వరాలమూట లుంచెను. తటాలున నాతఁడు బయటికి వచ్చి యామూటలను పెనవాడుపాతరలోఁ బడవైచి దానిపైఁ గొంచెము చెత్త పార వైచి మరల దాగెను. దొంగలు పోయినతరువాత నాతఁ డాధనమును బయటికిఁ దీసికొని భాగ్యవంతుఁ డయ్యెను.

మనయూరిలో సుంటా సుబ్బయ్యగారి నాయనమ్మ పరమ పతివ్రత. పిండారీలు వచ్చినప్పుఁ డామె పచ్చిబాలింతరాలు. ఆమె పారిపోవుటకు వీలులేకపోయెను. ఇంతలో నొకపిండారి వచ్చి యామెను జెఱుప సమకట్టెను. అప్పుడామె యేమి సేయఁ గలదు. పాపమామె యొక్కయుపాయము తోఁచెను. వానితోఁ దాను స్నానము చేయవలయునని చెప్పెను. వాఁడామెకు నీళ్లు తోడి యిచ్చుటకు సమ్మతించెను. వా డట్లు నీళ్లుదోడుచుండ నామె మహాశక్తివలె విజృంభించి వానిని రెండుకాళ్లుపట్టుకొని బావిలోఁ ద్రోసి పెద్దరాళ్లాతనినెత్తిపై వైచెను. ఆపదుద్ధా రకుఁ డగుపరమాత్ముఁడు దిక్కులేనివారికిఁ దానే దిక్కుచూ పించి రక్షించును. అంతట నామె మఱియొకచోట కందికట్టె మండెచాటున దాగి మిగిలినవారినుండి తప్పించుకొనెను.

అటుతరువాత మనయూరిప్రక్కనున్నరోడ్డుపై పెక్కు పటాలములు నడచుచుండెడివి. పటాలములవారు ప్రజలనప్పు డప్పుడు కూలీలను జేయుచుండిరి. కొన్నిపటాలములలోఁ గలరా

యుండెను. అందువలన నాపటాలములకు మురికిదండ్లు అని పేరు. మురికిదండ్లవలన గ్రామములలోఁగూడ కలరా వ్యాపించుచుండెను. అప్పటికాలములో శిస్తుక్రింద ధాన్యములో నాలవపాలు జమీందారులు పుచ్చుకొనుచుండెడివారు. ప్రజలు ధాన్యము తినినారేమో పరీక్షించుటకు రాజసేవకులు వచ్చి వారిని నోటినిండనీళ్లుపోసికొని యుమ్మివేయు మనుచుండిరి. గింజలుతినిన నోటిలోనీళ్లు తెల్లగనుండును.

ఈ కష్టములన్నియు మాకు లక్ష్యముగ నుండెడివికావు. అప్పటిమా ప్రేమలు, మాయుత్సవములు, కోలాటములు, పీర్ల పండుగలు, కొలుపులు, తిరణాలలు, తీర్థములు, ఇప్పుడెక్కడ నున్నవి. ఈ పాపిష్టికాలము చూచుటకు నేను బ్రతికియున్నానుగాని మాపెద్దలందఱు పుణ్యాత్ములు బ్రదుకుతెల్లవార్చుకొని వెళ్లినారు ".



# నాలుగవ ప్రకరణము.

———: o :———

## పరివర్తనము.

———

అది గ్రీష్మఋతువు. సమయము మిట్టమధ్యాహ్నము. చండభానుని తీవ్రప్రతాపమునకు లోకము తల్లడపడుచున్నది. అప్పుడు వర్షము స్వేదరూపమున నిరంతర మైనది. వాయువు నిశ్వాసరూపమున మానవులందఱు నాదరించినది. శీతలచ్ఛాయల నిచ్చువృక్షములును, నిర్మలోదకములు లభింపఁజేయు చలిపందిరులును సేవ్యములైనవి. వింజామరలకు విలువ హెచ్చుకాఁజొచ్చెను. ప్రజలు పనిపాటుల నాచరించుట దుర్ఘట మయ్యెను. వేయేల లోక మట్టుడికిన ట్లుడుకుచుండెను.

అత్తఱి యేలాకో శాంతిపురము కళాహీనముగఁ గన్పట్టుచుండెను. వృక్షములు వెలవెలఁ బోయినవి. పశువు లఱ్ఱులెత్తి యంభాయని యఱచుచుఁ దప్పిగొనికాబోలు ఇండ్లను జేరినవి. పక్షులు కిచకిచలు మాని దిగులుఁజెందిన ట్లూరక చూచుచుఁ నచ్చటచ్చటఁ గూర్చుండియున్నవి. వీధులు శోభతఱిగి యుండెను. వినిర్మలకాంతులఁ దేజరిల్లు పురుషోత్తముల గృహ మశుభచిహ్నములతో నాసమయమున దుర్నిరీక్ష్యముగ నుండెను. ఆయింటిముందు ప్రజలకలకలము మెండ

తివమ్మండా", "రామయ్యగారూ కడుపునిండ అన్నముపెట్టి కన్నతల్లివలెఁ గాపాడుసీమెకు జబ్బుచేసినదని వినగనే నాగుండె పగిలినదండీ" "సుబ్బమ్మా నాకీరోజు పిచ్చియెత్తిన ట్లున్న దిరా" అనుపురుషులును బురుజోత్తములయింటిముందు గుమిగూడి యుండిరి. ఇంటిలో నిండుగ జనముండిరి. ఒక్కరికైనను నోటమొగము లేదు. మోములను వస్త్రములతోఁ గప్పికొని మాటమంచలింపులేక, నిశ్శబ్దముగ పెద్దపెద్దతలపాగలతో రైతులనేకులు ఖిన్నులై కూర్చుండి యుండిరి. ఒకప్రక్కను రోగి మంచ మున్నది. మంచములోనున్నది ముప్పదియైదేండ్లస్త్రీ. చూచుటతోడనే యామె గుణవతియని మనము గ్రహింపవచ్చును. ఆమె యసంబద్ధప్రలాపము లామెకు సంధి తటస్థించినదని చెప్పకయే చెప్పుచున్నవి. రోగచిహ్నము లామెసౌందర్యాతిశయము నేమాత్రము తగ్గింపఁ జాలవయ్యెను. నవారవింద భాసురనేత్రద్వయి యనితరసులభ తేజఃపుంజముల నీనుచున్నది. వైద్యుఁ డీవఱకే పెదవి విఱచినాఁడు. ఆమె జీవించుననునాశ సన్నగిలుచుండెను.

మధ్యమధ్య నామెకు స్పృహ వచ్చుచుండెను. ఒకమారు తన్నుఁజూడవచ్చిన ప్రియసఖులను పేర్వేరఁ బిలఁచి పలుకరించును. ఒకమారు వేదాంతపుపాటలఁబాడును. వేఱొకమారు తనతల్లినిగాంచి "కూతురుచుట్టమ్మ గురువుదైవమ్మ" అనును. ఇంకొకమారు ప్రజలకు మోక్షధర్మము నుప

దేశించును. ఇట్టివైఖరిని గాంచి యామెయన్న యావచ్ఛోధోరణిని పిశాచపీడఁగ భావించి పాదరక్షతోఁ జికిత్సచేయఁదలఁచెను. ఇది పలువుర కసమ్మతమైనకార్యము. ఆసమయమున సచ్చిదానంద మాసమీపమున నుండెను. ఆతని కిప్పు డాఱవయేడు. ఆసమయమున నాతని కీపరిస్థితు లేవియుఁ జక్కఁగ నర్థముకావయ్యెను. తనమేనమామ యాచరింపఁదలఁచినకార్యమున కాతఁడు మిక్కిలి రోషపూరితుఁ డయ్యెను ఆతీవ్రరోషముతో సచ్చిదానందము మధ్యాహ్నసూర్యునివలె తీక్ష్ణముగ జూచుచుండెను. కాని యాచికిత్సోద్దేశ మాఁగిపోయినది. అప్పుడు గుణవతికి సంభవించినది పిశాచపీడగాదని పలువురు చెప్పుటచే నామెయన్న. యాకఠినచికిత్సావిధానమును మానివైచెను. సచ్చిదానందుని హృదయము ప్రసన్నమయ్యెను. ఆతఁడు తనయాటలకై వెడలిపోయెను.

సంధి హెచ్చినది. రోగికలువరింత లతిశయించినవి. సన్నిహితబంధువులేడ్వసాగిరి. ప్రజలలోఁ గలకలము ప్రారంభించినది. మరణ మింకనుదూరస్థమా యని యనిపించుచుండినది. గుణవతి యెవ్వరికొఱకో యటునిటు పరికించె. ఇంతలోఁ బురుషోత్తము లచ్చటికి వచ్చినారు. ఆయనను జూడఁగనే క్షణకాల మామెసంధి యాఁగినది. స్వస్థత చేకూరినట్లు నటించుచు నాతురతతోఁ బురుషోత్తములఁగూర్చి యాయమ యిట్లు పలికినది. “ అయ్యో మీరింకను భుజింపనేలేదా ? ఎంత ప్రొద్దుపోయినద ! ”.

ఆ మాటలతోడనే పురుషోత్తములగుండె నీరైనది. సర్వకాలసర్వావస్థలయందును దనను సర్వవిధముల సేవించిన తనయర్ధాంగి కిట్టియాపద ఘటిల్లుట దుస్సహాము! మహా గంగాప్రవాహామువలె నుబికివచ్చుచున్న దుఃఖపరంపర నాఁపి వైచి పురుషోత్తములు, "ఇదిగో భుజించివత్తును", అనుచు పోని కేగిరి. పతివ్రతలకు పతిస్మరణము సర్వాపన్నివారక మనుచుఁ గొందఱు లోలోనఁ గొంచమూరడిల్లిరి. పురుషోత్త మునకు సహజముగ గాంభీర్యము గలదు. అట్టిగాంభీర్యముతో ధైర్యము నవలంబించి తనప్రియురాలిని దృష్టిపఱుపఁబూని వంటయింటికేగి భుజించుటకై కూర్చుండెను. కాని యాపరి స్థితులలో నెట్లాహారము రుచించును. సత్వరము భోజనప్రమే యము ముగించి తనయిల్లాలిని దర్శించినాఁడు. ఆమె యెవ్వరి కొఱకో యెదురుచూచుచున్నట్లున్నది. పురుషోత్తముల మోా మును జూచినది. అటనామెకు గంధాక్షతలు గోచరించినవి. అంతటితో నామె కన్నులనుండి యానందబాష్పములు ప్రవ హింపఁదొడఁగెను. నిర్మలకాంతు లాకన్నులనుండి మొదట పురుషోత్తములనిూఁదను తరువాత ప్రజలపైనిఁ బ్రసరించెను. ఆ విధముగ నామె యిహలోకమునుండి సెలవుగై కొనుచున్న దని వారు గ్రహింపలేదు. క్రమక్రమముగ మనస్సును పర మాత్మయం దనుసంధించి మర్త్యలోకవిముఖయై యైహిక దేహాము విడినది. ఆమెదివ్యతేజస్సు కోటిసూర్యభాసమా నమై యాకాశము నధిరోహించెను. దివ్యు లామెకు స్వాగత

మిచ్చి విమానముపై నెక్కించికొని వైకుంఠమున కేగినట్లు ప్రజ లందఱును భావించిరి. క్షణకాలము ప్రజలకన్నులు మిఱుమిట్లు గొనినవి. అనిర్వాచ్యస్థితిలో నాక్షణమున వారుండిరి.

మరల సర్వత్ర సంధకారము వ్యాపించినది. గుణవతి శరీరము చల్లఁబడినది. కన్నులు కాంతిహీనము లైనవి. తద్జ్ఞ లీలోపున నామెశరీరమును గ్రిందికిదించి వస్త్రముతో దాని నాచ్ఛాదించిరి. గుణవతీపాత్ర మిహలోకనాట్యరంగమునుండి విరమించినది. ఆపతివ్రత సాయంకాలమునందలి సూర్యునివలె తనతేజము నుపసంహరించెను. ఇఁకమిగిలినది పంచత్వము జెందుట కర్హ మగు పాంచభౌతికశరీరము.

శాంతిపురప్రజలు గోడుగోడున నేడ్వసాగిరి. బంధువులదుఃఖము దుర్భరము. పెద్దలను జూచి యర్థమెఱుఁగని శిశువులు సయితము రోదన మారంభించిరి. ప్రకృతియంతయు నంధప్రాయ మయ్యెను. సమీపముననున్న మేఘమొకటి సూర్యభగవానుని గాఢముగఁ గప్పివైచినది. ఇఁకఁజెప్పవసినదేమున్నది. శాంతిపురము ముఖ్యముగఁ బురుషోత్తముల గృహము కళాహీనమైనది. ఇంతలో నొకవృద్ధుఁడు లేచి, "ఓరివెఱ్ఱులారా, భవపాశములఁ ద్రెంచి స్వర్గమున కేగిన యామహాపతివ్రనుగూర్చియా మీరు దుఃఖించుట. ఈశరీరము లెప్పటికైన ననిత్యములు. ఆత్మ యవినాశ్య మైనది.

ఈరెంటిలో దేనినిగూర్చి మీరుదుఃఖించుట. అశాశ్వత మైన పదార్థము దుఃఖించినను రాదు. శాశ్వతమైన యాత్మమునకై దుఃఖించుట యవ్యక్తము. మరణింపఁబోవువారందఱును మరణించినవారికై దుఃఖించుట విచిత్రము". అని యేమేమో యుపన్యసింప నారంభించెను. కాని యాతనిమాట వినువారెవ్వరు. ఎవరెతీరున వారు పూర్వవిషయములఁ బలవించి పలవించి యేడ్చుచుండిరి. తుద కావృద్ధుఁడును దనవేదాంతమును విక్రమించి నిర్విణ్ణుఁ డయ్యెను. ఇష్టములేకున్నను నాదుఃఖమహాప్రవాహములో నాతఁడు కొట్టుకొనిపోవ నారంభించెను. ఇట్లు పురుషోత్తములగృహమంతయు గంద్రగోళముగ నున్నది.

కొంతవడి కందఱు నొక్కక్షణము శాంతించిరి. కలకల మణఁగినది. అయినను ఈ ప్రబలదుఃఖ మింతస్వల్పకాలములో శాంతించిన దనుటకువీలులేదు. జను లలసియలసి విశ్రాంతికై నిశ్శబ్దముగ నుండి రనవచ్చును. మహాసముద్రతరంగములవలె దుఃఖము తెరలు తెరలుగ వచ్చుచుండును. రాబోవుప్రబలతరదుఃఖమున కీశాంతి మెట్టువలె నుండెను. ఇట్టియవకాశమున సచ్చిదానందము తనయూటలనుండి తిరిగివచ్చెను. జను లనేకులు గంభీరముగ మొగముబిగించికొని కూర్చుండియుండుట యాతనికి గోచరమైనది. వారిముఖములు వాచియున్నవి. బంధువులెవ్వరు నాతనితో మాటాడలేదు. తనతల్లి క్రింద పరుండియున్నది. మొగముమీదఁగూడ వ్యాపించుచు శరీరము

నిండుగ ముసుఁ గున్నది. ఆతని కీపరిస్థితులు బొత్తుగ నర్థము కాలేదు. పరుగుపరుగున నతఁడు తల్లిదగ్గఱ కేగెను. అతనినా సమయమున నెవ్వరు నడ్డుపెట్టలేదు. అట్టి శ్రద్ధవహించుటకు వారి మనములం దవకాశములేదు.

చేతితోఁ దల్లిని గొట్టుచు, "అమ్మా, లే, లేవవ్వా నా కాకలివేయుచున్నది. నీవు నాకన్నముపెట్టి చాలరోజు లైనది. ఈరోజు తప్పదు" అని యతఁ డనెను. ప్రత్యుత్తరము లేదు. ఆతఁ డామెశిరస్సునుండి ముసుఁగుతీసి, "అమ్మా నేనెంతపిల్చినను లేవక ముసుగుపెట్టుకొని దొంగనిద్ర పోవు చున్నావా" అని యింకేదో యనఁబోవుచుండెను. ఈ దృశ్య మును జూచినవారందఱకు నాగిపోయినదుఃఖము మఱలసహ స్రగుణముగ నావిర్భవించెను. నలుదిక్కులనుండి రోదనధ్వ నులు మిన్నుముట్టినవి. ఇల్లెగిరిపోవునట్లు ధ్వని బయలుదేరినది. "నాయనా ఇఁక నెక్కడితల్లి" అనుచు సచ్చిదానందము మత్తవతల్లి యాతనిఁ గౌఁగిలించుకొని యేడ్వసాగెను. బాలుఁడు నిర్ఘాంతపడెను. అనిర్వాచ్యదుఃఖానుభవ మాతని హృదయమునందు బాణమువలె ప్రవేశించెను. గుండెలలో రాయిపడినట్లైనది. మనసు వికలమైనది. తుదకు దిక్కుదోఁచక యాతఁడు పెద్దపెట్టున నేడ్చెను. ఈయనుభవమువలన నాతని జీవితమునందును స్వభావమునందును విచిత్రపరివర్తనము సంభ వించెను.

---

# అయిదవప్రకరణము.

## తీర్థయాత్ర.

సచ్చిదానందమునందు స్వభావపరిణామము కననయ్యెను. ఆతనితల్లిమరణమునాఁడు జరిగినవిపరీతానుభవ మనునగ్ని యాతనిజీవనస్వర్ణమును మెత్తఁబఱచి యందు శాంతతాముద్ర నద్దివైచెను. తన కలవాటులగుదుడుకుచేఁతలు మాని యాతఁ డొకచో నాలోచనా నిమగ్నుఁడై కూర్చుండును. కేకలతో నల్లరిసేయు నాబాలుఁడు పిలిచినను బలుకుట కష్టమయ్యెను. బాలురతో నిరంతర మాటలాఁడువాఁడు క్రీడల నొక్కసారిగ మానివైచెను. ఇప్పు డాతనికి తిండియం దభిలాష తగ్గినది. ఎన్నికథలుచెప్పిన, నెన్నిపురాణములు చెప్పినను ముద్ద లోపలికిఁ బోదయ్యెను.

పురుషోత్తముల కిప్పుడు సచ్చిదానంద మొక్కఁడే పుత్త్రుఁడు. దురదృష్టవశమున తదితరపుత్త్రపుత్త్రికాసంతానము స్వర్గగతమయ్యెను. ఆతనితోఁబుట్టు నంతకుమున్నే మరణించినది. సచ్చిదానందమును బోషించుటకుఁ దగునసతి లేదయ్యెను. అందువలనఁ గొంతకాలము బాలునిమేనమామలును పెల్లితల్లియు వానిని సాకుటకాతఁడు సమ్మతించెను. అట్టి

యర్ధాంగితో మెలఁగినపురుషోత్తముల కిప్పుడు కేవలై కాంతజీవనము తటస్థించినది. సచ్చిదానందమునెడల మాత్ర మాతని మేనమామలు సంపూర్ణప్రేమవృత్తి గలిగియుండిరి. ఆతని ప్రస్తుతశుష్కస్థితికి వా రెంతయు వగచిరి. వారును వారి తల్లియుఁ జేయతగినదంతయుఁ జేసిరి. కాని లాభము లేదయ్యెను. వారిలోఁ బెద్దవాఁడు వీరభద్రశాస్త్రి. పొట్టికాయము పాటిశరీరము. చామనిచాయగలవాఁడు. లోకములో నాతనికి "అజాతశత్రు" వని బిరుదుగలదు. మఱియు నాపద్బాంధవుఁడనుటయు నతిశయోక్తి కాదు. ఆమహామహుని యాశ్రయమున మనసచ్చిదానందమున కేమికొఱత యుండును. సచ్చిదానందమున కిప్పుడు కలిగినశుష్కతను మాంద్యమును మాన్పుటకాతఁడు బాలునితో వేదాద్రిలక్ష్మీనృసింహస్వామిని దర్శింప సంకల్పించెను. కృష్ణవేణీస్నానము, ప్రకృతిసందర్శనము, స్వామియనుగ్రహమును మహోపకారకములు కాగలవని యాతనిదృఢవిశ్వాసము.

అది వర్షకాలము. మార్గములు దుస్తరములుగ నున్నవి. ఏర్లు నిండి ప్రవహించుచున్నవి. ఉరుములును బిడుగులును మెఱుములును భయోత్పాదకము లగుచున్నవి. కుంభవర్షము నిరంతరముగఁ గురియుచున్నది. సామాన్యుల కివి ప్రయాణదినములు కావు. కాని మనయాపద్బాంధవుని తీర్మానమా బ్రహ్మదైనను మసల్పఁజాలఁడు. సుముహూర్తము నిశ్చయించి

యొకానొకదినమున వారిరువురును బయలుదేరిరి. శాంతిపురము నుండి వేదాద్రికేగుమార్గ మరణ్యములమధ్యనుండి కలదు. వారిరువురును గ్రామములదాటి త్వరలో నరణ్యముఁ బ్రవే శించిరి. బాలునకు శ్రమగలుగునని మేనమామ కొంచెమునే పాతనిని భుజములపై నెక్కించుకొనుచుండును. కొంచెమునేపు చక్కనికథలఁ జెప్పుచు నాతనిని నడపించును. ఒక్కొక్కచో వారిరువును విశ్రాంతికై కూర్చుందురు. సాయంకాలమున కేదోయొక గ్రామముఁ జేరి వారు విశ్రమింతురు.

అరణ్యములలోఁ బ్రయాణ మతిముదావహము. సచ్చి దానందమున కరణ్య ప్రయాణము సంతోషాశ్చర్యజనక మయ్యెను. ఒకచోట వృక్షములు మెండుకొని గంభీరముగ నుండును. అక్కడ నేపొదచాటునఁ బెద్దపులులు గలవో, ఏగుట్టచాటునఁ జిఱుతపులులు గలవో, ఏడొంకమఱుగున నెలుగుబంట్లు కలవో యనుభయ మనుక్షణము స్ఫురించుచుం డును. ఒకసమయమునఁ బెద్దకొండవాగు లడ్డము వచ్చును. వానిలోతు తెలియదు. నడి నిర్ణయించుట సులభముగాదు. సాహస మున్నగాని వర్షకాలమున వానిని దాటుట కష్టము. ఒక్కొక్కస్థలమునఁ గమ్మనిపుష్పసుగంధము ఘుమఘుమలా డుచు వ్యాపించును. ఆవాసన యేపుష్పములనుండి వచ్చినదో, అంత సుగంధకుసుమములుగల లత యేదియో కాన్పింపదు. ఒకప్రదేశమున రక్తప్రవాహమా యని యనుమానము

గలిగించునట్లు గైరికధాతుమిళితమైన జలప్రవాహములుపాఱుచుం
డును. ఒకతావున సమూయికము లగులేడిపిల్లలు చెంగుచెంగున
నెగురుచుఁ గన్నులకు విందువు సేయును. మార్గ మొకసారి
రాళ్లతో నిండియుండును. ఒకపరి పచ్చికలతో మృదువుగ
నుండును. బహువిధపక్షికూజితములు చెవుల కమృతప్రాయ
మగును. ఇట్లున్న ప్రదేశమున నీవిశేషములను బాలునకుఁ
జూపించి యానందించుచుండియు వీరభద్రశాస్త్రికి మనమున,
స్వస్థత లేదయ్యెను.

ఇంటికడ పైరుపంట లెట్లుండెనో యనుచింత యొకటి.
తనకొఱకు పామమంత్రమునకై యెందఱు వచ్చియూరక
తిరిగిపోవుచున్నారో యనువిచార మొకటి. మార్గ మెట్లు కడ
చునా యనుకించ యొకటి. బాలున కెట్లు త్వరలో స్వస్థతలభిం
చునురా పరమేశ్వరా యనుజిజ్ఞాస యొకటి. ఇట్టిస్థితివలన
నాతనిమనఃస్థైర్యము సడలినదయ్యెను. కాని బాలునియుత్సాహ
మింతింతకాదు. జల్లులలోతడియు టాతని కాటగ నుండెను.
ఎండలో మాడుట విలాసము. అరణ్యసంచార మొకపెద్దసంబ
రము. బాల్యమునకుఁ దుల్యమైనవయస్సు మఱియొకటి లేదు.
అది చింతయు చీకును లేనియుక్తసమయము. బాల్యమునందలి
యుత్కృష్టతను జూపించుటకే పరమేశ్వరుఁడు యౌవనమును
వార్ధకమును నేర్పాటుగావించినాఁడు.

తీయగా తీయగా రాగము వచ్చినట్లు నడువగానడువగా మార్గము గడచినది. కొలఁదిరోజులలో వారు కృష్ణానదీతీరమును జేరిరి. వారచ్చటికిఁ జేరునప్పటికి సాయంకాల మయ్యెను. క్రొత్తనటిపిలతో నెఱ్ఱఁబడిన కృష్ణాప్రవాహము సాయంసమయసూర్యకాంతులతో మఱింత యెఱ్ఱఁబడెను. కృష్ణ వెల్లువ భయంకరముగ నుండెను. అత్తవారింటికిఁబోవుయువతి యిటునటు పొటుగింట్లలోఁ బ్రవేశించి సెలవుఁదీసికొనుభాతి, యానదీమతల్లి సముద్రునిజేరఁబోవుచు నిటుగు పొటుగు గ్రామములోఁ బ్రవేశించెను. అత్తవారింటికి సారెగొనిపోవునట్లు పెద్దపెద్ద వృక్షములను, -వొప్పవాములను, తుదకు పశువులను మనుష్యులనుగూడ నాయమ కొనిపోవుచుండినది. పల్లెవాండ్రు సాధ్యమైనంతవఱకు వృక్షముల నొడ్డునకుఁ జేర్చుచుండిరి. ప్రజలొడ్డున నిల్చుండి కొట్టుకొనిపోవుచున్న ప్రాణులను జూచి కన్నీరుగార్చి యూరకుండిరి. పూర్వపువఱదల కథలన్నియు వారికి జ్ఞప్తికి వచ్చెను. కృష్ణయీవలియొడ్డునుండి వేదాద్రీశుని దేవాలయశిఖరములు గోచరమైనవి. శ్రీయోగానందనృసింహుని సాత్వికతేజములా యన్నట్లు నవసుధాధౌతకుడ్యముల కాంతులు సర్వత్ర వ్యాప్తమైనవి. శ్రీకృష్ణవేణి యాతనిపాద సేవ నభిలషించినదివోలె క్రమక్రమముగా మెట్ల నెక్కినది. ఈవైభవమునంతను జూచుటతో మన ప్రయాణికులకుఁ జీకటిపడినది. ఆరాత్రి వారాప్రక్కనున్న పల్లెలోఁ గడపిరి.

ఆరాత్రియంతయు వారికి శ్రీయోగానంద నృసింహునిగూర్చిన దివ్యగానములతోఁ గడచెను.

మరునాడుదయము మామయు నల్లుడును పడవ నెక్కిరి. బాలుఁడు పడవనెక్కుట కది మొదటిసారియగుటచే నాతని కత్యంతవిచిత్రముగ నది కన్పట్టెను. పడవయూపున కాతఁడు భయపడ వీరభద్రశాస్త్రి యోదార్చి యచటిదృశ్యములయం దాతనికి నుత్సాహము గల్గించెను. "నాయనా! ఇది యిట్లే కదలుచుండును. భయ మేమియు లేదు. ఆపిట్టలను జూడుము. నీటిమీద నెగురుచు నెట్లు ఒడుపుతో పై కెగురుచున్న బేడిస చేపలను గ్రహించుచున్నవో. కుడిచేతివైపు నదిమధ్య నొక దీవి యున్నది చూడు. అందు కొంగలు కన్నులుమూసికొని కదలక తపస్సు చేయునట్లు నీటిలో నిలిచియున్నవి. పాప మమాయికపుఁజేపలు వానివద్దకుఁ జేరగనే యవి వానిని మ్రింగివేయును. ఆవైపున, కట్టెలు గొట్టుకొనివచ్చు నెంతో స్నేహముతో కౌగిలించికొనిపోవునట్లు కొంతదూర మేగుచు న్నవి. ఏగాలియోతగిలినవెంటనే యవి యెడమయిపోయి యొక దానికొకటి సంబంధములేని వగుచున్నవి. లోకములోనిచుట్టఱి కములిట్టివే. ఆతుంగలు నదినెదుర్కొనకుండ వినయముతో నేవిధముగ వంగివంగి సలాములు చేయుచున్నవో చూడుము. సమయోచితముగ నణఁగి మణఁగి యుండువారి కీరీతి నాపదలు తప్పి మరల సుస్థితి చేకూఱును. ఒడ్డున నీలుగుతోఁ బ్రవా

హమున కడ్డముగనిలిచినవృక్షములు మొదలంటవిఱిగి పడిపోవు
చున్నవి సుమా. నిండువిభవముతోఁ దులతూగుచున్నదని
యీనదిని జూచుట కెన్నివేలమంది ప్రజలు దరిఁజేరినారు.
పాప మెండకాలము తిప్పలుబయటఁబడి శుష్కించియున్నప్పు
డీయాప్తులలో నొక్కరుగూడ నీచాయఁ జూడరు. ఈజలమయ
మైనరాజ్యములోఁ బల్లెవాండ్రు రాజులు. పడవలు భవనములు.
మనము ప్రజలము. వారివాక్కెక్కడ శాసనము. వారియాజ్ఞ
ననుసరించి మన మేమూల కూర్చుండవలెనో యచ్చటనే
కూర్చుండవలెను. వారి కీయవలసినపన్ను చెల్లించుటావశ్యకము.
ధరణీశ్వరులవలె పాలించుటతో నూరకుండక పరమేశ్వరులవలె
వారు మనలను దరింపఁజేయుదురు. ఈ లోకప్రవాహముల
యందును సముద్రములయందును దరించుటకు వారినే యాశ్ర
యింపవలసియున్నది. అదిగో మన మాశ్రీనృసింహుని సమీ
పించుచున్నాము. ఆతనిదివ్యకరుణాప్రవాహ మీవర్షకాలపుఁ
గృష్ణానదివంటిది. పూర్వకాలమున నీవంటిబాలభక్తుఁ డగు
ప్రహ్లాదు నామహామహుఁడు సంరక్షించినాఁడు. అప్పుడు
భయంకరనరసింహరూపముఁ దాల్చి దుర్మార్గుఁ డగుహిరణ్యా
కశ్యపుని సంహరించినాఁడు. కాని యాభయంకరరూపమును
జూచి సామాన్యప్రజలు పరుగెత్తిపోవుదు రనితలఁచి యిచ్చట
యోగానందమూర్తి యనుపేరుతో సాత్త్వికాకారమునఁ బ్రత్య
క్షముగ వెలసినాఁడు. ఆపరాత్పరుని యాలయములును మంట
పములు నెంతవిశాలములుగనున్నవో చూడుము. ఎన్నిలక్షల

మందిభక్తు లాయన దర్శనమునకు వత్తురో, ఎన్ని వేలమంది యిచటనసేకదినము లుండి యాతనిసేవింతురో; ఎందఱు వివిధ సాంసారికబాధలనుండి విముక్తిఁ బొందుదురో, ఎందఱు కేవలము మోక్షసామ్రాజ్యము బొందుదురో నేనువర్ణింపఁ జాలను. నాయనా ఇదిగో తీరముఁ జేరినాము. భక్తిపూర్వకముగ నాపరమాత్మ్మని స్మరించుచు నాతని దివ్యసన్నిధికిఁ జేరుదము రమ్ము.” అనిచెప్పుచు బాలుని దీసికొని నూమ సోపానములనిూఁదుగ దేవాలయమున కేగెను.

వేదాద్రి, బెజవాడకెగువను కృష్ణాతీరమున జగ్గయ్యపేట యనుపట్టణమునకు సమీపమున నున్నది. దాని కెగువను కొలఁదిదూరమున ముక్త్యాల గలదు. ఇది ముక్త్యాలసంస్థానాధీశుని నివాసము. వేదాద్రి పంచనృసింహక్షేత్రము. కృష్ణ యిచట రెండుకొండలమధ్యగఁ బ్రవహించుటఁజేసి దాని మార్గ మిచ్చుటనుండి మారదు. నృసింహాలయ మొకచిన్న కొండపై నున్నది. ఆకొండపేరు వేదాద్రి. దేవాలయమువద్ద నుండి నదివఱకును సోపానములు గలవు. ఆసోపానములకుఁ గ్రిందుగ నదిలో సాలగ్రామనృసింహస్వామి కలఁడు. ఈ సాలగ్రామము నిరంతరము మిక్కిలిలోతుగల నీటిలోనుండును. అంతకంటె మఱికొంతలోతున నొకలింగము కలదు. అది సాధారణముగ నీటిపైని కనఁబడదు. కొండపైని వెనుకభాగమున శ్రీజ్వాలానృసింహస్వామి కలఁడు. మూలవిరాట్టుపేరు శ్రీయోగా

వందలక్ష్మీనృసింహస్వామి. ఈ విగ్రహము కేవలసాత్త్విక యోగమూర్తి. పిశాచాదిపీడలుగలవారును, రోగులును ఐహికాముష్మికఫలముల వాంఛించినవారును ప్రదక్షిణములుచేయుచు నచ్చట ననేకదినము లుందురు. తుదకు శ్రీస్వామి స్వప్నమునఁ గాన్పించి, సెలవొసంగినవెంటనే బ్రాహ్మణసమారాధనము గావించి వెడలిపోవుదురు. యాత్రికులు నివసించుటకు దేవాలయముచుట్టును పెక్కుమంటపములు గలవు.

ఇట్టిపవిత్రక్షేత్రముఁ జేరి మనయాత్రికులు ధన్యులైరి. ఈకొండ నెక్కినమాత్రమున కొండనెక్కినంతసంతోష. మనుమాట సార్థకముగ సచ్చిదానందమున కనుభవమైనది. మొట్టమొదట వారుధూళిదర్శనము గావించిరి. పిదప కృష్ణాస్రవంతియం దఘమర్షణస్నాన మాచరించి కనులార దేవుని దర్శించి ప్రదక్షిణపూజాదివిధులను దీర్చికొనిరి. అప్పటికిఁ బ్రొద్దెక్కియుండుటవలన నక్కడనున్న దుకాణమునందు సంభారములను దీసికొని వీరభద్రశాస్త్రి ధర్మశాలయందుఁ బాకము సిద్ధముచేసెను. భోజన మైనతరువాత వారిరువురును మార్గాయాసముచే డస్సియుండిరిగావున గాఢముగ నిద్రించిరి.

---

# ఆరవ ప్రకరణము.

—————:o:—————

## పురాణపఠనము.



వారు నిద్రలేచునరి కొక శ్రీవైష్ణవుఁడు ప్రత్యక్షమయ్యెను. "శాస్త్రిగారూ! పురాణపఠనము ప్రారంభింపఁబోవుచున్నారు, శ్రీకందాళ రామానుజాచార్యులవారు సుప్రసిద్ధపౌరాణికులు. దయచేయరూ" అని యాతఁడు శాస్త్రిగారితో ననెను. చిత్తమని వారిరువురును వైష్ణవునితోఁ బురాణశ్రవణార్థ మేగిరి. వీరభద్ర శాస్త్రి గొప్పపండితుఁడు. పౌరాణికుఁడు, శ్రోత్రియుఁడు, సంగీతవిద్వాంసుఁడు, భక్తుఁడు, లోకార్థములను జక్కఁగ నెఱిఁగినవాఁడు, స్వార్థత్యాగి, కేవల పఠనముతో నాతనికిఁ దృప్తితీరదు. ఆచరణమునం దాసక్తి మెండు.

పౌరాణికుఁడు శ్రీమద్భాగవతమునందలి గజేంద్రమోక్షణకథ నారంభించెను. హస్తవిన్యాసముతోడను రాగధోరణితోడను శ్లోకములఁ జదివి మహాజనులకు వానిభావమును దెలుపుచు చుండెను. ఒకసందర్భమున నాతఁ డిట్లు వచించు చుండెను. "మహాజనులారా! ఆ శ్రీమహావిష్ణువు గజేంద్రుని మొఱ విని తనముల్లెపోయినట్లు పరువిడి వచ్చినాఁడు.

ఆవచ్చునప్పుడు లక్ష్మికైనను జెప్పక చక్రమునైనను ధరింపక రాఁగాఁ బరివారమును నాయుధములును నాతని నను సరించి వచ్చినవి. మకరిని ఖండించి గజేంద్రుని రక్షించుపట్టు నాతనికిఁ ప్రవృత్తి లేదయ్యెను. లోకసంగ్రహార్థ మాతఁ డిట్లు త్వరపడినాఁడు. పరోపకారము నార్తరక్షణముఁ బరమధర్మము లని లోకమునకుఁ జాటుటయే యాతనిపరమోద్దేశ్యము. ఒక కవి చెప్పినట్లు,

"శ్లోకార్ధేన ప్రవక్ష్యామి య దుక్తం గ్రంధకోటిభిః।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం॥"

అని మఱియేమో చెప్పఁబోవుచుండ నదీతీరమునుండి యార్తా లాపములు వినఁబడెను. ఆసమయమునఁ బ్రజలందఱును పరోపకారము లెక్కువఁగఁ జేయుచుండవలె నని భావించు చుండిరి. పూర్వము తాము చేసినయుపకారములను స్మృతికిఁ దెచ్చుకొనుచుండిరి. ఆవేడిలో నొక్కపట్టుగున నార్తుల రక్షింప వలె ననుతీర్మానముతో వారు నదీతీరమునకుఁ బరుగెత్తిరి.

అట వృద్ధదంపతులు నదియందుఁ గొట్టుకొనిపోవుటఁ గాంచిరి. ఆదంపతులు బహుదూరప్రయాణముఁ జేసి ప్రొద్దు తిరిగినతరువాత వేదాద్రి చేరిరి. వెంటనే స్నానము చేయు నుద్దేశముతో బ్రహ్మముడివైచుకొని కృష్ణాస్రవంతిలోనికిఁ దిగిరి. అది అందరకును విశ్రాంతిసమయమగుటచే నొద్దున

నెవ్వరును లేరు. ఆవృద్ధుఁడు రేవు చక్కఁగ నిర్ణయింపలేక మెట్లులేనిచోట నడుగు వైచెను. దానితో నాతఁ డగాధజలములోఁ బడెను. తోడనే బ్రహ్మముడివలన వృద్ధురా లగు నాతనిభార్యగూడఁ బడిపోయి వారిరువురును రేకలు వైచిరి. ఇది యీవృద్ధదంపతుల వృత్తాంతము. ఇఁక నచ్చటఁ జేరిన పురాణవైరాగ్యావిష్టు లగుజనులు వారిని జూచి, "అయ్యో! యనువారును, పాప మనువారును, ప్రవాహము వేగముగ నున్న దనువారును, ఇంటికడ వారిబంధువు లెంతఘోషింతురో యనువారును, వారిప్రాణము లెంత కొట్టుకొనుచున్నవో యనువారును, నిట్లు పలువిధముల విచారమును వెలిబుచ్చువారు పెక్కురు బయలుదేరిరి. ఒక పెద్దమనుష్యుఁడు, "అరువది యేండ్లు దాటిన నస్తావిస్త మనుట వీరియందు సార్థక మైనది. ఈ దంపతులు బుద్ధిహీనులు. ఎవ్వరు లేనిసమయమున స్నానము చేయవలయును. చేసిరిపో! లోతున కెందుకు పోవలయును. స్వయంకృతాపరాధమునకుఁ దగినశాస్తి యైనది. కృష్ణలో స్నానము పసిపిల్లలతో చెలగాటము కాఁబోలు వీరికి" అని గద్దింప మొదలిడెను. ఒక వైశ్యయువకుఁడు, "నాకీత వచ్చిన వారి నిట్లు పోనిత్తునా" అని తనగాంభీర్యమును జూపెను. ఒకముదుసలిరైతు, "నేను చిన్నప్పుడు గజయీతకాఁడను. ఇటీవల వార్ధకమువలన శరీరము స్వాధీనమునం దుండుటలేదు. నాకే వీలున్న నింతసేపా, అనేకప్రాణులను గాపాడినవాఁడ నిది యొక లెక్కా" అని తనపూర్వప్రతాపమును

వెల్లడించినాఁడు. ఒకవృద్ధవనిత కుమారునితో, "నాయనా! నీవేమో నీటిలోదిగజూచుచున్నట్లున్నావు. పచ్చకర్పూరమవు. నాతండ్రి నీమీాద ప్రాణములుపెట్టుకొని మేమందరము బ్రతికియున్నాము. వద్దువద్దు. సాహసము కూడదు. నీవు దిగితివా నేనుగూడ యిదే కృష్ణలో దిగుచున్నాను." అని గట్టిగా వాతని కౌఁగిలించుకొనెను. ఒకయర్చకుఁడు, "శ్రీనృసింహునికృపవలన నిట్టి దెన్నఁడు నెఱుగను. ఎవరికర్మము పూర్వజన్మప్రారబ్ధము వారి నీడ్చికొని పోవుచుండును. మన మేమి చేయఁగలము, నుదుటఁ వ్రాసినవ్రాలుకన్నఁ గలదా నూఱేండ్లు చింతించినఁ" అని తనమెట్టవేదాంతమును బ్రకటించినాఁడు. పౌరాణికుఁడు గూడ నిట్లే దయదలఁచుస్థితిలో నుండెను. కాని సహాయము చేయసమర్థుఁడు గాఁడయ్యెను. పడిపోయినముసలి వానికిఁ గొంచె మీాఁత వచ్చియుండుటచేఁ గొంతవడి పెనఁగులాడుచుండెను. అయినను నదీవేగ మతితీవ్రముగ నుండుట చేతను, ముసలిది తనను గట్టిగ బట్టుకొని యుండుటచేతను, అతనికిఁగూడ చావు నిశ్చిత మయ్యెను.

వీరభద్రశాస్త్రి చిఱునవ్వు దోఁప, "ఇదిగదా ప్రపంచవృత్తము. అందఱును జింతించువారే. ఒక్కరును సాయముఁ జేయువారు లేరు." అని తనలో ననుకొని బాలు నెవ్వరికో యప్పగించి పంచ బిగించికట్టి, నదిలో దుమికెను. ప్రజ లాశ్చర్యనిమగ్నులైరి. సత్వరము నాతఁ డీబదిగజములీఁది

యాదంపతులను సమీపించెను. ఇతఁడు పరోపకారదిక్షుఁ డని కొందఱు శాస్త్రిని బ్రశంసించిరి. మఱికొందఱు దుర్ఘటకార్య మును దలపెట్టినాఁ డీతని కేమి యాపద సంభవించునో యని చింతించిరి. ఇఁకఁ గొంద ఱాతని సాహసమునకు నిందించిరి. ఒకపండితుఁడు. "సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదం" అనెను. ఇంతలో మనస్వార్థత్యాగి యాదంపతుల శిరోజములను దనకుడిచేతికి దొఱకించుకొనెను. ముసలివాఁ డీతనిని బట్టుకొనఁబోఁగ శాస్త్రి యాతనిని విదలించి వై చెను. ప్రబలాయాసముతో నెడమచేతితో నీదుచు కుడి చేతితో వారల నీడ్చుకొని వచ్చుచు, కృష్ణానదీవేగమునకుఁ దల్లడపడుచు మహాప్రయత్నముతో నాతఁ డొడ్డునకుఁ జేరెను.

ఆతఁ డొడ్డునకుఁ జేరినచోటు దేవాలయమున కరమైలు దూరమున నుండెను. ఆ సమయమున కెవ్వరో పల్లెవాండ్రా స్థలమునకు వచ్చిరి. వారందఱు కొలఁదికాలములో దేవాలయ మును జేరిరి. ఆరోజు శ్రీలక్ష్మీనృసింహదేవాలయమున నంద ఱును వీరభద్రశాస్త్రిని బ్రశంసించువారే. అందఱును నమ స్కరించువారు. అందఱు నాతనిని సచ్చిదానందమును భోజన మునకుఁ బిల్చువారే యైరి. ఆదంపతుల కృతజ్ఞతకు మేర లేదు. వారీయవచ్చినబహుమానములను శాస్త్రిగారు గ్రహింపలేదు.

సాయంకాలము గావచ్చినది. భక్తులు సాయంసమయ కృత్యములను దీర్చికొని శ్రీవారి సాయంసమయపూజకు సిద్ధమైరి. కొందఱప్పటికే తమ ప్రదక్షిణములను బ్రారంభించిరి. పిశాచావిష్టులు శ్రీనృసింహుని తేజమునకుం దాళలేక కేకలు వేయుచు నేడ్చుచు పడిపోవుచు మరలం బ్రదక్షిణములు గావించుచుండిరి. తదేకదీక్షతోం గొందఱు ప్రాణాచారము పడియుండిరి. సచ్చిదానందమును వెంటనిడికొని మామయ్యం బరిక్రమములు గావించెను. సంజచీకటులు గ్రమ్మినవి. పగలంతయు యాత్రికులను శ్రమపెట్టినకోంతులు శ్రమ యడంగునట్లు తమ నివాసములకు విశ్రమింపం బోయినవి. సమీపారణ్యము నుండి ఘూకారావములు వినవచ్చెను. సాయంకాలపూజకు వైష్ణవార్చకుండు గంట మ్రోగించుటతోడనే భక్తు లందఱును దేవాలయములోని కేగిరి. అఖండములకాంతిలో దేవాలయాంతర్భాగముననున్న శిల్పకలానైపుణ్య మద్భుతముగం బ్రకాశించుచుండెను. గర్భాలయమునుండి శ్రీయోగానందమూర్తి దివ్యవిగ్రహము కన్నులపండువైనది. భక్తాభీష్టప్రదమైన యోగదండముతో, శంఖచక్రాదిలాంఛనములతో, సర్వసంపత్ప్రదాయిని యగులక్ష్మితో నామహానుభావుండు సాత్వికాకృతిని భక్తుల కనుగ్రహించెను. అచ్చట నందఱు సాష్టాంగప్రణామములు గావించిరి. కొందఱు పాటలు పద్యములును బాడిరి. కొందఱు నిర్మలముగ శాంతముగ నాసీనులయి యుండిరి. సచ్చిదానందము చిన్నవాండయ్యు నాతని కాసమయమున

నపారభక్తి గలిగెను. ఆభక్తి భావిశుభసూచకమై తన్మయత్వము నాపాదించినది. ఆనృసింహునిదివ్యతేజ స్సాతనిహృదయమునందుఁ బ్రవేశించి దిగులుఁబాపి తేజోవంత మగుసాత్త్విక స్వభావము నాతని కొసంగెను. అచ్చటి దృశ్యము లాతనికి సంతోషము నిచ్చి దీనవృత్తిని మాన్పినవి. ఇట్టిపరిణామమును వీరభద్రశాస్త్రి యభిలషించినాఁడు గాన నాతని యుద్దేశము సఫలమైన దనవచ్చును. ఆతఁడును భక్త్యావేశపూరితుఁడై తనమృదుమధురస్వరముతో సావేరిరాగము నాలపించి యొక్క భగవత్కీర్తనమును బాడెను. ఆకీర్తనమును వినుటకు భక్తులందఱును స్వస్వవ్యాపారములను విరమించి చెవులు దోరగిలఁ బెట్టిరి. ఆకీర్తనయనంతరమాతఁ డీక్రిందివిధముగ శ్రీనృసింహుని స్తోత్రముఁ జేసెను.

“ దేవాదిదేవా ! నీయనుగ్రహలేశము నాకాంక్షించి నీదివ్యపాదసేవఁ గావింప వచ్చినభక్తులను మమ్ము దయజూడుము. నీకటాక్ష మణుమాత్రమైనను నగ్నికణమువలె మాఘోరకలుషాటవులను దహించును. నీపాదరజఃకణము బడబాగ్నివలె సంసారవార్ధి నింకింపఁజేయును. నీకరుణాప్రసారము ప్రబలాసారముఁబోలి భవతాపాగ్నుల నడంచును. ప్రభూ ! నిర్గుణుఁడవయ్యు రజోవృత్తి నవలంబించి జగముల సృజించుచున్నావు. సత్త్వమూర్తివై లోకములఁ బెంచెదవు. తమోగుణము నధిష్ఠించి విశ్వము నణంచెదవు. పాలసముద్రముకంటె వైకుంఠముకంటె లక్ష్మీవక్షస్థలముకంటె భక్తులహృదయములు నీ కత్యంతప్రియనివాసములు దుష్టశిక్షణార్థమును శిష్టరక్ష

ర్థమును నిరంతరజాగరూకుఁడవై మెలంగుట నీస్వభావము. ధర్మహాని సంభవించినపుడెల్ల యుచితావతారధారివై ధర్మప్రతిష్ఠ గావించి మరల వైకుంఠము నధివసింతువు. నీవు లేనిప్రదేశము లేదు. నీవు కానిపదార్థము లేదు. సర్వవ్యాపివై సర్వము నీయం దిముడ్చుకొనుచున్నావు. నిరాకారుఁడవై లోకుల ననుగ్రహించుటకు సాకారుఁడ వగుచున్నావు. బాలు భక్తాగ్రగణ్యుఁ బ్రహ్లాదుఁ గాపాడ శ్రీనృసింహభీకరాకృతిని స్తంభంబున జనియించి హిరణ్యకశిపుఁ దునిమితివి. నీయుగ్రాకృతిఁ గాంచి భీతిల్లిన దేవమానవులఁ బ్రార్థనము లాలకించి సాత్త్వికవృత్తి నవలంబించితివి. ఇట యోగానందమూర్తివై మమ్ము బాలించుచుని న్నేమని వినుతిసేయుదును. యోగిమానసహంసా! నిత్యా! నిరంజనా! నిర్వికారా! నిరామయా! విష్ణూ! మధుసూదనా! ఫాలాక్షసఖా! పరమకారుణికోత్తమా! మాయామానుషవిగ్రహా! అచ్యుతా! శ్రీవేదాద్రినృసింహా! నమస్తే నమస్తే నమః.

ఈ స్తోత్రము భక్తుల కందఱ కమందానందదాయకమై తన్మయస్థితిని జేకూర్చెను. ఆ సమూహమునందు వీరభద్రశాస్త్రిని బ్రస్తుతింపనిమానవుఁడు లేడు. ఆరాత్రి పూజలు ముగిసినతరువాత ప్రసాదమును గ్రహించి యెవరినివాసస్థలముల వారు శయనించిరి. ఈవిధముగ సచ్చిదానందమునకు శ్రీనృసింహునిసేవ మూడురోజులు లంభించెను. అంతకంటె నెక్కువకాల ముండుట కాసక్తి గలిగియుండియు మామగారి

కింటికడ నత్యావశ్యకము లగుపను లుండుటచే వారు సత్వర మింటికిఁ బోవలసినవారైరి. వేదాద్రిలో నున్న భక్తులుశాస్త్రి గారిని విడుచుట కెంతయు దుఃఖించిరి. కాని యాయన కొక చోట నుండుటకుఁ దీరదు. పరోపకారమే యాతని జీవనసారము గాన పరాత్పరునివలె నహర్నిశము నాతఁడు జాగరూకుఁడై శ్రమపడవలసియుండెను. కావున వెంటనే బయలుదేరి యల్లుని వెంబనిడుకొని యాతఁడు కృష్ణానదిని దాటి యరణ్యమార్గమున స్వగృహముఁ జేరెను.

ఇంటికడ నొకచిన్న నృసింహదేవాలయము ప్రతిష్ఠింపఁబడెను. దానికిఁ బ్రదక్షిణములు చేయుచు నాదేవునకు భక్తి సేయుచు సచ్చిదానంద మానృసింహుని యనుగ్రహమున దిగులుపీడి దినదినాభివృద్ధి నందుచుండెను. అట నొకపాఠశాలలో నాతనిఁ జదువవేసిరి. ఆగ్రామమునం దంతగా విద్యాభివృద్ధి కనకాశములు లేనందునఁ బురుషోత్తములు పట్టణమునం దాబాలునివిద్యాభ్యాసమున కేర్పాటులు చేయదలఁచెను. ఇంతబాల్యమున విద్య కేమితొందర యని మేనమామలును వారితల్లి యును గొంచెము చెప్పిచూచిరి. పురుషోత్తముల కావిషయము నచ్చదయ్యెను. భావిశుభసూచకమయ్యు నీపురుషోత్తములతీర్మానము తత్కాలమున బాలునకుఁ గష్టదాయకము కాఁజొచ్చెను.

---

# ఏడవ ప్రకరణము.

'మాతృహీనశిశుజీవనం వృథా.'

నిర్గుణనిరాకారనిరంజనస్వరూప మగుపరబ్రహ్మము నుండి దివ్యసంకల్పముచే విశ్వరూప మగుప్రకృతి భాసిల్లుచున్నది. అట్లు బయలుదేరినప్రకృతికిని బరమపురుషునకును గల యవినాభావసంబంధమే శృంగారరస మనఁబడుచున్నది. ఈశృంగారరసమునందలి ప్రధానభావమును ప్రేమ యనుచున్నాము. కరుణాకరుఁ డగుశాశ్వతపురుషుఁ డీబ్రహ్మాండముక్తాఫలమును ప్రేమసూత్రగ్రథితముఁ జేసి తనకంఠమునందు వ్రేలవైచికొనినాఁ డని కవులు వచింతురు. ప్రేమచేతనే ప్రకృతి పరమాత్మునియందు లీన మగుచున్నది. అనగా సృష్టిస్థితిప్రళయములు ప్రేమకృతము లనుట. ఆపరమేశుని జగద్వినుతలీలలు ప్రేమాపూరితములు. అతఁ డనంతప్రేమతో సర్వవ్యాపి యగుచుండును. ప్రేమమయుఁడై యాపరంజ్యోతిస్వరూపుఁడు ఆ యాసమయములయందు ధర్మగ్లాని గలుగఁగ దుష్టశిక్షణమును శిష్టరక్షణమును జేయును. శ్రుతిస్మృతిపురాణేతిహాసశాస్త్రకావ్యాదులన్నియు నామహామహుని ప్రేమస్వరూపునిగ గానము చేయుచున్నవి.

ప్రేమసంగ్రథిత మీచరాచరాత్మకవిశ్వము, విశ్వవ్యాప్తినంది యుండునసంఖ్యాకనక్షత్రమండలములవలె ననేకయుగపర్యంతము నంతరాళమున వ్రేలుచు నిరంతరానేకసహస్రయోజనప్రయాణశీల యగుపృథ్వియు, పృథ్విసచ్చటచ్చట మహోన్నతములై భూభారవహనదక్షములై యద్భుతజనకము లగుపర్వతములును, పర్వతపార్శ్వములయందు జనించి ప్రబలవేగమున ప్రియసముద్రుఁ జేరఁబోవు నదీనదములును, నదీనదపర్వతప్రాంతముల స్వేచ్ఛగఁ బెరుగుచుండు కుసుమఫలభారనమ్రకమ్రతరుసంతతులును, తరుసంతతుల నాశ్రయించి మంజులమృదుకలకలారావముల శృతిసుఖముగ నీశుమహిమ నుగ్గడించుపక్షిసమూహములును, పక్షిసమూహములతోఁ దాము నాకసమున స్వేచ్ఛగ నెగురలేకపోయినను భూభాగములయందుఁ దమతమయిరవుల సకలసుఖముల నందియుండు పశువులును, పశుపక్షిక్రిమికీటకాదుల నధఃకరించువిజ్ఞానసంపద నీసృష్టి కధిరాజులై యేలు మానవులును, మానవులకంటె నధికానందస్థితియందు భాసిలుగంధర్వయక్షకిన్నరకింపురుషసిద్ధసాధ్యాదిదేవయోనివిశేషములును ప్రేమపరంపరల కధిష్ఠానములనుటకు సందియము లేదు.

వృక్షము లొండొరులసాయమున వాయుదేవునెదుర్కొని స్థిరముగ నున్నవి. తీగ లల్లిబిల్లిగ వృక్షములపై నల్లుకొని తదాశ్రయమున నానందజీవనము ననుభవించుచున్నవి. జం

14

తువులు గుంపులు గుంపులుగ జీవించును. ఆఁడులేడి తనమగ
నిని శరీరమునందు ముట్టితో గోకి సుఖము నిచ్చుచుఁ దత్ప్రే
మపాత్రమగును. మగకోయిల తనప్రియురాలికి లేమావికెం
జిగురులఁ దెచ్చియిచ్చి తద్బహుమానార్హమగును. తేనెటీఁగ
జంపతు లొకకమలపాత్రమునం దేకసమయమున మధువునార
గించును. ఇట్టి నిర్మలతిర్యక్ప్రేమను రసాభాసమనుట కాలం
కారికులు వెట్టులు గావలయును.

ఇఁక మానవప్రేమ యగణ్యరీతుల ననంతముగఁ బ్రవ
హించుచుండును. మానవులయందును బశుపక్ష్యాదులయం
దును నుండుప్రేమను మూఁడువిధములుగఁ జెప్పవచ్చును.
(1) ప్రియాప్రియులప్రేమ (2) వాత్సల్యము. తలిదండ్రులు
శిశువులయెడ జూపించునదియు నన్నదమ్ములు నప్పాసెల్లెండ్రు
స్నేహితులు మొదలగువారొండొరులయెడఁ జూపించునట్టి
ప్రేమయు వాత్సల్య మనవచ్చును. చిన్నవారు పెద్దలయెడను
భక్తులు భగవంతునియెడను జూపించుప్రేమను (3) భక్తి యం
దురు. మొట్టమొదట ప్రియాప్రియులప్రేమనే శృంగారము
నకు మూల మని చెప్పుదురు. రామాయణాదిమహాకావ్యముల
కదియే కారణము. పృథ్వీరాజాదిమహాపురుషుల విచిత్రచరి
త్రల కదియే బీజము. సహగమనముల కదియే మూలము.
సంభోగవిప్రలంభాదిభేదము గలిగి, ప్రథమదర్శనము మొదలు
మరణించుటతో ముగియుదశమన్మథావస్థలు గలిగి మన్మథుఁ

డధిష్ఠానదేవతగా, రతిస్థాయిభావముగాఁ గలశృంగారరసమున
కదియే సాధనము.

ప్రేమలలోనికెల్ల మాతృప్రేమ యుత్కృష్టమైనది.
పశువులలో సహితము స్వశిశుసంరక్షణార్థము తల్లి చేయని
సాహసము లేదు. ఈనిన వనవరాహము పిల్లలను గాపాడ
శార్దూలము నవలీలఁగఁ జంపును. కోడి తననిసుగులను జాటున
నై చికొని గరుత్మంతునిగూడ తరిమివేయును. పిల్లి తనకూనలకై
కుక్కనుగూడఁ జీల్చివేయును. ఇఁక మానవమాతృప్రేమ
యమేయము. గర్భవతియైనది మొదలు తత్తత్కాలోచితవ్యా
పారముల గర్భమును సంరక్షించుకొనుచు, ప్రసవాపాయము
గడచి సురక్షితముగ నున్నశిశువును జూచి తనకష్టములు
గట్టెక్కినట్లు భావించుచు, తనబిడ్డకు దీర్ఘాయువు గలుగవలెనని
సకలవిధముల నీశ్వరుఁ బ్రార్థించి, కంటిలో వత్తి నిడుకొని
సాయశక్తులఁ బోషించి తనబాలునివ్రేలు నలిగినఁ దనచేయి
విరిగినట్లును తనముద్దుపట్టికాలికి దెబ్బఁదగిలిన తనకాలు భగ్న
మయినట్లును, తనకుమారుని కాపద సంభవించినఁ దనప్రాణము
పోయినట్లును నెంచి తగురీతుల కన్నవారికాళ్లకడుపులఁ బట్టు
కొని తగునౌషధముల సేకరించి తనబంగారమును బాగుచేసి
కొని, తనవజ్రాలమూట నల్లారుముద్దుగ నాడించుకొనుచు, తన
రత్నాలహారమును మాటిమాటికి ముద్దిడుకొనుచు, తనమోహ
కీలనంచి నితరులు చూచిరని దృష్టిదోషపరిహారమునకై దిగ

దుడుపులఁ జేయుచు, తనసర్వస్వము నాతనికి ధారవోయుచు, ఆతని మృదుమధురభాషణముల కానందించుచు, ఆతఁడు జ్ఞానవంతుఁడై ఘనుఁడైన పరమానందమందియు నమాయకుఁడని వచించుచు, చెడ్డవాఁడైనను నాతఁడే పెన్నిధి యని భావించుతల్లిప్రేమ నభివర్ణింప నెవ్వరితరము. ఇట్టిప్రేమ ననుభవించినఁ దెలియును గానిచూచుటకు సాధ్యమగునా ?

ఇట్టితల్లిని గోల్పోయిన శిశువుదురదృష్ట మేమని చెప్పవలయును. రక్షణము లేనియాబిడ్డ నందఱు నాక్షేపించువారే. ఆడఁఱు పాడుచువారే. అందఱును నిందింతురు. వేయిమంది చేరినను తల్లిప్రేమ నుద్ధరింప సమర్థులు గారు. మాతృదేవతావిరహితమైన శిశువుజీవనము వృథయని వేఱఁ జెప్పవలయునా. మాతృహీనశిశుజీవనం వృథా యనుట మున్మాటికి సార్థకము. ఇప్పుడు సచ్చిదానందమున కిట్టియవస్థ పట్టినది. పురుషోత్తములు బాలునివిద్యాభ్యాసము నభిలషించి సమీపమున నున్న నారాయణవర మనుపట్టణమునకుఁ బయనమయ్యెను. మాతృహీనశిశువును మేనమామలరక్షణమందుఁ గొంతదికాల ముండనీయకపోవుట మంచిదియో చెడ్డదియో నిర్ణయించుట కష్టము. ఏందులకన, పురుషోత్తముల యుద్దేశము విజ్ఞాననేత్రోన్మీలనము. నారాయణవరముఁ జేరి యచ్చట నొకయింటి నద్దెకు గ్రహించిరి. ఆయిల్లు విశాలమును సౌఖ్యదాయకము నయి యుండెను కాని గృహిణిలేనియిల్లు దివ్వెలేని యమావాస్యరాత్రితో

సమానము. ధనమువలన బంధువులవలన, లభించుసుఖము లన్నియు గృహిణివలన లభించుసౌఖ్యములకు సహస్రాంశము గావు. అయినఁ బురుషోత్తములు వివాహ మాడరాదా. అట్టి యుద్దేశ మాతనికిఁ గలయందుఁగూడ లేదయ్యెను. అంతటి పతివ్రతతో నట్లు మహానందముగఁ గొంతకాలము గడపి మరల నింకొకయువతిని జేపట్టుట కాతఁడు సాహసింపఁజా లఁడు. మీఁదుమిక్కిలి తనగారాముపట్టికి సవతితల్లి లభించును. అదిగాక వైరాగ్యముఁజెంది వానప్రస్థాశ్రమము నవలంబింపఁ దగిన యీడున నాతఁడు మరల సంసారమగ్నుఁ డగుటకు సమ్మతింపఁడయ్యె. ఇ ట్లేకాంతవాసము నవలంబించుట తండ్రి కుమాళ్ల కిరువురకును బాధాకర మయ్యెను.

శ్రీమన్మహాభారతమున దుష్యంతునకు శకుంతల చెప్పి నట్లు,

“ ధర్మార్థకామసాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ
స్థితికిమూలంబు సద్గతికి నూత
గౌరవంబున కేకకారణం బున్నత
స్థిరగుణమణులు కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము

ఎట్టిఘట్టములను నెట్టియాపదలను
నెట్టిక్లేశములను ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొసరఁ జూడఁగనినజనుల కెందు"

దుష్యంతునివలెనే, అట్టిగృహిణిని గోల్పోయిన పురుషోత్తములయవస్థ దుస్సహమైనది. మఱింతదుర్భరముగ ఉత్తరకాండమునందలి సీతావియుక్తరామునికివలెఁ, బురుషోత్తములకుఁ సతీపునఃప్రాప్త్యాశయు లేదు.

పురుషోత్తము లాగృహమునఁ దనకుమారునితో నివసించుచు మొట్టమొదటఁ గొంతకాలము పూటకూలింట భుజింపవలసివచ్చుటచేత నిరంతరము బాలునిక్షేమ మరయుట సాధ్యము గాలేదు. తనపొలములనుగూర్చి విచారించుట కాయన తఱచుగ శాంతిపురమునకును తదితరగ్రామములకును వెళ్లవలసియుండెను. సచ్చిదానందము నోరెఱుగనిబాలుఁడు. ఆతనిఁ బోషించుటకు మగదిక్కు లేదు. సరిగదా, ఆడుదిక్కంతకంటె లేదయ్యెను. పూటకూలమ్మ పుణ్య మెఱుగునా ? గుణవతి జీవించియున్నంతకాలము పురుషోత్తమున కీప్రాపంచికవిషయములు శిశుపోషణాదికము నెంతమాత్రము తెలియవయ్యెను. ఇప్పు డాతని నిందించిన నేమిప్రయోజనము. బాలునివస్త్రములు తఱచు మలినము లగుచుండెను ఆతని శరీరము జిడ్డుగారుచుండెను. ఆతనికిఁ దలలో పేలుపడెను.

శరీరమునం గురుపులుగూడ సంభవించెను. భగవంతుం డాతని
కన్నికష్టములు దెచ్చిపెట్టుటయు నాతనిపురోభివృద్ధికే గావచ్చు
యును. ఎవరు నిర్ణయింపంగలరు. కష్టానుభవమువలన మాన
వులకు సుఖములస్వాదుత గోచరించును. ఇట్టివేదాంత మూ
బాలుం డెఱుగకపోయినను భోజనాసౌకర్యమునకు జంకక
కష్టానుభవమున కోర్చి, తండ్రి కేమియు నడ్డుసెప్పక, ఈపరిస్థి
తులు భరింపంజాల నని మొరసేయక శాంతమూర్తియై,
"అవశ్య మనుభోక్తవ్యం స్వయం కర్మముపార్జితం" అన్నట్లు
కాలము గడపుచుండెను. మాసినతలయుం జిక్కినశరీరమును
ఆతండు తల్లిలేనిబిడ్డం డని చెప్పకచెప్పుచుండెను. అయినను
దిక్కులేనివారికి దైవమే దిక్కు. మాతృహీన శిశువును జూచి
నచో నెవరు కంటతడి పెట్టరు. ఎవరిహృదయము కరుగదు.
లోపలి కక్కలించుకొని పోవునాతనికడుపు తల్లియే చూచిన
నామెకడుపు తఱుగుకొనిపోదా? దీనుం డగునాతనియాకా
రముం జూచిన నామెప్రాణములు నిలుచునా? ఆతనిదుఃస్థితి
నెఱిగిన నామెహృదయము బ్రద్దలు గాదా?

ఒక్కొకరోజు సచ్చిదానందము బడితొందరచేం గడుపు
నిండ భుజింపక బడి కేగును. ఒక్కొక్కరోజు బొత్తుగా భుజిం
పకయే బడికేగును. రాత్రివేళ భోజనమునకు ప్రొద్దుపోవును.
అందువలన నాతం డేయఱుగుమీదనో తిండిలేకుండ నిద్రపో
వును పురుషోత్తము లూరనున్నపుం డాతనిని బలవంతమున
విస్తరికడకుం దెచ్చును. నిద్రమత్తున నాతండు భుజింపంజా

లము. తండ్రి యూరలేనప్పు డాతని నెవ్వరును శ్రద్ధతోఁ బిలువరైరి. ఒక్కకబళ మాదారమైన సంతసించుపూటకూలి యామె కాతని విషయమయి యంత శ్రద్ధ వహింపవలసిన యావశ్యకత యేమి? నెల కాపెకు వలసినంతపైకము ముట్టినఁ జాలును. ఇతరు లెవ్వరైన తులునలు గొట్టినప్పు డాతఁడు ప్రోత్సాహ సేక్ష్మ యూరకుండును. చెప్పికొనుట కెవ్వరును లేరు. ఇతరులతోఁ జెప్పుకొనుట యాతనిస్వభావమును గాదు. పూట కూలింట మధ్యాహ్నము విస్తళ్లలో పరిహరింపఁబడిన వస్తువు లను సేకరించి రాత్రి వానిని మరలవడ్డించుటను సూక్ష్మబుద్ధి గల సచ్చిదానందము గ్రహించి దుర్భరమైన యాసంగతిని పురుషోత్తములతోఁ జెప్పెను. పురుషోత్తములు తనకుమారు నితో మఱియొకపూటకూలింట భోజనము నేర్పాటుచేసికొనిరి. అచ్చటను దృప్తి గలుగదయ్యెను. వంటఁజేయుస్త్రీ లభించు ప్రోపల వారెన్నికష్టము లనుభవింపవలసినవారైరి. ఆవైభవ ముగూడ ముందుచూచెదము గాక.

బాలురు దుఃఖములను దక్షణమే విస్మరింతు రని వివేకి గనుక పరమేశ్వరుఁడు శాసించినాఁడు. ఆశాసనము ననుసరించి బాలబాలికలజవనము సుఖతర మగుచున్నది. సచ్చిదానంద మునకు సంభవించిన యాకష్టపరంపరల కాతఁడు వానిని విస్మ రింపవిచో నెప్పుడో గుండెపగిలి యుండును. "ఆడుదానిచేతి యర్థము మగవానిచేతిబిడ్డ" యను సామెత ననుసరించి పురు షోత్తమునిచేతిబాలుఁ డిరీతిగ వృద్ధిఁబొందుచుండెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.

—:0:—

## పాపరాజు.



ఇఁక విద్యాభ్యాసవిషయము. పాపరాజుగారిబడిలోఁ సచ్చిదానందము మూఁడవతరగతిలోఁ బ్రవేశించెను. ఆబడిని గూర్చి కొంచెము చెప్పవలసియున్నది. నారాయణవరములోఁ జెఱువుకడ రెండుచింతచెట్లు కలవు. ఆచింతచెట్లనీడ నొకపూరి ల్లుండెను. అదియే పాపరాజుగారిబడి. పాపరాజు బాలురఁ బీడించుట యనుపాపమునకు నిశ్చయముగ రాజు. అతిదీర్ఘము నత్యంతస్థూలము నగుశరీరమును కాటుక నపహసించుశరీరకాంతియు, పెరుగుచున్నపాపపుంజమో యన నిత్యవివర్ధమానమగుచాకిబానవంటిపొట్టయు, పంచాశద్వర్షదేశీయ మాతని వయస్సని సూచించుపలితపాండురశిరమును, కొంచె మడఁగియు వెడఁద యగునాసికయు, విశాలఫాలమును, దీర్ఘకఠినబాహులును, యమదండసదృశ మగునల్లనిచేతికఱ్ఱయు, నీర్కావి దోవతియు, జరీయుత్తరీయమును, బలువగుపాదరక్షలును పాపరాజు యమరాజసహోదరుఁ డని సూచించుచుండును. ఆతని కిఱ్ఱుచెప్పులమ్రోఁత వినగనే బాలురకు కంపము జనించును; ఆతనిరూపవీక్షణమున వారిగుండె లవిసిపోవును; ఆతని గర్జనము వారిని నిర్ఘాంతపోవునట్లు చేయును, ఆతని

యనుదండపాతము వారి ప్రాణములఁ దీయునని వేఱుగఁ జెప్ప వలయునా ?

ప్రాతఃకాలమునఁ బాపరాజు బడికివచ్చి యందఱు నచ్చిరా లేదా యని హాజరుపట్టి వేయును. ఆతనియమదండమునకు వెఱచి బాలురు నిస్సంశయముగ వేళకు బడికి వత్తురు. వారు రానిచో జవాబ్దారునితోఁ జెప్పుటకు వారితండ్రులను బంపుదురు. ఆతఁడు బడిలోనికి రాఁగ, నాఁడో జెవ్వరికిఁ జావు మూడినదో యని బాలురు ప్రాణములు బిగబట్టుకొని యెదురు చూచుచుందురు. "ఓరిమొద్దుసుబ్బాయ్ నిన్న బడి కేల రాలేదురా ? చంద్రిగా, గాడిదె, నీకు నిన్న యెక్కములు రాలేదుగదా ! దున్నపోతురాముఁడా నిన్న నన్నముదినక విసాయమ్మను తంటాలు పెట్టితివటరా !" అని యిట్లు కొందఱఁ బేర్కొని యాతఁ డొక్కొక్కరిని జుట్టుబట్టుకొని విడలించి, తల గోడకుఁ గొట్టియుఁ, దనకర్కశహస్తములతోఁ జదిమినసాగ్గారు వారిబుగ్గల మెదపియుఁ, తనఖరనఖరంబుల వారికర్ణములు రక్తమోడునట్లు మెలఁచియు, తనబెత్తముతో వారిదేహముల వాయఁగొట్టియు నిట్లనేకవిధముల హింసించును. ఈవ్యథ కోర్వలేనిబాలుర రోదనధ్వని బడిగుడిసెకప్పులోని రంధ్రములనుండి వెడలి మిన్నుముట్టును. అంతట నాతఁడు, "వచ్చినవానితల నీకజ్జుతో బ్రద్దలుగొట్టెద" నని జంకె వేసినమాత్రమున నొక్కక్షణములో బడియంతయు

నిశ్శబ్ద మగును. ఉపాధ్యాయుఁ డప్పుడు బడిపెద్దను బిల్చి, "ఓరి వెంకటేశుగా, ఆ చిన్నకుంకల కోనమాలును, మధ్య తరగతివెధవల లెక్కములును దిద్దబెట్టి మీరు చూచి వ్రాతి వ్రాయుచుండుఁడు. నేను త్వరలో వచ్చెదను. అల్లరిచేసిన వాండ్ర పేళ్లు నాతోఁ జెప్పుము. తాటదీసి దణ్ణెమున కారవే యుదును. డొక్కఁజించి డోలు కట్టెదను" అనుచు నూరిలో వ్యాపారులకు లెక్కలు వ్రాసిపెట్టుట కేగును.

అతఁడు మరల వచ్చునప్పటికి భోజనసమయమగును. అల్లరిచేసినవారికి రెం డంటించి, అల్లరి చేయనివాండ్రతో, "మీకోసము మళ్లీ వచ్చెదనా! వెధవ లెప్పుడో యేదో యొకతప్పుఁ జేయుచునే యుందురు." అనుచు వారినిగూడ శిక్షించి భోజనమునకు వదలును. మరల మధ్యాహ్నము బడిలోఁ గొంచెమునే పాతఁడు లెక్కల బోధించును. ఈబడిలోఁ గేవలసాత్వికస్వరూపుఁ డగుసచ్చిదానంద మెట్లో కాలము గడపుచుండెను. పాపరా జాతనియం దేటికో విశేషదయఁ జూపుచుండెను.

మఱియొక విషయము. పాపరాజుగారికి బండెడు చెవుడు "పంతులుగారూ" లెక్కలు చెప్పరా యని బాలు రడుగ, "ఎవరిని లేచి పొమ్మందురురా" అని వారి చెంపలు వాయించును. 'అయ్యా మీకొఱ కెవరో వచ్చినా'

రనఁగ, 'మిఠాయి కావలెనా నీమొగానికి' అని మీఁది కురు
కను. అతనితో మాటలాడిన నొకకష్టము. మాటలాడకపోయి
నను గష్టమే. బాలు రందఱును స్వేచ్ఛగ మాటలాడి కావలసిన
పాఠములు చెప్పించుకొనవలెనని యాతనియాశయము. పైతర
గతిక్లాసుపిల్లలు కొందఱు తమాషచేయుచుండిరి. అతివినయ
ముతో వచ్చి, "బాబూ మాపాలిటికి యమధర్మరాజువురా
నాయనా" అనఁగా "బారువులు మణుఁగులు లెక్క కావలె
నటరా, వేసికో" అనును. ఈసంగతి విని యితరబాలురు
లోలోన నవ్వుకొని యూరకుందురు. ఎవఁడైన నాతనితో
మిక్కిలిబిగ్గఱగా మాటలాడిన, "నాకుఁ జెవ్వు డని యాక్షే
పించుచున్నావా" అని కోపగించును. సచ్చిదానందమునకు
సామాన్యముగ లెక్కలు తప్పవు. ఒకనాఁడు పాపరాజు బాలు
రొక్కొక్కరివద్దకు వచ్చి, "నీలెక్క తప్పినదా సరిగా వచ్చి
నదా" అని యడిగి తప్పినవారిని దండించు చుండెను. "నేను
సరిగాఁ జేసినానండి" అని మన నేదరికుఱ్ఱవాఁడు నెమ్మదిగ
ననెను. అది "తప్పు" అని చెప్పినట్లు వినిపించి పాపరా
జాతని దండించెను. ఈవిషయమునుగూర్చి సత్యాసత్యము
లెఱిఁగినతరువాత పాపరాజు పశ్చాత్తాపముఁ జెంది సచ్చిదా
నందమునందు మఱింతదయగలవాఁ డయ్యెను.

ఇంతదూరఁ మాతని నిందించి యాయుపాధ్యాయుని కష్ట
సుఖములను విచారింపవలదా. పాపరాజుగారిది పెద్దకుటుం

బము. నలుగురు కొడుకులు నలుగురు కూఁతులు కలరు. ఇప్పటిభార్య నాలుగవసంబంధము అంతకుముందున్న భార్యల బిడ్డలకును నీచిన్నిభార్యకును వచ్చుతగవుల నాతఁడు తీర్ప వలెను. అక్కైకమ్మ అతికోపిష్ఠి. ఆమెను తృప్తిపఱుపవలెను. పిల్లలకు నడుగులు పెండ్లిండ్లు అచ్చట్లు ముచ్చట్లు తీర్పవలెను. అవియెట్లున్నను ముందు భోజనమునకువలసినంత సంపాదింప వలెను. తనకా వయస్సులో ప్రొద్దుతిరిగినది బాలు రిచ్చుజీత ములా యేమూలకును జాలవయ్యెను. ప్రభుత్వమువా రిచ్చు సాలీనా అనగావార్షికాదాయము బహుస్వల్పము. భగవం తుఁడు తెచ్చిపెట్టినచెవు డొకటి. నలుబదిమందిబాలురతోఁ బ్రొద్దుగూకులు వేగవలెను. వ్యాపారస్థులకు లెక్కలు వ్రాసి కొంత గణింపవలెను. ఇంటిలో తగవులు, బడిలో తగవులు, ఊరితగవులును బరిష్కారమున కాతనివద్దకే వచ్చును. ఇట్టిపరి స్థితులలో నాయనను మిక్కిలిగ నిందించుట యుచితముగాదు.

మానవునకు సహజముగ నున్నవిజ్ఞాననేత్రము మూఁత పడియుండ దానిని తెఱచి సర్వవిషయముల నవలీలగ నవగా హన మగునట్లుచేయునది విద్య. అట్టివిద్య నభ్యసించువా రమాయికులు, మృదుహృదయులు నిష్కల్మషులు నగుబా లురు. వారిహృదయనిర్మలజలములందు, వారిమన స్సనుమృదు వగుమైనమందు, వారిగర్భస్థపిండసదృశభావమునం దెట్టిచిహ్న ములు నాటఁబడునో యవిశాశ్వతముగ నంటిపోవును. ఆభావ

ములతో నాబాలు రాజాతియొక్క యభివృద్ధికో నాశనమునకో కారణమగుదురు. జీవితమునం దట్టిపరమోత్కృష్టవిషయమునకు ప్రజ లెంత శ్రమపడినను ప్రభువు లెంతవ్యయము చేసినను జాలదు. గురువుకాఁదగినవాఁడు సకలసద్గుణసంపత్తి కలవాఁడుగ నుండవలయును. స్వార్థత్యాగి, పరమోత్కృష్టాశయపూరితుఁడు. సాత్త్వికస్వభావుఁడు. సర్వశాస్త్రసంపన్నుఁడు శిశుహృదయవేత్త యుపాధ్యాయుఁడుగ నుండ నర్హుఁడని పెద్దలు చెప్పుదురు. అతఁ డెక్కడనున్నను వానికొఱకు వెదకి ప్రజలును ప్రభువులును విద్యాదానమునకై వానిని ప్రార్థించి, వలసినంతధన మొసఁగి, నియోగించిన నాతఁడు బాలురకుఁ జెలియై మేనమఱందియై సచివుఁడై, మహాఫలసంధాయకుఁడై, మోక్షప్రదుఁడు కాఁగలఁ డనుట కించుకయు సందేహము లేదు.

దసరాపండుగ వచ్చినది. పాపరాజుగా రిరువదిరోజులు ముందుగ దసరాపద్యములను బాలురకు నేర్పఁ బ్రారంభించిరి. నారాయణపురమునందు వీథులన్నియు నలంకారభూయిష్ఠములైనవి. ఇండ్లగోడలు నవసుధాధౌతములైనవి. కొన్నియిండ్లయందు గోడల కెఱ్ఱమన్ను నున్నముపట్టెలు లభించినవి. ఇండ్లముంగిటచిత్రవిచిత్రము లగుముగ్గులు వేసినారు. ద్వారములు పసపుకుంకుమలతో మునిఁగి తేలుచున్నవి. ఇండ్లలో ననేకవిధముల నూతనశోభలు బయలుదేరినవి. క్రొత్తయల్లుం డ్రత్తవారిండ్లకు విచ్చేసినారు. నూతనవధువులు నునుసిగ్గుదొంతరలు

మోములఁ దోలఁకాడ క్రీఁగంటిచూపులఁ దమ ప్రియులఁ జాటుచాటులనుండి యుపలక్షించుచున్నారు. ఏయింటఁజూచి నను పిండివంటల కమ్మనివాసనలు ఘ్రాణేంద్రియమున కింపు గొలుపుచున్నవి. ఏవాడఁజూచినను పచ్చనితోరణములు భాసిల్లుచున్నవి. కంకుడుకాయలు ప్రియమైనవి. కూరలకును తదితరపదార్థములకును ధర హెచ్చినది. బంగారువస్తువులకు మెఱుఁగుబెట్టినారు. పసుపుపారాణులు స్త్రీలు కాళ్లకుఁబూసి నారు. నూతనవస్త్రములుదాల్చి ప్రజలు రంగరంగవైభవ ముతో నానందింపమొదలిడిరి.

భక్తిపరు లగుధనికులు కొందఱు కలశముల స్థాపించి దేవీపూజఁ గావించుచు బ్రాహ్మణసమారాధనము లొనర్చు చున్నారు. భజనలు హరికథలు మిక్కుటమైనవి. పచ్చికబీళ్లలో నిండుగమేసి గోమహిషాదిపశువు లానందముతోఁ బరుగువారుచున్నవి. పరుగెత్తుటయందు సమర్థులు పార్వేట రోజునకు సిద్ధపడుచున్నారు. వస్త్రాదులు కుస్తీల నేర్పాటుచేసిరి. సేవకులు దసరామామూళ్ల కింటింటికిఁ దిరుగుచున్నారు. పచ్చనిపైరులు రైతుల కానందదాయకములై భావిఫలమును సూచించుచున్నవి.

పాపరాజుగారి బడిపిల్ల లందఱికిని కొత్తదుస్తులు లభించినవి. అందమైనలాగులు చొక్కాలు, తగరముతోఁ దళతళ

లాడుక్కొత్తకిట్టుచెప్పులు, నెత్తిని బంగారుజల్తారుపాగాలు చేతులలో పట్టురుమాళ్లు కోతులు చిలుకలు, విల్లునంబులు ధ్వజములు ధరించి జయా విజయీభవ దిగ్విజయీభవ అని బయలుదేరిరి. బాలురప్పుడు, "సాహసవిక్రమార్క సంగ్రామధనంజయ పానరాధేయ" అని దాతలను బొగడుచుఁ దమగురుల కొఱకును దమకొఱకును భట్టుమూర్తులకై వారపుఁబడిని కొంచెముచేపు స్వీకరించిరి. సచ్చిదానందము చక్కనిదుస్తులధరించి, సంపన్నబాలుఁడగుటవలన నందఱికంటె మిన్నగనుండెను. అంపకతోఁబాటు నాతఁడును గురువుగారి యాధిపత్యమున నింటింటికేగి,

అయ్యవారికిఁ జాలు ఐదువరహాలు
పిల్లవాండ్రకుఁ జాలు పప్పుబెల్లాలు.

అనిపాడుచు, లోభులయింటికడ,

"ఇప్పు డేటికివచ్చె యీమహార్నవమి
అప్పుడే తెలిసుండి యీమూలయింట్లో
నక్కవలె నొకచోట నక్కుండనైతి
కుక్కవలె నొకచోటఁ గూర్చుండనైతి"

అని పాడుచు నానందముగ కాలము గడపెను. తెలివితేటలుఁ గలవాఁడుగావున మిక్కిలిత్వరలోనే యాతఁడు పాపరాజుగారి బడిలోఁ జదువు పూర్తిగావించెను.

(వర్ణనము లతిశయిల్లి తనకు భంగము దెచ్చుచున్న వని కథకుఁ గోపమువచ్చునేమో. ఇందసందర్భప్రసంగ మేమియు లేదని మాకుఁ దెలియును, గావున కథాకోపమునకు వెఱువము. ఆకులు పూవులు పండ్లు కొమ్మలు లేనిమొండి మ్రాకువలె, వివిధతరుసరోవరాదిశోభితముగాని యుద్యానము బోలె, భూషణాలక్తకకుంకుమరుచిరగానియువతివలె, రాజ్య ధనపరివారములులేనిరాజుభాతి, సమయోచితశిల్పసంవిధానము లేని నాట్యరంగమువడువున, శిశుపశుశోభితముగాక నిత్యకళ్యా ణమును బచ్చనితోరణమును లేనిగృహము విధమున, సంద ర్భోచితవర్ణనములతో నిండియుండనికథానిర్మాణము రసజ్ఞుల కింపు నింపదు.)



# త్రొమ్మిదవ ప్రకరణము.

——:o:——

## లోలమ్మ.



పూటకూలింటిబదవలు పడలేక యతిశీఘ్రకాలములో నొకవంటకత్తెను బురుషోత్తము లేర్పాటుగావించిరి. ఆమెపేరు లోలమ్మ. సుమా రేబదిసంవత్సరములయీడుగలది. పదునైదుసంవత్సరముల యీడుగలకుమారుఁ డొకఁ డామెకుఁ గలఁడు. అతఁడు కొంటెపనగొయ్యయై విచ్చలవిడిగ దిరుగుచున్నందున విద్య చెప్పింపవలె నను నుద్దేశముతో దరిద్రురాలు గావున వంటఁజేసి మనుగడ నిర్వహించుకొనఁదలఁచెను. కుమారునిపేరు రామసుబ్బయ్య. సచ్చిదానందమునకు సుఖములభించుట కాయిరువురకును భోజనము పెట్టునట్లును నామె పురుషోత్తములయింట వంట గావించునట్లును నేర్పాటు గావింపఁబడెను.

ఈయమవలననైనను బాలునకు సుఖము గలుగదయ్యెను. పురుషోత్తము లప్పుడప్పు డూర నుండక గ్రామాంతరములకు వెళ్లుట మామూలు. ముఖ్యముగా నాసమయములలో, లోలమ్మప్రభుత్వము దుర్భరముగ నుండెను. స్నానాదిసౌకర్యములు చేకూఁగ నమరక నాతనిశరీరముపై చిడుముపొక్కులు

లేచెను. ఆమె యాసందర్భమునఁ దగుచికిత్సచేయకపోఁగ సస
హ్యాపడుచు నణఁగుచుండును. దైవవశమునఁ గొలఁదిరోజులలో
నాపెనిమిటికిఁగూడ నట్టిపొక్కులే లేచెను. ఇఁక నామె
తాపత్రయము చెప్ప నలవిగాదు. ఎన్నియోమందుల నుప
యోగించినది. ఎన్నియో స్నానములు చేయించినది. ఇరు
గింటియిల్లాలును పొరుగింటియాబిడయు నొకనాఁడు లోల
మ్మతోఁ గుశలప్రసంగముఁ జేయుటకు విచ్చేసిరి. అప్పుడు
వారందఱ కీవిధముగ సంభాషణము జరిగెను.

లోలమ్మ—"అమ్మా మాసుబ్బని నానెత్తిననైచి నన్ని
క్కట్లపాలుచేసి మాయాయన పోయినాఁడు. చచ్చువాఁడు
మాకింత బ్రతుకుఁదెరువుఁ జూపింపలేదు సరిగదా, అప్పులు
మెడకుఁజుట్టి యాస్తిగుటుకుమనిపించునట్లు చేసినాఁడు. అందుల
కాతనిజీవానికిఁబడి, అలోలక్ష్మణా యని యీపురుషోత్తముల
యింటిముందఱ పడిగాపులుపడి యుండవలసివచ్చినది. ఆపురు
షోత్తములు పిసినిగొట్టు. మాకుఁ గడుపునిండ కూడైనఁ
బెట్టడు. తెచ్చినది రవంత యాసచ్చిదానందముమొగాన పెట్టి
మేముపస్తులు పడియుందుము. ఆపిల్లవాఁడు మంచివాఁడని
మీరందురు గాని యాతఁడు వట్టినాలిముచ్చు. విషపుగింజ.
మొన్న వానితోఁగూడ మావాఁడు వెళ్లుచుండ నెవ్వరో
వచ్చి మావానిని గొట్టి రఁట. ఆదుర్మార్గుడే పురికొల్పి
మావానిని వారిచేతఁ గొట్టించియుండును. మావాఁ డెవ్వరి

జోలి పోంటి పోవువాఁడు కాఁడు." అనుచుండ మాట కడ్డమువచ్చి యిరుగింటి యావిడ, "మీపిల్లవాఁడు పాపము వెన్నప్రూసఁ బెట్టిన మింగలేఁడు. వేలు బెట్టిన కొఱుక లేఁడు. ఏమిబూటకము లమ్మా! నాముందఱనా మీపిల్ల వానిసంగతి చెప్పుట. ఆమిడిమేలపుదుంప మొన్న మాకు ఱ్ఱవానిని క్రిందపడివేసి దొర్లించినాఁడు. పాపము, నోరు వాయి యెఱుగని సచ్చిదానంద మేమిచేయగలఁడు. ఎనిమి దేండ్లకుఱ్ఱవాఁడు పదిహేనేండ్లవానిని గొట్టించునా!" అనెను. అందుకు సమాధానముగ లోలమ్మ, "అవునమ్మా! మా డీయూరా, పల్లెయా మీరందఱు నొకటియైన, నొంట రిదానిని నే నేమిచేయఁగలను. ఆచచ్చినవాని జీవాని కేడ్చుచు నెట్లో కాలము గడుపవలయును. పదిరోజులక్రిందట నెక్క డనో చిఱుము సంపాదించి యీసచ్చిదానందము మాపిల్లవాని కంటించినాఁడు. నాకు మాపిల్లవానికిఁగూడ నిద్రాహారములు లేవు." అని చెప్పుచుండ విసుగుపుట్టి యాయిఱుగుపొఱుగు స్త్రీలు లేచి పోయిరి.

ఆరోజునుండి తనకొడుకున కొకయింటిలోను సచ్చిదా నందమునకు మఱియొకగదిలోను లోలమ్మ యన్నముఁ బెట్టు చుండెను. సచ్చిదానందము మా రాడియెఱుఁగడు. ఏదో నెపము పెట్టి వారిరువురును బాలునిఁ గొట్టుదురు. లేనిపోని నేరము లెన్నియో కల్పించి పురుషోత్తమునితోఁ జెప్పుదురు.

కాని పురుషోత్తములు పసిబాలుని స్వభావమెఱింగినవాఁడు గావున నానేరము లాలకించియు విననట్లూరకుండును. అతఁడు బాలుని దండింపలేదని పోలమ్మ మఱియు మండిపడును. తన కుమారుఁడు చక్కఁగఁ జదువుకొనుట లేదని యంతకంటె విచారపడును.

ఒకసారి పురుషోత్తములు పదునైదురోజు లూరిలో లేరు. వారు రేపింటికి వత్తురనగ పోలమ్మ సచ్చిదానందమునకుఁ దలయంటి నీళ్లుపోయ సంకల్పించెను. "నా నాయనా నీకు నీళ్లుపోయలేదని మీనాయనగా రెంతతిట్టుదురో? ఏళ్లైన నాకుఁ జెప్పవు గదా" అని సణుగుకొనుచు నామె యాతని తల యంటి, మసలుచున్న నీళ్లొక్కచెంబెడు నెత్తిన కుమ్మరించెను. "అయ్యో నీళ్లు మండుచున్నవి" అని యాతఁడు చెప్పెను. "ఇంతమాత్రమునకేనా? యేడ్చుట" అని చన్నీళ్లు తెచ్చి యాతనినెత్తిపై దిమ్మరించెను. "అయ్యో వట్టి చన్నీళ్లివి" అని యాతఁడనెను. 'ఇట్లు తంటాలుపెట్టిన నేను మీయింట నుండఁజాలను.' అని యామె గర్జించెను. బాలున కారోజు కంటినిండ నురుగుపడి కండ్లెఱ్ఱబాఱెను. తెనాలిరామలింగని పిల్లికి పాలయం దిష్టముతప్పినట్లు సచ్చిదానందమున కారోజునుండి తలంటియం దిష్టము లేకుండెను. పురుషోత్తములు రాగానే యామె తనను వారిబాలుఁడు వేపుకొని

తినుచున్నాఁ డని మొఱపెట్టెను. పోట్లాడుకొనుట సహజము. మూకీభావముతో నుండుట పురుషోత్తములకు సహజము.

సంక్రాంతి పండుగ వచ్చెను. పురుషోత్తములయింటిలో నారోజు ముక్కుచునో మూల్గుచునో పోలమ్మ పిండివంటలతో భోజనము సిద్ధముఁజేసెను. పురుషోత్తములు పండ్లు తెమ్మనగా బాలు రిరువురును బజారున కేగిరి. వారు తిరిగి వచ్చునప్పు డొకచోట పెద్దగుంపును గాంచిరి. నూత్నవిషయములను గాంచుటయందు బాలురకాసక్తి యుండును. అందు ముఖ్యముగ సచ్చిదానందము శరీరమును మఱచిపోవును. తానింటికిఁ ద్వరగఁ బోవలయుననుమాట యటుంచి, రామసుబ్బయ్య నొప్పించి యాతనిని దీసికొని యాబాలుఁడు గుంపు కడ కేగెను. వారచ్చటికిఁ జేరుసరి కాగుంపుమధ్యను వారి కొక మనుజుఁడు గోచర మయ్యెను. చుట్టు నున్నతుంటరిబాలుర నాతఁడు తిట్టుచుండెను. నల్లని దేహకాంతియు, ఒడ్డుపొడుగు గలశరీరము ఒక్కపల్లూడిన నోరును, నరసియు నరవని వెంట్రుకలును గలయాతఁడు రామయ్య యనియు, బాలురు గోచి లాగియు, వెంట్రుకలు పీకియు బాధపెట్టగా వారిని గొట్టఁబోయి పడి గాయముఁ జెందెననియు, ఆతనిని తిండిపోతు రామయ్య యని ప్రజ వెగతాళిచేయుచుందు రనియు వారి కితరులవలనఁ దెలిసెను. అతఁడు వారిని దిట్టుటలో సంతవలె క్షాతని కెక్కడను భోజనము దొరుకలే దని చెప్పుటచే సచ్చిదా

సంపము జాలిగొని రామసుబ్బయ్య నంగీకరింపఁజేసి యాత
నిని దమయింటికి భోజనమునకుఁ బిలుచుకొని వచ్చెను. మిగిలిన
బాలురందఱును గొంతవఱకు రామసుబ్బయ్యవలనను సచ్చిదా
నందమువలనను జీవాట్లుతిని యిండ్లకేగిరి.

అప్పుడు లోలమ్మ యింట లేదు. ఆమె మంచినీళ్లు తేసి
కొని యింటికివచ్చి, రామయ్య యింటిలో నరుగుమీఁదఁ
గూర్చుండుటఁజూచి కోపించి వెకలిపొమ్మనియెను. ఆతఁడు,
"మీబాలురు నన్ను బలవంతముచేసి భోజనమునకుఁ బిలుచు
కొనివచ్చిరి. మీబాలురొకటి మీరొకటియా. రమ్మనుట
పొమ్మనుటయు మీవంతేనా? నేను వెళ్లను." అని స్థిర
ముగాఁ గూర్చుండెను. లోలమ్మకుమారుఁడు నేరము సచ్చిదా
నందముపై మోపెను. ఆకోపము భరింపలేక మఱియు మైలయు
నెఱుంగక సచ్చిదానందముపైఁబడి కొట్టి లోలమ్మ స్నానముఁ
జేయ మరల బావి కేగెను. పురుషోత్తము లెచ్చటినుండియో
యింటికిరాఁగనే లోలమ్మ సచ్చిదానందముపై నొకపారము నప్ప
గించెను. వారావిషయము లక్ష్యముసేయక, "రామయ్య
గారూ! స్నానముచేసి మడిగట్టుకొనుఁడు" అనుచుఁ దాము
భోజనమునకు సిద్ధపడిరి.

పురుషోత్తములు, రామయ్య, బాలురు నొక్కపంక్తిని
గూర్చుండిరి. ఆరోజు పదార్థములు మిక్కుటముగ నుండెను.

పురుషోత్తములకును లోలమ్మకును రామయ్యగారి సంగతి తెలి
యును. ఆయనకొఱకు పెద్దవిస్తరి వేసిరి. మొదటిసారి యందఱ
కును వన్నిపదార్థములు వడ్డింపఁబడెను. రామయ్య మరలనన్న
మును గోరెను. లోలమ్మ విసిగికొనుచు తప్పెలఁ దెచ్చి
యాతనివిస్తరియం దన్నమంతయుఁ గుమ్మరించెను. రామ
య్యకు సంతోషమయ్యెను. మరల పప్పుకూరలయు నటుగా
నిట్లే లోలమ్మ తెచ్చి వడ్డించెను. ఇట్లన్ని పదార్థములు ముగిసిన
తరువాత, "లోలమ్మగారూ ఇక లేవుగదా పదార్థములు",
అని లోలమ్మచేత రామయ్య లే అనిపించెను. విస్తరిలోనున్న
పదార్థములన్నియు రామయ్య యొక్కనారి కలిపినాఁడు.
తాటికాయలంత ముద్దల నాటింటిని జేసి క్రమక్రమముగ
వానిని గబళించినాఁడు. మధ్యమధ్య కొక్కగుండ్రాతితోఁ దన
కడుపును సరిజేసికొనుచుండుటయుఁ బదార్థము లన్నియు నయి
పోవుటయు ననువిచిత్రదృశ్యములు బాలుర కమందానంద
మును జేకూర్చెను. లోలమ్మ మాత్రము పునఃపాకముఁ జేసి
కొనవలసినదే యని మండిపడు చుండెను. పురుషోత్తములు
శాంతముతో రామయ్యకుఁ దాంబూలాదిసత్కారముఁజేసి సాగ
నంపిరి. లోలమ్మ యందఱను దిట్టుచు వంటచేసికొని యాకోప
ముమీఁద రోజు తినుదానికంటె రెండంతలు భుజించెను.

ఆరోజుమొదలు సచ్చిదానందముదురవస్థ యధిక
మయ్యెను. పురుషోత్తముల కీసంగతి తెలియకపోలేదు. వారు

సత్సంకల్పులు. శాంతస్వరూపులు. వా రామె వెళ్లిపోవలె నని మనస్సునందు సంకల్పించినమఱునాఁడే యామె కేదో కారణము సంభవించి వెళ్లిపోవలసినదే. అందువలనఁ బ్రత్యేకముగ వా రామెను వెళ్లమని చెప్పు టనవసరము. ఈశ్వరసంకల్పతుల్య మగుపురుషోత్తములసంకల్పమెట్లు నెరవేరినదియుఁ జూచెదము.

పురుషోత్తముల యింటిపొరుగున వివాహమొకటి జరిగెను. ఆపెండ్లివా రావివాహసమయమునఁ బురుషోత్తముల యింటినిగూడ వాడుకొనుచుండిరి. లోలమ్మగారి క్రింద మాత్ర మొకచిన్నభాగ ముండెను. తనయింటఁ దానుండిపివాహమహోత్సవమును జూచి యానందించుచు బాలురక్షేమమును జూచుకొనవలసినలోలమ్మ పెండ్లిపెత్తనమంతయుఁ దానే వహించెను. వంటవారికి సామానులనందించుటయో, కూలీలకు భత్యము లిచ్చుటయో, ఖర్చుతక్కువగుటకు నుపాయముల సూచించుటయో, సేవకులను సరిగఁ బనులుచేయు మని యదలించుటయో చేయుచు నామె క్షణముగూడ తీరికలేనిదయ్యెను. ఇందువలన నామె కేమిలాభము గల్గెనో మనకుఁ దెలియదు. నష్టము మాత్రము కలదు. సేవకులమొదలు యజమానివఱకుఁ గలవా రందఱు లోలమ్మయనవసరపుజోక్యమును మొదట లోలోన నిరసించుచుండిరి.

నాకబలిరోజు వచ్చినది. వివాహ మెట్లు జరిగినను లోలమ్మ ప్రవర్తనమే మనకుఁ గావలసినది. ఇంటియాడుబిడ్డ యొకసేవకునిద్వారా మూటెడుబియ్యము మవతలికిఁ జేరవేసినదని యింటియజమానునిభార్యతో లోలమ్మ నేరము చెప్పినది. ఇఁక నెన్ని యిట్టివిపోయినవో సుమా అనియు సూచించినది. యజమానురాలి క్రాగ్రహము గలిగి వారితో వీరితో నాడు బిడ్డను నిందించి పలికినది. ఈసంగతిని వినినయాడుబిడ్డ తనపై నన్యాయపునింద మోపినారని తనవదినెపైఁ గోపగించినది. ఈకుటుంబకలహము రాజి రగుల్కొని నాగవల్లినిష్ఠూర మను నామెతి సార్థకమైనది. పెండ్లియైనతరువాత కొలదిరోజుల కీవిషయమైననిజానిజములు తేలినవి. ఆడుబిడ్డ సేవకునికన్నము బెట్టగా వాఁడన్నమును మూటగట్టుకొని పోవుచుండుట గాంచి లోలమ్మ బియ్యపుమూట యనితలంచి నేరమును జెప్పినట్లు బంధుగులందఱకుఁ దెలిసినది. అంతట వారందఱు నొక్క పెట్టున లోలమ్మపైఁబడి తగవులమారి దనియు, తగవులుబెట్టి తమాషచూచున దనియు, దుర్మార్గురా లనియునసేకవిధముల నిందించిరి.

వారి నెదుర్కొనఁజాలక లోలమ్మ యొకమూలఁ గూర్చుండి దుఃఖింప మొదలిడినది. తరువాత నావిషయము పురుషోత్తములతోఁజెప్పి వారితో తగవాడవలసినదని వారిని బ్రోత్సహించెను. కాని యాసాత్వికస్వరూపు లేమియు

మాటాడ రైరి. మఱియు, "నేనిదివఱకుఁజెప్పలేదా. అనవస రముగ నితరులపనులలోఁ బ్రవేశించినవారికి చిక్కులు వచ్చు నని. స్వయంకృతాపరాధమునకు నే నేమిచేయుదును" అనిరి. ఇఁక జేయునదేమి ? శోకమును క్రోధమును నిగ్రహించి కొన లోలమ్మ పెద్దపెట్టున నేడ్చుచు, ముందు వచ్చినమగని దిట్టి, తిరువాత నిరుగుపొరుగువారిని పురుషోత్తములను సచ్చి దానందమును దిట్టి తనసుదాను తిట్టుకొని తనసామాను సర్దు కొని బాలుని వెంటనిడికొని తనబాలునితోఁగూడ లేచి మఱి యొకయాశ్రయముఁ జూచుకొనఁదలచినను నాయూరివా రాదరింపనందున స్వగ్రామమున కేగెను. లోలమ్మగారు వెడలి పోయినతరువాత మఱియొక వంటకత్తె పురుషోత్తములయింటఁ గుదిరెను. వంటజేయువారలకు సామాన్యముగ నేవోలోపము లుండును. లోపములు బయటఁ బడినప్పుడు వారియాశ్రయ ములు మారుచుండును. వంటకత్తెలు గుదురనప్పుడు పూట కూలింటను కుదిరినప్పుడు స్వగృహమునను భుజించుచుఁ బురు షోత్తములును సచ్చిదానందమును కాలము గడపుచుండిరి.

# పదవప్రకరణము.

## సహవాసము.

సహవాస మనఁగాఁ గూడనుండుట. సహవాసము మైత్రికిఁ గారణము. శత్రుత్వమునకును గారణము కావచ్చును. అది సర్వశ్రేయస్సుల కాస్పదము. సందర్భవశమున సర్వానర్థదాయకము గావచ్చును. సహవాసమువలన ధనికులు దరిద్రులగుదురు. దరిద్రులు ధనికు లగుటయుఁ దటస్థించును. దానిచే గుణవంతుఁడు గుణహీనుఁ డగును. గుణహీనుఁడు గుణవంతుఁడగుటయు సంభవించును. సహవాసదోషమున మంథరమాట లాలించి కైకేయి రాము నరణ్యమున కంపెను. రావణసహవాసమున రాక్షససంఘ మంతయు రామునిచే మడిసిరి. సహవాసమునుగోరి సీత రామునితో నరణ్యమున నిడుమలఁబడెను. రామసుగ్రీవులు పరస్పరసహవాసమున నన్యోన్యకార్యసాఫల్యమునకు హేతువు లైరి. పాండవసహోదరుఁడు కర్ణుఁడు దుష్టచతుష్టయమునం దొకఁడగుటయు, అశ్వత్థామ క్రూరుఁడై సౌప్తికవధ గావించుటయు సహవాసదుష్ఫలితములు. శ్రీకృష్ణునివలన నర్జునుఁడు భగవద్గీత నెఱుఁగుటయు ధర్మరాజు భీష్మునివలన సమస్తధర్మముల నెఱుఁగుటయు సహవాస సత్ఫలములు.

పంచమహాపాతకులలో నైదవవాఁడు మొదటి నలుగురిస్నేహముఁ జేసినవాఁడు. ఆరునెలలు సహవాసముగావించిన వీరు వారగుదు రనుసామెత కలదు. కేవలము మానవులయందే గాక పశుపక్ష్యాదులయందును స్థిరములయందును సహవాస ఫలితము గాంచనగును. వృక్షము లొండొంటిరాపిడివలన నగ్నిని బుట్టించుకొని దగ్ధమగుచున్నవి. పక్షులు గుంపులు గుంపులుగా నివసించుటయం దాసక్తిగల్గి యుండును. ఇనుముతోఁ గూడినయగ్నికి సమ్మెటపెట్లు దగులుచున్నవి. లోహములకుఁ జింతామణిస్పర్శమున స్వర్ణత్వము గలుగును.

ఇట్లయ్యు చరాచరప్రపంచమునందు సహవాసమున మార్పునందకుండ స్థిరముగనుండునవి పెక్కులు గలవు. కుబేరునిసోదరుఁ డైనంతమాత్రమున శివునకు దారిద్ర్యము పోలేదు. కుబేరుఁడు దరిద్రుఁడు కాలేదు. ఇట్లే రావణవిభీషణుల స్వభావములు వారిబంధుత్వమున మారవయ్యెను. కౌరవసభయందున్నను భీష్మద్రోణప్రభృతులసౌజన్యమునకుఁ గళంకము రాలేదు. అగ్నితో జలము నెంతగాచినను నారెంటి శత్రుత్వము కొంచెమైనను తరగదు. సింహములతో నేనుఁగులును, పులులతో లేళ్లును, పిల్లులతో నెలుకలును సహవాసము చేయుట దుర్ఘటము. ఋషిప్రభావముచే నట్టివి సంభవించునందు రది యసాధారణము.

సహవాసము సహస్రవిధములు. సమానదేశకాలముల యందు సహవాసమున కనువగుపరిస్థితు లేర్పడుచుండును. కాలినడకను గాని బండిలోగాని ప్రయాణముచేయునప్పుడును, ధర్మశాలలయందును పదితరవిశ్రమస్థానములయందును విశ్రమించునప్పుడును మానవులకు స్వల్పకాల మొండొరుల క్షేమము లారయుటకును, నొండొరులసహాయముఁ బొందుటకును నవకాశము గలుగును. ఇది యొకవిధము. ఇది క్షణికము నస్థిరము. కాని, "సతాం సాప్తపదీనం హి స్నేహ" మనునట్లు క్షణకాలములోపలనే యొక్కొకసారి యసాధారణదివ్యమైత్రి పొసగుటయుఁ గలుఁగుచుండును. ఏకగృహమునందు, నేకగ్రామమునందు, నేకసీమయందు, నేకదేశమునందు, నేకజాతియందు నుండుటవలన నాయాపరిస్థితుల ననుసరించి యొండొరుల కభిమానమును నాదరమును గలుగుచుండును. ఇఁక గురుశిష్యులు, భార్యాభర్తలు, సోదరీసోదరులు, సహాధ్యాయులు, సహోద్యోగులు గావించుకొను సంబంధబాంధవ్యములు వివిధములుగ నుండును. ఇన్నివిధము లున్నను మిత్రులసహవాసమునే రూఢముగా సహవాస మని సావాస మని లోకు లనుచున్నారు. ఇందుకు యోగ్యు లగుమనుజు లరుదుగ నుందురు.

ఏవో యాశలకొఱకును, కుతూహలార్థమును, నర్థార్జనమునకును, గౌరవసంపాదనమునకును మానవుని చుట్టును మూగు లెక్కకుమిక్కిలియైనవారిలో నవ్యాజ మగుప్రేమయు నక్కర

మగునుహృద్భావమును గలవా రరుదుగ నుందురు. సుస్నేహా
మున కావశ్యక మగునుగుణపుంజములు ప్రజలయందుఁ గాకర
కొండఱు మిత్రులు లేకుండ సక్తింధములను మిత్రములనుగ
భావించి కాలము గడపుదురు. నిజమైన మిత్రు లొండొరు
లొకర్కొకరు ప్రాణముగ మెలఁగుదురు. సంపదలు సమముగ నను
భవింతురు. ఆపదలయం దొండొరుల కక్కఱకు వత్తురు. పర
స్పర మోక్షదాయకు లగుదురు. అట్టి మిత్రుల యాలింగన
సౌఖ్యమునుగూర్చి యొకసంస్కృతకవి యిట్లనుచున్నాఁడు.

కిం చందనై స్సకర్పూరైః కింతుహినైః కించశీతలైః ।
సర్వే తే మిత్రగాత్రస్య కలాం నార్హంతి షోడశీం ॥

ఎన్ని శీతలోపచారములైనను స్నేహితు నాలింగనము
జేసికొనుటలో గలుగుచల్లదనములోఁ బదునాఱవవంతైనను
రావని దీనిభావము. ఉన్నతాశయముల కంధులగుటచేతను
స్వార్థపరత్వముచేతను, నింద్రియచాపల్యముచేతను సామా
న్యులు సఖ్యమున కర్హులుకారు. సామాన్యులగుణములు
[illegible] సత్ఫలితములకు సాధనములు
[illegible] స్నేహము వ్యర్థముగ కాలహారణమును
[illegible] ఉదా [illegible]ములు గలిగియు తగుకార్యాచర
[illegible]టయు, ముత్తెపూరిన సౌహార్దముచే వినినవం
[illegible] నిర్వహ[illegible] నాచరించుటకుఁ బలుకుటయు,

తాఁబట్టినకుందేటికి మూఁడే కాళ్లనుచు, యుక్తాయుక్తములను
విచారింపక యితరులుచెప్పినది వినక తనకుఁ దోచకయుండు
టయు, హితముఁ జెప్పినప్పుడు తన్ను నిందసేయుటగా నాహి
తమును భావించుటయు, మన స్థితినిగూఢముగ నుంచికొని
కార్యాచరణమునమాత్రము బయలుపడుటయు, అమాయి
కులై రహస్యముల రక్షింపలేకపోవుటయు, ఒరులకష్టనిష్ఠుర
ముల నాలోచింపలేకపోవుటయు నను నీస్వభావములలో
నేదొకటి యున్నను వారు సహవాసమునకును సుస్నేహము
నకును బాత్రులు గారు. సూక్ష్మము లగుసుఖదుఃఖములు
నిందాస్తుతులు మొదలగువానిచే నాడింపఁబడుటయు నిరంకు
శత్వమును కానవచ్చినవారినెల్లఁ గౌగిలించుటయు స్నేహము
నకుఁ దగినసుగుణములు కాఁజాలవు.

సహవాసమునకుఁ బ్రేమయు గౌరవము నావశ్యక
ములు. ఒకస్థితియందుగాని యుద్యోగమందుగాని యుండు
టచే నొండొరులకు పరస్పరగౌరవము లేకున్నను బ్రేమ యుద
యించును. ఘన మగుస్థితియు గౌరవము నున్నవారిని గొంద
ఱని గౌరవించుచుండియుఁ బ్రేమింపఁ జాలము. గౌరవముచేత
సౌహార్దమును బ్రేమచేత స్థిరత్వమును గలుగును గావున
నీరెండును సన్మైత్రి కావశ్యకములు. అందువలన మిత్రులు
సౌఖ్యసమయమున సంతోషముతో నుండియు దుఃఖసమయ
మున నెడబాటులేక స్థిరముగ నుండియు నొండొరుల

కుత్సాహము నిచ్చువారుగ నుండవలయు. దీనికిఁదోడు మిత్రు లకు మతరాజకీయసాంఘికవ్యాపారములందు సామరస్య ముండ వలయును. భేదాభిప్రాయములు గలిగినప్పుడు గాఢమైత్రి నైన వదలుకొనవలసివచ్చును, లేదా భావప్రకటనమునకు భగవంతు డిచ్చినస్వాతంత్ర్యమునైనఁ గోల్పోవలసివచ్చును, అందువలన సమానపరిస్థితులు గలవారియందు మైత్రి చక్కఁగ శోభిల్లును. ఔదార్యము సన్మైత్రికి మూలకందము.

ఇఁక సచ్చిదానందమునకుఁ దోడ్డైనబాల్యస్నేహితు ు వారి స్వభావములును వారిస్నేహమువలనఁ గలిగినఫలా ఫలములను జర్చింతము. సహవాస మనఁగా నేదియో వివర ముగ నెఱిఁగినతరువాత సహవాసమునుగూర్చిన యంశముల యంతరార్థము మనకు గోచరించును. అప్పుడు సిద్ధాంతమున కును నాచరణమునకును గలసంబంధము స్ఫురించును. పురుషో త్తములకుమారున కిప్పుడు పూర్ణజ్ఞానవికాసమునకును స్వాతం త్ర్యమునకును దగ్గవయస్సు రాకపోయినను సుమారు తొమ్మి దేండ్లయీడు వచ్చియుండుటవలనఁ గేవలాజ్ఞానస్థితియందాత నికి సంభవించినకష్టములు తొలఁగిపోఁ జొచ్చెను. తనయొక లిని తానెఱుఁగకుండుట నోరుతెఱచి అమ్మాయని యన్నమైన నడుగలేకపోవుట యనులోపములు క్రమముగ, తగ్గుచుండెను. అతనిస్నేహితులలో నెక్కువమంది యాతనికంటెఁ బెద్దవయస్సు గలవారు. అయినను మేధావి యగుటవలన నొకవిధముగఁ

గొన్ని సమయములయందు సచ్చిదానందము వారికి నాయకుఁ డగుచుండెను.

అత్యంత సమీపమున నుండుటవలన మల్లినాథుఁ డను బాలుఁడు మనబాలునకు ముఖ్యస్నేహితుఁడు. చిత్రవిచిత్ర కథాసిర్మాణధురీణుఁడు సీతారాముఁ డొకస్నేహితుఁడు. మల్లినాథ సీతారాములు సచ్చిదానందముతో సమాన మగుతరగతి యందుఁగూడఁ జదువుచుండుటచే వారుముగ్గురికిని గాఢస్నేహ మేర్పడినది. సాయంకాలము వారుముగ్గురును చేతులుచేతులు పట్టుకొని షికారు వెళ్ళుదురు. అప్పుడు సీతారాముని సద్యః కల్పితకథలను అమాయికుఁ డగు మనకథానాయకుఁడు నిజముగా జరిగినవిషయములని విశ్వసించును. ఇట్లే చంద్రుఁ డను నొకస్నేహితుని వాక్యములనుగూడ నాతఁడు విశ్వసించును. చంద్రుఁ డిట్లు వచించుచుండును. "రాబోవు విజయదశమికి మానాయనగారు నాకు వెయ్యిరూపాయల నిచ్చెదరు. మామేన మామగా రిచ్చునది వెయ్యి. మా యమ్మమ్మగా రిచ్చునది వెయ్యి. ఇట్లు మాబంధువులందఱును నిచ్చుడబ్బుతో నేనొక రైలును నిర్మించెదను. దానిలో మల్లినాథునికి బండినడపు నుద్యోగ మిచ్చెదను. సచ్చిదానందము బండిలో గార్డుగ నుండుట కేర్పాటుఁ జేసెదను. సీతారాముఁడు బండిలో ప్రయాణికుఁడు. నేను యజమానిని". ఇట్లు నమ్మించుటయేగాక చంద్రుఁ డప్పుడు క్రొత్తక్రొత్తభాషలలో మాటలాడునట్లు

నటించుచుండ మిత్రులందఱును నిశ్చేష్టితులై చూచు
చుందురు.

వీరందఱిలోఁ బెద్దవాఁడును దుష్టుఁడు నొక్కఁడుండెను.
అతనిపేరు సుబ్రహ్మణ్యము. అతఁడు చిత్రము కుఱ్ఱవాండ్ర
నందఱి నేదోనెపముపెట్టి గిల్లియో గిచ్చియో యేడ్పింపక
మానఁడు. వాని దుండగములు బాలురకందఱకు దుస్సహ
ముగ నుండెను. ఒకనాఁడు వారంద ఱొకముసలమ్మ నాశ్ర
యించి యాతనికిఁ దగుశాస్తి వేయు మెట్లని యడిగిరి. ఆమె
ముం దిట్లడిగినది. "నాయనా! మల్లి! వాఁ డేడ్పించునది మీాము
వ్వురనేనా ? ఇతరులనుగూడనా ?" అనగా మల్లినాథుఁ
డిట్లు జబాబు చెప్పెను. " అవ్వా అతఁ డేడ్పించుపిల్లలకు
లెక్కలేదు మేము కొంచెము పెద్దవారముగాన మమ్ము నెక్కు
నగా బాధింపఁడు. ఆచిన్నపిల్లలఘోషఁ జూచిన మాకుగూడ
నేడ్పు వచ్చుచుండును. తగినయుపాయముఁ జెప్పి యాతఁడు
మాజోలికి రానట్లుచేసినచో నీకుఁ గావలసినవస్తువులన్నియుఁ
దెచ్చి యిచ్చెదము". అనఁగా అవ్వ బోసినోటితో చిఱునవ్వు
నవ్వి కొంచె మాలోచించి తలయూచి, "నాయనా నన్నడుగ
వలెనా, 'బలవంతమైనసర్పము చలిచీమలచేతఁ జిక్కి చావదె
సుమతీ' అన్నపద్య మింకను మీారు చదువలేదా. బాలురంద
ఱిని పిలిచి మీారంద ఱొక్కటియై యతనిని జయింపుఁడు.
ముందు కొందఱు చాటుననుండి మఱికొంద ఱీపాట పాడుఁడు,

'కోడిగుడ్డుగాలె కొత్తంగాలె, మాష్టారి సుబ్రహ్మణ్యుఁడు గాలె'. ఆపాటవిని యతఁడు మీామీాదికి వచ్చెను. అపుడు వెనుకముందుపట్టుకొని చుట్టుఁజేరి కాళ్లు నలుగురు చేతులు నలుగురు జుట్టిద్దరు నీవిధముగా పట్టి శిక్షింపుఁడు" అనెను. అందుకు సంతోషించి బాలు రామెకు జీడిపప్పు జామకాయలు తెచ్చిపెట్టిరి. అంతనామె, "నాకుఁ పండ్లులే వని మీాకుఁ దెలియదా నాయనా ఇవి నాకు వద్దు. మీాకిష్టమైనచో ఘానోజీకొట్లో నస్యఁపుపొట్లము సుభాన్‌కొట్లో సల్లమందుపొ ట్లము తెచ్చిపెట్టుఁడు. సింగరాచారివద్ద ఆకులు పోగ- చెక్కలు తెచ్చి కొంచెము నాయినుపరోటిలో నూరిపెట్టు . మీాకుఁ బుణ్యముండును." అనగా వా రామెకుఁ గావలసిన వన్నియుఁ దెచ్చి యిచ్చిరి.

సాయంకాల మగుసరికి బాలు రంద ఱొకచోటికిఁ జేరి చాలమంది యచ్చటచ్చట దాగియుండిరి. అదృష్టవశమున సుబ్రహ్మణ్యుఁ డచ్చటికివచ్చెను. వారు వాటఁ బాడిరి. అతఁడు వారిపై కురికెను. వారందఱును చుట్టు ముూగిరి. ఆయుద్ధములో సుబ్రహ్మణ్యుఁడు క్రిందపడెను. బాలురు కసిదీర నాతని పొడిచి పొడిచి వదలిపెట్టిరి. ఇంతలో నెవరో పెద్దమనుష్యుఁడు వచ్చి యతనిని విడిపించి చీవాట్లుపెట్టి పంపివేసెను. దెబ్బలు తగులుట యట్లుండ నింటివారు నుపాధ్యాయులు మొదలుగ నందఱును సుబ్రహ్మణ్యుని జీకొట్టిరి. అప్పటితో నాతని దుండగి మంతరించెను.

సచ్చిదానందమున్నేహితులలోఁ గృష్ణుఁ డనువాఁడు కలఁడు. ఇతఁడు నిందలకుఁ బ్రగల్భములకుఁ బుట్టినిల్లు నిత్యము నెవ్వరినో యొకరిని రేపి యాతనితోఁ గలహించి దెబ్బలు తినుచుండును. ఒకనాఁడు పురుషోత్తమపుత్త్రుఁడు బజారునకు వెళ్లుచుండెను. పదిమందిబాలు రేదో యాడుచుండిరి. అందులోఁ గృష్ణుఁడు కలఁడు. అతఁడు "ఒరే పిరికి సచ్చిదానందా యు నాతో ఒక్కసారి కుస్తీపట్టరా. నీబతుకు కనబడుతుంది". అని నిందింపఁగా నిఁక సహింపలేక మన బాలుఁ డాతనితోఁ పట్టుపట్టి యాతనిని క్రిందపడవైచి చిత్తుఁ జేసెను. కృష్ణుఁడు కన్నులు నులుముకొనుచు లేచి, "ఏది యింకొకమారు రా నీ తెలివి తెలుస్తుంది. నన్ను గెలువడము నీతాత తరమా" అని యనుచుండ పిల్లలందఱు నవ్విరి. కృష్ణుఁడు, "వెధవల్లారా, అందఱిని కట్టగట్టి తన్నెద ననగా" వారాతనిని తన్నుటకు సిద్ధమైరి. సచ్చిదానందము వారిని నివారించి యాతనితో నేమి అని యందఱిని దీసికొని బజారున కేగెను. కృష్ణుఁడు, "పిరికిపందలు, పారిపోతున్నారు" అని నవ్వుచు నింటి కేగెను. కృష్ణునియన్న శంకరుఁడుండెను. అతనికిఁ జదువున్నను. కాని కబుర్లు విస్తారము. "నా కీరోజు కమ్మనిభోజనము. నాగుడ్డలు మెత్ తత్తటిపట్టుబట్టలు. నాకు తెల్ల్ల్లని కాగితములు నల్ల్ల్లనిసిరాయుఁగలవు. మాయూరు చక్క్కహాడున్నది." అనుచుండును.

మనబాలునిమిత్రులలో నుత్తముఁడు వేదాద్రి. సద్గుణ సంపన్నుఁడు. వయసునఁ బెద్దవాఁడు. అతనిదస్తూరి ముత్యములకోవ. బాలురలో నతఁడు న్యాయాధికారి. న్యాయము తీర్చి దుష్టశిక్షణమును శిష్టరక్షణమును జేయును. బుద్ధియందు సామాన్యుఁడైనను శ్రమచేసి చదివి యతఁడు గణ్యత కెక్కుచుండును. ఇతఁ డెప్పుడును పురుషోత్తములయింటికి వచ్చుచుఁ సచ్చిదానందమున కనేకవిధముల సాయముఁ జేయుచుండును. వీరుగాక ప్రసాద మనునతఁడు కలఁడు. వాని తలిదండ్రులు చిన్నప్పు డశ్రద్ధవహించినందున యాతని దొంగబుద్ధిపెరిగి ప్రమాదములు తటస్థించెను. ఎందఱు స్నేహితులతో మెలఁగినను మనబాలునిసత్త్వస్వభావము మారలేదు. అందఱకును సచ్చిదానందము గౌరవపాత్రుఁ డయ్యెను. బాలురలో కక్షలేర్పడినప్పుడుగూడ నుభయకక్షలు నితని గౌరవించుచుండెను. ఒక్కొకప్పుఁ డీతనిని మధ్యవర్తి గావించుకొని వారు తగవులను దీర్చుకొనుచుందురు.

# పదునొకండవ ప్రకరణము.

## పద్మపతి.

కొలదికాలముక్రిందట సచ్చిదానందము పాపరాజుగారివద్ద సెలవుగైకొని యున్నతవిద్యాలయమునఁ బ్రవేశించెను. పాపరాజుగారిబడిలోఁ జదువు పూర్తిచేసినవారు చాల మంది తమతమ వృత్తులయందుఁ బ్రవేశించిరి. పురుషోత్తముల బాలునితోఁబాటు నిద్దరు ముగ్గురు మాత్రమే యాతని ప్రాత స్నేహితులలో నాతనితో నున్నతవిద్యకై చేరిరి. ఇప్పటికి వారి చదువు భారతభాగవతములతోడను బజారులెక్కలతోడను సరిపోయెను. ఇఁక వారు చదువనున్నది భూగోళశాస్త్రము, భౌతికశాస్త్రము, ఉన్నతిగణితము, సంస్కృతము, విదేశభాషలు, చరిత్రము, మొదలగునవి. ఇట్టి పరిణామస్థితిలో వారి యదృష్టముచే నొకయుత్తమగురువు లభించినవాఁ డయ్యెను.

వారియప్పటి గురువుపేరు పద్మపతి. అతని కుపాధ్యాయున కుండవలసిన యుత్తమలక్షణము లన్నియుఁ గలవు. మనోహరదీర్ఘకాయమును, స్వర్ణశరీరచ్ఛాయయు, విశాలనేత్రములు, విపులవక్షఃస్థలమును, ఆజానుబాహువులును గలిగి బాలుర కాతనియాకారము గౌరవమును బ్రేమను గల్గించు

నదిగ నుండును. అతనిబోధనాశక్తికౌశలము లత్యద్భుతములు. గణితశాస్త్రములో నాతఁడు చెప్పినపద్ధతులు బాలుర కవగాహనమగుటయేగాక, యాజన్మాంతము మఱువకుండునట్లు వారి మనఃఫలకములపై నవి ముద్రితము లగుచుండును. భూగోళాదిశాస్త్రములు వారికిఁ గరతలామలకములుగ నుండున ట్లాతఁడు స్పష్టపఱచును. సామాన్యముగ నాతఁడు బాలుర నెప్పుడును దండించి యెఱుఁగఁడు. ఆతనికంటె బెదరింపుతోఁ బనులన్నియు నెరవేరుచుండును. ఆతనికిఁ గోపమువచ్చినట్లు గ్రహించినంతనే బాలురు గజగజ వణకుదురు. హృదయమునం దత్యంతముగ దయయు జాలియు నుండియు నాతఁడు బాహ్యమునకు గంభీరముగ నుండును. బాలురకొఱ కాతఁ డెంతయో శ్రమపడి చెప్పినదే పదిసారులు చెప్పును. పొల్లుమాట లాడుట కాతని కెప్పుడును తీరుబడియుండునదికాదు. కపటుల కుపాధ్యాయవృత్తియంతసులభజీవనోపాయము వేఱొకటి లేదు. దానిని మనఃపూర్వకముగ నెరవేర్పఁదలచినచో నంతకఠినమైనవృత్తి మఱియొకటి లేదు.

పద్మపతివద్దఁ బాఠశాలలో విద్య నభ్యసించుట చాల దని సచ్చిదానందమును బురుషోత్తము లాతనియింటికిఁ బంపుచుండిరి. ఉపాధ్యాయున కామాతృహీనుఁ డగుబాలునిపై నత్యంతదయ యుండెడిది. సచ్చిదానందము మృదుస్వభావమును నతని తెలివితేటలను నాయన యితరులతోఁ బలుమారు

ప్రశంసించుచుండును. ఈబాలుఁడిట్లాఁ నాయుపాధ్యాయునివద్ద నింక
మువ్వురు పఠించుచుండిరి. ప్రారబ్ధమును దప్పింప నెవనితరము !
అట్టి యుపాధ్యాయుని సన్నిధానమునం దుండియు రంగఁడు,
రాముఁడు, సింహుఁ డనుపేళ్లు గలయామువ్వురును దుష్టులై
పోయిరి. గురువుగారియెదుటమాత్రము వా రమాయికులవలె
నటించువారు. కొంతకాలమునకు విసుగుజనించి పద్మాపతి వారిని
దమయింటినుండి తఱిమివేసెను.

వీరిలో రంగఁడు నాయకుఁడు. వీరుమువ్వురు తదితర
దుష్టబాలురతోఁ జేరి నిష్కారణముగ బ్రజలను దిట్టుట ;
స్త్రీలపై రాలుకువ్వుట, దొడ్లలోనున్న ఫలముల హరించుట
మొదలగుదుష్కార్యములనారంభించిరి. వీరు తరువాత దుస్స్త్రీ
సాంగత్యములను గావించి శరీరధనములను బాడుచేసికొనిరి.
రంగఁడు హాస్యమునకు నిధి ; యాతనిచేష్టలు చిత్రములుగ
నుండును. వాఁడు గురువుగారింటఁ బరుండుకాలములో నొక
రాత్రి, "పాము పా మంట్రోయి" అని బిగ్గఱగా కేకలు
వైచెను. ఆతనియరపుల కింటిలోనివారును నిఱుగుపొఱుగువా
రును వచ్చిరి. ఆతఁడు గజగజవణకుచు నది యొక కలుఁగులో
నికిఁ బోయినదన నాగోడయంతయు వారందఱును ద్రవ్వి
చూచిరి. తుదకు నిష్ఫలప్రయత్నులై వారంద జేగినతరువాత
రంగఁడు పొట్టయుబ్బునట్లు నవ్వి తనమోసమును జెప్పి స్నేహి
తులను నవ్వించెను. ఇట్టి ప్రవర్తనము సచ్చిదానందమున కిష్ట

ములేకున్నను రంగఁడు కొట్టునను భయముచే నీదౌష్ట్యమును
పద్మపతిగారి కాతఁ డెఱిగింపలేదు. రంగఁడు బలవంతుఁడు.
కుస్తీపట్టులలో నాతనితోఁబాటి మఱియొకఁడు లేఁడు. పద్మ
పతియుఁ జిన్నప్పుడు కుస్తీలలో దిట్టరియై యుండుటచేతను
నాతఁడు బాలురయాటలయం దెక్కువయుత్సాహము చూపు
వాఁడుగావునను, రంగని నాయన మొదటిరోజులలో మిగులఁ
ప్రేమించెను.

ఈయుపాధ్యాని యుత్సాహశక్తి యింతయంతయని
వర్ణింపఁజాలము. బాలురసహాయముతో నాతఁ డొక సహా
యకసంఘమును స్థాపించెను. అహింస, సత్యము, పరోపకా
రము ననుధర్మముల నితరులవలె బోధించుట మాత్రము చేసి
యూరకుండక పద్మపతి వాని ప్రత్యక్షాచరణమునకే యుపాయ
ముఁ జేసెను. ప్రతిబాలుఁడును తననియమిత విధానము ననుస
రించి సాయంకాలము లోపల నే ప్రాణికైన నొక్కయుపకార
మైనను చేసితీరవలయును. ఆయుపకారమును దన యుపాధ్యా
యునకు మఱునాటి లోపలఁ దనపుస్తకములో వ్రాసి చూప
వలయును. ఇట్టికార్యము సంపూర్ణమనముతో నాచరింపవల
యును. పిల్లలు తప్పిపోయినచో నాపిల్లల వెదకి వీరు త్వరలోఁ
వారితలిదండ్రులకుఁ జేర్చుచుండిరి. వైద్యసహాయము కావలె
నన్న సంఘమువారు సిద్ధము. ఉత్సవకాలములయందు యాత్రి
కులపాలిటి కల్పతరువులై బాలురు మన్ననలఁ గాంచుచుండిరి.

సచ్చిదానంద మీసంఘమునందు బాలురలో నగ్రస్థానము వహించెను. బాలురకుఁగాని ప్రజలకుఁగాని సంఘవిషయములు బోధింపవలెనన్న పద్మపతియీబాలుర కాపనిని స్వేచ్ఛగ వదలివేయుచుండెను. ఈసంఘచిహ్నమును జూచినంతమాత్రమున దొంగలు పలాయనమగుచుండిరి. రాత్రిపూటఁగూడ గస్తీయుండుటవలనఁ బ్రజలు గుండెలమీఁద చేతులువైచికొని నిద్రింపఁగలిగిరి. పిచ్చుపోలలు దొంగతూకపురాళ్లు చాలవఱకడుగంటెను. మూఁడుముక్కలాటలు మునిఁగిసినవి. త్రాగుడు తగ్గినది. రోడ్లు శుభ్రపడినవి. అన్యాయములు పలాయనమైనవి.

బాలుర కప్పుడప్పు డుత్సాహముగలుగుటకు పద్మపతి యీసంఘముతో నాయాచిత్రప్రదేశములకువెళ్ళి వానిని వారు దర్శించి యానందించునట్లు చేయుచుండును. ఒకసారి వారిట్లు శిబిచక్రవర్తిస్థాన మగుచేఁజెర్లపురమున కేగిరి. ఒక సమయమున వారు సమీపారణ్యమును దర్శించిరి. ఒక్కసారి వారు నదినిజూచి స్నానమాచరించిరి. ఇట్టి సందర్భములలో బాలురకు స్వయంసహాయ మలవడెను. వంటచేసికొనుట మొదలన్నిపనులును వారే చేసికొనుచుండిరి. ఇట్లు భావిజీవనమునకుత్తమరీతిని బాలుర సిద్ధపఱచునేర్పు పద్మపతి సొమ్మనవచ్చును.

పద్మపతి చరిత్రపాఠమును జెప్పునప్పుడు సందర్భము ననుసరించి బాలుర కుత్సాహజనకముగఁ గథలు చెప్పుచుండు

వాఁడు. ఆకథలను వినుటయందనురక్తిగలవారై బాలు రాపాఠ
మునకు నెదురుచూచుచుందురు. ఇట్లే భూగోళశాస్త్రమును
చెప్పునప్పుడు ఆయాదేశముల యాచారములను వర్ణించును.
ఇట్టివర్ణనములు గొన్ని కడుపుబ్బ నవ్వు పుట్టించుచుండును.
పద్మపతి యున్నతవిద్యాలయమునందు పలువురుపాధ్యాయు లుం
డిరి. కాని యింతటిదక్షుఁడు మఱియొకఁడు లేఁడు. వారుచెప్పిన
కథలలో నొక్కటిమాత్ర ముదాహరింతుము.

"రాజగువాఁడు ప్రజారక్షణమునం దప్రమత్తుఁడై
యుండవలయును. అతఁ డశ్రద్ధవహించినయెడల మంత్రులో
తదితరులో యాతని మేలుకొలుపవలయును. పూర్వకాలమున
నాంధ్రదేశమున శృంగారనగరమునందు సుందరుఁ డనురా
జుండెను. అతఁడు పిత్ర్య మగుసింహాసనము నారోహించి
ప్రజారంజకముగఁ గొన్నాళ్లు రాజ్య మేలెను. అతనికిఁ గ్రమ
క్రమముగ స్త్రీలోలత మెండయ్యెను. అంతఃపురమునుండి
వెలుపలికిరాక సర్వము మంత్రియధీనము గావింపఁగా మం
త్రియు దక్షుఁడుకానందున రాజ్యమున నల్లకల్లోలములు ప్రబ
లినవి. ప్రజలమొఱల నాలకించువారు లేరైరి.

ఇట్లుండ దేవశర్మ యను బ్రాహ్మణుఁ డానగరమున
కోటయుత్తరద్వారమునఁ గొలదిమందిసైనికులతో నిలచెను.
ఆతనియాజ్ఞచే నచట గోపర్ధనేశ్ అనుపేరుతో నొకవినాయక

విగ్రహము వెలసినది. ఆవినాయకునకు నకహా చెల్లింపనిదే పూర్వద్వారమున నెవనినైనను, అతఁడు వెళ్లనిచ్చుటలేదు. ధనికులవద్ద నాతఁడు నూరువరాలవఱకు వసూలుచేయును. ఈసమయమున రాజుగారిపినతల్లి చనిపోవుట తటస్థించెను. విషయలోలుఁ డగురాజు దహనాదిక్రియలకుఁ దాను రాక యితరులను నియోగించెను. వారినందఱను దేవశర్మ యడ్డగించి, "రాచపీనుఁగకు గోపర్గశేఖుఁడు వేయివరాలదక్షిణ నడుగుచున్నాఁడు. అది యివ్వనిది కదలుటకు వీలులేదు." అనెను. దేవశర్మవద్ద పెద్దసైన్యముండెను. రాజభటు లాతని నేమియుఁ జేయఁజాలరైరి. రాజుగారిపినతల్లిశవము నచ్చట దింపవలసివచ్చెను. మిక్కిలికష్టముమీఁద నీవృత్తాంతము రాజుగారిదగ్గఱకుఁ జేరెను. రాజు కన్నులఁ దెఱచినాఁడు. "ఎవఁ డింతసాహసుఁడు. నన్నెదిరించి యాతఁడు జీవించునా. సైన్యములన్నియు సిద్ధముచేయుఁడు" అని మంత్రులకాజ్ఞయిడెను. క్షణములో ననేకవేలసంఖ్యగలసేనలు సిద్ధమయ్యెను. రాజు క్రోధతామ్రాక్షుఁడై ససైన్యముగా నుత్తరద్వారము సమీపింప, నాతనిబాల్యస్నేహితుఁ డగుదేవశర్మ యెదురుగావచ్చి యిట్లు విన్నవించెను. "మహాప్రభూ ! దేవరవారు నాపైననే దండెత్తివచ్చినారు. తమదర్శనముకోరి యాలోకమునందలి ప్రజలకష్టసుఖముల విన్నవింపఁదలచి యెన్నియోమార్లు నిష్ఫలప్రయత్నుఁడ నైతిని. తుదకీయుపాయముఁ బన్నితిని. ప్రజాపాలనమునం దప్రమత్తులరై దిగంతవిశ్రాంతకీర్తియుతులు

గావలయునని దేవరివారికి మనవి చేయుచున్నాను. ఇన్నిరోజుల నుంచి నేను సంపాదించినధనమును మీఖజానాకుఁ బంపుదును. ఆటుపై మీచిత్తము." ఈమాటలు రాజునకు వివేకోదయ కారణము లయ్యెను. రాజు దేవశర్మను కౌగలించుకొని బహూకరించెను. అప్పటినుండి రాజు రాజ్యతంత్రమునం దప్రమత్తుఁడై ప్రజలసంస్తుతులకుఁ బాత్రుఁ డయ్యెను."

పద్మపతికిలో నింకొకవిశేష మున్నది. ప్రాచీనహైందవ విజ్ఞానమునం దాయనకు మిక్కిలి యభిమానము. పూర్వహైందవాచారములను వర్ణాశ్రమాదివ్యవస్థలను నతఁ డెంతయుఁ బ్రశంసించును. నవనాగరకతయనుపేరుతోఁ బ్రబలునాచార వ్యవహారములయం దతని కంతగా నిష్ట ముండదు. అతనిబోధనలవలన నాపాఠశాలయందలి బాలురకును నిట్టిభావములు గలిగినవి. సచ్చిదానందమునకు నిట్టిభావములయం దాసక్తి హెచ్చినది. మనబాలునిభావిజీవితమున మహోన్నతఫలముల నొసంగదగిన యీయుపదేశమును పద్మపతి కలిగించినవిధము ప్రశంసనీయము. అతనిభావములఁ గొన్నిఁటి నిట వివరింతును.

హైందవజాతికి మతము పరమాధారము. ధర్మార్థకామమోక్షములలో మోక్షము వారియుత్తమాశయము. నవయుగమున నర్థము ప్రధానమై ప్రబలమైనది. అర్థము నారాధించుటచే నీతియు నడుగంటినది. రాజనీతి యనుపేర స్వార్థపరత్వము మిన్నుముట్టుచున్నది. ఇతరజాతులను దోచుకొను

టయు, వీరైన నాజాతులనంతరింపఁజేసి దమ రాదేశములఁ
నాక్రమించుటయు నిప్పటినాగరకజాతుల దుర్లక్షణము. భౌతి
కశాస్త్ర విశ్వాసముచే నిప్పటిమానవులు నాస్తికులయి భగవ
ద్భక్తిదూరు లగుచున్నారు. అరోగ్యకరము లగులక్షణములు
ప్రస్తుతనాగరకతలో నేవియు లేకుంటచే మానవున కిదియొక
యావశ్యకవ్యాధి యని యనవచ్చును. లక్షలకొలఁదిగ నున్న
వైద్యులసంఖ్య యింకను హెచ్చిపోవుచుండుటయు దానికిఁదగి
నట్లు రోగులసంఖ్య వంతువేసికొని పెరుగుచుండుటయుఁ జూడ
నీనాగరకతను వ్యాధియనినందున దోషములేదు. ఇది యంటు
వ్యాధులవలె నొకజాతినుండి మఱియొకజాతికి వ్యాపించును.
మఱియు నీవ్యాధి యంటుకొంచినచోట నవయవములలో సామ
రస్య ముండదు. కొందఱు లక్షాధికారులు. మఱికొందఱు
భిక్షాధికారులు. ఈవ్యాధియం దింద్రియలౌల్యము ప్రధాన
లక్షణము. మనస్సింద్రియములపై నధికారము వహించుటకు
బదు లిచ్చుట నింద్రియములు మనస్సుపై నధికారము చెలా
యించును. గృహనిర్మాణములు వేషపుమార్పులు, యానసౌక
ర్యములు, విచిత్రాహారములు నూతనము లుదయించినంత
మాత్రమున మన ముత్కృష్టస్థితిని బొందితిమని భావింప
రాదు. ఈసౌకర్యములు లేనిపూర్వకాలము మతనైతికబలసం
భావితమై యుత్కృష్టస్థితియం దుండినదనుట సమంజసము.
ఆత్మానాత్మవివేకము మనస్సునందలి యారోగ్యస్థితి.

నవనాగరకతయందు వైద్యము రోగకారణము నరియదు. పైపూతలతోఁదృప్తి జెందఁజూచును. అందువలన మానవునకు రోగోపశమన మొకప్పుడును గలుగదు. న్యాయవాద మన్యాయవాదమును సమర్థించుచున్నది. న్యాయస్థాన మన్యాయస్థాన మైనది. న్యాయాధ్యక్షుఁ డన్యాయాధ్యక్షుఁ డగుట తటస్థించుచున్నది. గుణము గణనీయము కాదు. ధనము గణనీయము. మోసగాని కిది మొదటిపంట. కృషీవలున కిది కృశించుకాలము. లోకమంతట సంశయము ప్రబలినది. భార్యాభర్తలకుఁ దండ్రికొమరులకు నన్నదమ్ములకు స్వజాతీయులకు నొండొరులపై విశ్వాసము నశించినది. మానవునకు తనయందే తనకు విశ్వాసము లేదు. నవనాగరకుడెండవానల కాగలేఁడు. తనభోజనము తాను చక్కఁగ నారగింపఁజాలఁడు. ఒండొరులకు సాయముఁజేయుటయు నాతిథ్యమిచ్చుటయు నాతనికి మోటైనవి. ఔదార్య మడుగంటుటయట్లుండ బీదలుగానున్నవారిని నవనాగరకుఁడు శాసనము గావించి శిక్షించును. తిరుగబాటులు రక్తపాతములు రాజకీయమున నాతనికి నిత్యకృత్యములు. జీవహింస యాతని యాచారము. వేయేల ప్రస్తుతనాగరకతయు నాగరకుఁడును జీవితపరమార్థమునకు మున్నూటికి దూరులు.

---

# పండ్రెండవ ప్రకరణము.



## మరల శాంతిప్రదము.



సచ్చిదానందమున కిప్పుడు సుమారు పదునాలుగేండ్లు వచ్చినవి. లోలమ్మ మరలవచ్చి పురుషోత్తముల ననేకవిధములఁ బ్రార్థించి యాతనికరుణార్ద్రహృదయమునకు నచ్చునట్లు తనభావిప్రవర్తనవిషయమై ప్రమాణము గావించి వారి యింటఁ బ్రవేశించినది. ఆమె కుమారుఁడున్నతవిద్యయందు నాశవదలుకొని శ్రీనగరమున కేగి యచ్చట సుందరేశుఁ డను న్యాయవాదివద్ద లేఖకుఁడుగ బ్రవేశించెను. ఈమెవచ్చిన సచ్చిదానందముపై లోలమ్మ పూర్వమువలె నధికారము చలాయించుట మానివేసి వినయవిధేయతలతో నుండెను. కోపము వచ్చినప్పుడు మాత్రము తనను దానుదిట్టుకొని గతించినతన మగని నిందించుకొనుచుండెను. నారాయణవరమునందున్నంత వఱకు బాలునివిద్య పూర్తియయ్యెను. ఇఁక నంతకంటె నున్నత మగువిశ్వవిద్యాలయవిద్యలను శ్రీనగరమున నభ్యసింపవలసియుండెను. పురుషోత్తములు వ్యయప్రయాసలకు జంకక తమకుమారుఁడు పట్టభద్రుఁడు త్వరలో గావలయునని వాంఛించుచుండిరి. ఫలాపేక్షను మాని నిరంతరకృషిగావించి

విజ్ఞానమును బడయ మానవులందఱును ప్రయత్నించుచుండ వలయు నని వారియాశయము. ప్రస్తుతము కొలదికాలము తాము విశ్రాంతిగైకొన నభిలషించి సచ్చిదానందముతోడను కోలమ్మతోడను వారు శాంతిపురమున కేగిరి. ఆసమయమున నారాయణవరములో వారియిరుగుపొరుగువారందఱును మిగుల దుఃఖించిరి. స్నేహితులందఱును బాలునివిడువలేక విడువలేక విడచిరి. అప్పుడప్పుడు తాము శాంతిపురమునకు వచ్చెద మనియు సచ్చిదానందముగూడ నప్పుడప్పుడు నారాయణవరము వచ్చుచుండవలయు ననియు వారు నియమముం జేసిరి.

సచ్చిదానంద మాయూరిని విడుచునప్పు డాతనికి దుఃఖము వచ్చెను. ఆయేడుసంవత్సరములు పరిచితమైన విద్యాలయములు నుపాధ్యాయులు స్నేహితులు క్రీడారంగము లొక్కసారిగ విడచుటకు మనసొప్పునా? రేపు ప్రయాణ మనగ నాతఁడు కొంచెము సేపు విద్యాలయమునందుఁ గూర్చుండెను. ఆవిద్యాలయము నందలి గోడలు సహితము తనను విడువజాలక విచారించుచున్న ట్లాతఁడు భావించెను. క్రీడారంగముల కేగ నందలిచె ట్లప్పటిగాడ్పులకు మిక్కిలిగ దల లూపుచుండెను. ఆవృక్షములను సంబోధించి వానినోదార్చి యతఁడు వానివద్ద సెలవుగైకొనెను.

సచ్చిదానందము మల్లినాథుఁ డనుమిత్రునితో శాంతిపురముఁ బ్రవేశించెను. ఆతనికాయూరు వింతవింతలిగఁ గన్పట్టె

నది. పూర్వమునలె నిప్పుడు ప్రజ లూరెనిండలేరు. ఊరిచివర నున్నయిండ్లు కొన్ని పాడుబడినవి. ఆయిండ్లచుట్టును గడ్డియు పొదలును వ్యాపించినవి. అచ్చట చదలపుట్టలును పాముల పుట్టలును విస్తారముగఁ బెరిగినవి. సచ్చిదానంద మాస్టరులు గాంభీర్యమున కచ్చెరువందెను. ఆతని కాస్థలములను చూచుటకుఁ గొన్నిరోజులు పట్టెను. వానినిజూచుచు నీక్రిందివిధముగ మల్లినాథునితో ననెను. "ఆహా ఇది కుమ్మరిఅమరయ్యయిల్లు. ఇచ్చట ఆవమునందు కుండలఁ జేర్చి యాతఁడు మంట వేసినప్పుడు నే నిచ్చట చలిగాచుకొంటిని. 'బాబయ్యగారూ మాకట్టకాలం సుమండీ. కూటికే గుడ్డకు కఱవు దగ్గరె క్రొత్తుండది' అనుమాటల నాతఁ డనఁగా వింటిని. అవి యిప్పటికిని చెవులలో మ్రోగుచున్నవి. అతని యిల్లాలు పిల్లనెత్తుకొని కూర్చుండినచోట యిప్పుడు చుంచెలుకలకై పిల్లి వేచియున్నది. ఆమెపిల్లను నేనుముద్దుబెట్టుకొనగా నామె, 'బుల్లీ! అయ్యగారెని పెళ్ళాడవే కూటికే గుడ్డకు కొదవుండదు' అనుచుండెడిది. ఇదిగో చాకలిసరయ్యయిల్లు. ఈయింటిముందు మాపిచ్చిగాఁడు భద్రయ్య గోలీలాడుచుండగా నేను చూచుచుంటిని. నేనుగూడ గోలీలాడి దోకిళ్లు పెట్టవలసివచ్చెను. పిచ్చిగాఁడిదెబ్బకు గోలి పటాలున బగులును. భద్రయ్య దెబ్బకు గోలీలు ముక్కలగును. ఈసరయ్యయింటిముందంతయు నాగజెముడు పెరిగిపోయినది. సరయ్య గుడ్డలారగట్టుచోట నిప్పుడు తుమ్మమొక్కలు పెరిగినవి. ఈచింతతోపుదగ్గఱ హనిమిసెట్టి

దుకాణ ముండెడిది. ఈస్థలములో నిల్లు కూలిపోయి మట్టిదిబ్బ యున్నది. హనిమిసెట్టివద్దఁ మాకు ఖాతా లుండెడివి. మేము పొలమునుంచిగాని యిండ్లనుంచిగాని ప్రత్తి తెచ్చి యిచ్చు వారము. ఆప్రత్తిని హనిమిసెట్టి మూడుకుప్పలుచేసి, ఒక కుప్పను తక్కెడలోఁబెట్టి బెల్లమో పప్పో తూచి యిచ్చు వాఁడు. హనిమిసెట్టికూఁతురు పచ్చగా బీరగింజలాగున నుండు నది. మా ముసలమ్మ యాపిల్లను జూచి, 'ఆపిల్లమెళ్లో జేరి బంగారము తసపసఁ బోగొట్టుకొన్నది' అనుచుండెడిది. ఈవీథు ప్లలో దసరానాఁడు కోలాట మెంతమనోహరముగా నుండెడిది! మెడలో గంధముఁబూసికొని సిగలో పూలు పెట్టుకొని, కోలా టపుకఱ్ఱలు పుచ్చుకొని కాపుకుఱ్ఱవాం డ్రంబరవీధిని ఆడిపోవు చుండువారు. ఆకండ్లపండుగ యిప్పుడు ముగిసిపోయినట్లు ముండ్లు రాళ్లు నిండినయీస్థలము చెప్పకచెప్పుచున్నది."

ఇట్టిసంగతులు వినివిని మల్లినాథునికిఁగూడ కన్నులకు నీళ్లు గిరగిర తిరిగినవి. సచ్చిదానందము బాల్యఁపుముచ్చట్లు వినసొంపుగ నున్నను నిప్పటిదుర్భరస్థితి హృదయవిదారకముగ నుండెను. ఇట్టిక్షీణదశకుఁ గారణ మేమని వారిరువురు పురుషోత్తముఁ బ్రశ్నించిరి. వారివలనను తదితరులవలనను వా రీక్రిందివిషయములను గ్రహించిరి. ఇటీవల కొలదిసంవ త్సరములక్రిందటినుండి వర్షములు తక్కువైనవి. పంటలు సక్రమముగఁ బండక రైతులు దరిద్రులైరి. చెఱువులలోనికిఁ

చక్కగ నీరు రాని పల్లపుపొలములనుగూడ నాగలియే పట్టెను. ఇట్లుండ పొలములకుఁ బన్ను లెక్కువ చెల్లింపవలసిన దని ప్రభుత్వమువా రుత్తరువు గావించిరి. కూటికి గడుపుకొన లేనివారు ఎక్కువపన్నులను జెల్లించుట దుర్ఘటమయ్యెను. ఈసమయముననే శ్రీనగరమున గొప్పయంత్రాలయములు వెలసినపనియు నచ్చట విరివిగ కూలి లభించుచుండిన దనియుఁ బ్రజలకుఁ దెలియవచ్చెను. వారు తమయిండ్లు వాకిండ్లు వదలి పెట్టి పొలములను బీడుపెట్టి సకుటుంబముగ శ్రీనగరముచేరిరి. అచ్చట జీవనము జరుగుచుండినను శాంతిపురమునందలిసుఖము వారికి లభింపదయ్యెను. ఇక్కడిఆటలు ఇక్కడిఆనందములు ఇక్కడి విశాలప్రదేశములు నక్కడ లేవు. అక్కడననేకవిధము లగువ్యాధులు సంభవించి కొందఱు చనిపోయిరి. మఱికొంద ఱిట్లేకాలము గడపుచుండిరి. ఇట్లే యనేకగ్రామములనుండి యనేకలక్షలమంది కూలీ లాశ్రీనగరమున యంత్రముల నడపుచుఁ గోటీశ్వరులకుఁ గోట్లకొలది ధనముల సంపాదించిపెట్టుచుండిరి. ఆకోటీశ్వరులు తమసుఖములకుఁ గోట్లకొలదిధనము వ్యయముచేయుదురు. కూలీలకొఱ కొకచిల్లిగవ్వయైనను జెల్లింపరు. ఇట్టిస్థితి యీకొలఁది సంవత్సరములలోనే సంభవించెను. ఈవిచిత్రము లగుమార్పులుబాలు రెఱుఁగరైరి. పద్మపతి చెప్పిన నవనాగరికతపాఠములు వారికి జ్ఞప్తికివచ్చెను. పద్మపతి కీనూతన యుగపరివర్తనములయందు ఆదరభావము లేకుండుట యెందులకో వారి కిప్పుడుచక్కగ నర్థమయ్యెను.

ఒకనాఁడు బాలురిరువురును మరల నూరివెలుపలనున్న దేవాలయమును జూచుట కేగిరి. దేవాలయ మిప్పుడు శిథిల స్థితిలో నుండెను. ఇదివఱకువలె ప్రజ లున్నగదా దక్షిణలు చెల్లుట, యజ్ఞాలు జరుగుట, ఉత్సవములు నడచుట. అర్చకుఁడు రామయ్య సచ్చిదానందమును జూచి యిట్లనియెను, "నాయనా! ముందటిమన శాంతిపురము గా దిది. ఏదో జీవనాలు వదలుకోలేక నిమసుతున్నాము గాని యిచ్చట స్వారస్యమేమీలేదు. ఈఆవరణపుగోడలు కూలిపోతున్నవి. లేనివారు లేరుగదా. ఉన్నవారైనా దేవునిసేవించుటకు రారు. భక్తిలేక కొందఱు. తీరుబడిలేక కొందఱు. మనయీశివాలయముదగ్గఱ ప్రభలుకట్టేవారు కదా. ఇప్పుడు శివరాత్రి వచ్చినదన్న మాటే గాని ఆప్రభలు ఆసంబరాలు శూన్యమైనవి. ఆబడి చావడి చూచారా. పడి నాశన మైనది. పంతులుసూరయ్యగారు రెండేండ్ల క్రిందట చనిపోయినారు. అప్పటినుంచి దాని దిక్కు చూచేవారే లేరు. సూరయ్యగారెంతమంచివాఁడండి. పిల్లలు పంచఁబట్టుకొని లాగినా కోపగించేవాఁడు కాఁడు. ఎన్ని నారు లడిగినా విసుగులేకుండ చదువుచెప్పేవాఁడు. మన యూళ్లో నామకులంతా ఆయనదగ్గఱనే గదండి చదువుకున్నది. దసరామామూళ్లాయనను ప్రార్థించి యింటికిఁదీసికొనిపోయి యిచ్చేవాండ్లము. పుట్లలెక్క లెవరికిఁ దెలియకపోయినా యాయనదగ్గఱకు రాగా ముక్కాలుమూఁడుగడియలలో చెప్పువాఁడు. పుట్టికిగిద్ద లెన్నంటే తడుముకోకుండా చెప్పుటకు

సూరయ్యగారికిఁ దగిపోయినది. తాంబులు వ్రాయనలెనంటే సూరయ్యగారు. ఉత్తరాలు చదివిపెట్టడానికి సూరయ్యగారు. మంచిచెడ్డ చెప్పడానికి సూరయ్యగారు. ఆయనసాంఙత్యానికి మేమాశ్చర్యముఁ జెందేవాండ్లము. పెద్దపుస్తకము, చదివి అర్థము చెప్పుతూ ఉంటె కోకిల లాలకించేవి. పురోహితుఁ డూళ్లో లేనప్పుడు సూరయ్యగారు కార్యకలాపముతులలో మం త్రాలు కూడ చదివేవారు. ఏమిచెప్పను నాయనా" అను చుండగా బాలురకుఁగూడ కన్నులకు నీళ్లూని నీరుతిరిగెను. ఇట్లే ఉద్యానాదికము లన్నియు శోభావిహీనములుగ నుండెను. అయినను శాంతిపురము సచ్చిదానందమున కానందదాయకము గాకపోలేదు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ". కొలఁదిరోజు లైనతరువాత మల్లినాథుఁడు నారాయణవర మేగెను.

సచ్చిదానందమునకు సాలెసుబ్బమ్మ జ్ఞప్తికివచ్చెను. ఆమెయింటికి కాతఁడు వెళ్ళగా సుబ్బమ్మ ముసలితనము ముదిరి బలహీనముగా నుండియు బాలుని గుర్తింపఁగలిగెను. అతని విద్యాభివృద్ధి కామె మిక్కిలి సంతోషించినది, "అవ్వా నాకొక్కకథ చెప్పవా? పూర్వపు శాంతిపురవృత్తాంతములు వినవలెనని నాకు మిక్కిలి యాశ కలదు. చాలసంవత్సరముల నుండి నీవుచెప్పిన వినవలెనని యెదురుచూచుచున్నాను." అని బాలుఁ డామెను నిర్బంధించెను. అప్పుడు ప్రాతఃకాల

సూర్యుఁడు తనలేయెండ నంతటవ్యాపింపఁ జేయుచుండెను. ఆయెండలోఁ గూర్చుండి యతిప్రయత్నముమీఁద సుబ్బమ్మ యిట్లుచెప్పఁదొడఁగెను.

పూర్వ మొకసమయమున మనయూరిమార్గమున నైజాము నవాబుగారు, సైన్యముతోఁగూడి వెళ్లుచు మనయూరి చింత తోపులో బసచేసిరి. నైజాముగారివిభవమును ఊరివారంద ఱును జూచిరి. మనయూరిలో నప్పుడు దొంగలమిండఁడను బిరుదు గలరామానాయకుఁ డనుముత్రాచువాఁ డుండెను. అతఁడు దొంగతనమునందు దొంగలఁ దలఁదన్నినవాఁడు. నవా బుగారిబంగారపుమంచము నపహరించెదనని యాతఁడు శపథ ముచేసి యింటికేగెను. ప్రొద్దు గ్రుంకినది. చీకటి పడినది. ఆరో జమావాస్య. వన్యమృగములు తిరుగాడఁ జొచ్చెను. చింత తోపులో నైజాముగారిబంట్రౌతు లతిజాగరూకతతో నుండిరి. రెండవజాము వచ్చినది. కావలివారు తూలుచుండ జమేదా రుఁడు వారి నదలించి కబర్దార్ అనుచుండెను. ముత్రాచు నాయకుఁడు గోచిపెట్టికొని శరీరమునిండ మసిఁబూసికొని తోఁపులో నొకచెట్టెక్కెను. ఆతఁడు దట్టముగానున్న తో పులో కోఁతివలె చెట్లమీఁదుగా వచ్చివచ్చి నైజాముగారి గుడారముపై నున్నచెట్టువద్దకు వచ్చెను. ఆచెట్టుపై నుండి డేరా స్తంభముమీఁదికి దిగి డేరాను తనకత్తెరతోఁ గత్తిరించి యాతఁడు లోపలఁ బ్రవేశించినాఁడు. వెలుపల భటులతిజాగ్రతగ

నున్నారు. లోపల నైజాముగారు భార్యాసహితులై నిద్రించు
చున్నారు. వారి యాభరణములయందలి వజ్రములకాంతులకు
నాయకునికన్నులు మిఱుమిట్లుగొనెను. నాయకుఁడు క్షణకాల
మాలోచించెను. బంగారుమడతమంచము ప్రక్కనఁ బెట్టి
యున్నది. దానిని సామాన్యమానవుఁ డెత్తజాలఁడు. నాయ
కునిహస్తములో నది యవలీలగ లేచినది. ఆతఁడు దానితో
పైకేగి చెట్లమీదుగ దాటిపోయి పెద్దచెఱువులో గుండుక్రింద
దానిని దాచి తిరిగి యింటికిఁ జేరి నిద్రించెను. తననే వెదకెద
రని భయపడి యాతఁడు మఱునాఁడు పరారి యయ్యెను.

తెలతెలవారినది. పక్షులకలకలారావము లనుమంగళ
వాద్యములతో నైజాము మేల్కాంచెను. కన్నులు తెరువగానే
డేరాయందలిరంధ్రము గోచరమైనది. ఇంకకొంచెము విచా
రించిచూడ బంగారుమంచ మదృశ్యమైనది. నైజాముగారిం
తటిసాహస మెవ్వరుచేసియుందు రని యాశ్చర్యమంది యావిష
యము వెంటనే విచారింపవలెనని సేనాపతి కుత్తరువు చేసెను.
ఈవార్త కార్చిచ్చువలె క్షణములో నెల్లయెడల వ్యాప్తమైనది.
శాంతిపురపుకరణములు రావింపఁబడిరి. ముత్రాచునాయకుని
యెఱుకలేక యింతపని జరుగదని వారు సూచించిరి. ఆతని
కొఱకు వెదుక నాతఁడు కనరాఁడయ్యెను. అప్పుడు నైజాము
జమీందారున కీవిషయమును గూర్చి విచారింపవలయునని

యాజ్ఞాపించి వెడలిపోయెను. ఆజమీందారుఁడు శాంతిపుర గ్రామాధికారులను కారాగారముం దుంచున ట్లాజ్ఞాపించెను. ఈసంగతిని ముందుగ నెఱిఁగి వారు పారిపోయిరి. పదునిమిది వత్సరములు గడచినవి. ఇంటికి రాకుండగనే నాయకుఁ డెచ్చ టనో మరణించినాఁడు. ఆతఁ డాచెరువులో గుండు క్రింద మంచమును దాచినాఁడని వదంతిమాత్రము కలదు. కాని యామంచము నేటివఱకు నెవ్వరికిని దొరుకలేదు. తరువాత కొంతకాలమునకు జమీందారు మరణశయ్యపై నుండ శాంతి పురకరణము లాతనిదర్శనముఁ జేసిరి. వారిప్రార్థనము లాలించి యాతఁడు వారిని మన్నించి కరణీకముల నిప్పించెను.

ఇంకొక్క చిన్న సంగతి చెప్పెదను. మన యూరిలో దొమ్మరిదాని మాన్య మున్నది, యెఱుగుదువా. పూర్వము దొమ్మరిదొకతె మనయూరిలో దాను లెక్కలుగట్టికొని యెగిరి పోయెదనని సాటించెను. పెద్దలందఱిని రావించి మిట్టమధ్యాహ్న సమయమున గడనెక్కి రెండుచేటలు చేతులకుఁగట్టికొని డోలు వాయించుమని తనవానితోఁ జెప్పెను. అంతట డోలు మ్రోగు చుండ నది పైకెగిరిపోయినది. కాని సక్రమముగ దిగఁజాలక చెఱువుపగ్గఱ పడి చనిపోయినది. దాని ప్రజ్ఞకు ప్రజ లచ్చెరు వంది యామరణమునకు మిక్కిలి వగచిరి. జమీందారుగారు దానిబంధువులకు మాన్యము నొసంగిరి.” ఈరీతిగ సుబ్బమ్మ

సంగ్రహముగ కథలుచెప్పి సచ్చిదానందముఁ నానందాబ్ధి నోల
లాడించెను. కొన్ని సమయములయం దిసుక తిన్నెల యం
దాతఁడు కాలముఁ గడపును. కొంతకాలము పురుషోత్తముల
వలన నాధ్యాత్మికవిషయము తెఱుగును. కొంతవడి సుబ్బ
మ్మతోఁ గడపును. మఱికొంతకాలము స్వాధ్యాయనములోఁ
బుచ్చును. ఇట్లు శాంతిపురనివాసము సచ్చిదానందమునకు
విశ్రాంతిదాయకమును విజ్ఞానప్రతిపాదకము నయ్యెను.

---

# పదమూడవప్రకరణము.

—:0:—

## చంద్రరేఖ.



పురుషోత్తములు తమబాలునితో నొక్కసంవత్సరము శాంతిపురమున విశ్రాంతిగైకొనునట్లేర్పాటుచేసికొనిరి. ఆయవకాశమునం దప్పుడప్పుడు సచ్చిదానందము తనమేనమామ యగు వీరభద్రశాస్త్రిగారింటికి వెళ్లివచ్చుచుండును. ఈప్రయాణములవిశేషములు వివరించుటకుముందు మనయువకుని స్వభావమును దెలిసికొందము. ఇప్పటి కాతనికి సుమారు పదునైదువత్సరములు వచ్చినవి. పురుషునిజీవితమునందు పదునైదవసంవత్సరము మొద లిరువదియైదవసంవత్సరమువఱకు నపాయకరమైనసమయ మని యందురు. ఈఘట్టమునందు సచ్చిదానందముప్రవర్తనము శ్రద్ధతో గమనింపవలసియున్నది. దైవకృపవలన నది సరళముగ నడచుచుండినది. నాతిదీర్ఘమైన కాయము, నుచితపరిమాణము గలయవయవములు, చక్కని శరీరచ్ఛాయ, తుమ్మెదరెక్కలనపహసించు శిరోజములు, విశాలహృదయము, నూనూగుమీసములు నాతనిలక్షణములనిచెప్పవచ్చును. మోమునందు సాత్వికభావ ముట్టిపడుచుండును. విశాలనేత్రములు తేజస్సంపదను వెలువరచుచుండును.

సూక్ష్మదృష్టిగలవారి కానేత్రములనుండి యొక్కొకమారు దివ్యప్రభలు వెలువడుచుండినట్లు గోచరింపఁగలదు. వేష భాషలయాడంబరము లావ్యక్తియందు లేవు. లోకులు వేష భాషలను మెచ్చి మోసపోవుచుందురు. నిజము నిలుకడపైఁ దేలును. పెద్దమనుష్యుఁ డెవరో నిర్ణయించునది హృదయమా బాహ్యవేషమా యని యిక్కాలమునఁ బ్రశ్న బయలుదేరు చున్నది. దీనికి సమాధాన మమాయికు లగు ప్రజలు నిర్ణ యింపఁజాలకున్నారు. ఎవఁడు విశ్వాసపాత్రుఁడుగ గాన్పిం చునో యాతఁడే ద్రోహిగా పరిణమించుచున్నాఁడు. జన సామాన్యమునకు మంచిచెడ్డలను విమర్శించి గ్రహించువివేకముఁ గూడ నుండదు. సచ్చిదానందమునందలిసత్యభావమును గ్రహింపలేక యనేకు లాతని నిక్కట్టులపాలుచేసి తాము గూడ నిక్కట్టులలోఁ బడిరి. ప్రారబ్ధవశమునఁ గావలసినయను భవమంతయు నైనతరువాత వా రాతని యాత్మౌన్నత్యమును బ్రశంసింతురు.

ఏకాగ్రచిత్తముతో నాతఁ డుత్తమవిషయములను గూర్చి భావించుచు మార్గమున నేగుచుండును. భావమునందు మగ్నమగుట ఏకాగ్రబుద్ధి గలిగియుండుట ననునీలక్షణములు భావిజీవనమున భక్తియోగసాధనముననత్యంతము నుపకారులు గదా. కాని ప్రజ లాతనిమానమున కపార్థములఁ గల్పింతురు. వారడిగినప్రశ్నలకుఁ దక్షణ మాతఁడు ప్రత్యుత్తరముల

సీయలేదని నెపముల నెన్నుదురు ఆతఁడు మంచివాఁడని యుపహసించుధూర్తులుగూడ కొందఱు లేకపోలేదు. వీరికందఱకును మౌన మాతని ప్రత్యుత్తరము. ఆత్మస్తుతియుఁ బరనిందయు సచ్చిదానందమున కెంతమాత్రము గిట్టవు. వీఁడు మిక్కిలి తనసద్గుణాదిసంపదను డాఁచియుంచుట కాతఁడు ప్రయత్నించును. 'నన్ను దుష్టునిగ భావించినను నాకు సంతోషమే' యని మిత్రులతో ననుచుండును. ఆతనిమోము దీనులపాలిటికల్పతరు వీతఁడని చాటించునట్లుంటచేఁ గాఁబోలు వృద్ధులు, బాలురు, ఆర్తులు, మొదలగువా రాతనిని జూచుటతోడనే సాయ మభిలషింతురు. వారికి సహాయముచేసి, తనయూరుపేరుల వారి కెఱిఁగింపక యాతఁడు తొలఁగిపోవును. స్వార్థత్యాగపరులను, నిరాడంబరులను, సర్వసమభావులను సత్యస్వభావులను మంచివా రని యుపహసించులోకులు, దుష్టులను ప్రశంసించి విశ్వసించి నాశనమగుదురు. లోకులు పలుగాకులు. లోకనింద కాతఁ డెంతమాత్రము వెఱపక నిర్భయముగ స్వపథమున నేగుచుండును.

మనయువకుఁడు ప్రాఁతకాలమునాఁటివాఁ డట. సత్యవాక్యనిరతి, నిష్కాపట్యము, సంతృప్తి, ఆరోగ్యము, వినయము మొదలగు సల్లక్షణములు ప్రాఁతకాలమునాఁటివి. ధూర్తత్వము, ఆడంబరభాషణము, అసత్యము, మోసము, అసంతృప్తి, అనారోగ్యము, అవినయము, అవినీతి మొదలగుదుష్ట

లక్షణములు నవనాగరికుల మనువారివి. పూర్వకాలము ధర్మ బద్ధము. ఇప్పటికాల మధర్మయుతము. కేవలమోక్షనిరీక్ష గల ప్రాతకాలము ధర్మార్థకామములను మోక్షమునకు సాధనములనుగ వినియోగించును. కేవలార్థకామములయందు నిమగ్న మగునవీనకాలమునకు మోక్షచింత కడుంగడు దూరము. ప్రాతకాలమునాటిది పల్లెటూరిస్వేచ్ఛ. నవయుగమునాటిది నగరనిర్బంధము. ఇక ప్రాతకాలమును నిందించు మూర్ఖుల నేమనవలయును. శ్రీవ్యాసభగవానుఁడు కలికాలపు ప్రజలిట్లే ధర్మవిరోధముగలిగి ప్రవర్తింతు రని పురాణము లందుఁ జాటినాఁడు. పురాణము లతిశయోక్తులతో నిండిన వనువారీపై విషయమునం దతిశయోక్తిని జూపింపఁజాలరు.

కొందఱాతనిని సద్బుద్ధితో గ్రహించి లాభమును బొందుదురు. తననిష్కల్మషహృదయము నాతఁడట్టివారికి బట్టబయలుచేయును. పరస్పరకలహములయందు సంధిగుదుర్చుటకును, సందిగ్ధసమయములయందు సలహానిచ్చుటకును నాతని ప్రజ్ఞ నిరుపమానము. 'సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయా' త్తను సామెత సార్థకముసేసి యెల్లవారిమనస్సునుగూడ నొచ్చకుండ నాతఁడు మాటలాడును. ఒకసారి యాతనిసత్యప్రియత్వమును రుచిచూచినవారు మఱియెన్నఁడు నాతనివిడుచువారు కారు. చరాచరాత్మక మగునీప్రపంచమును సేవించి దైవమును దృప్తిపఱచి తనవిధిని నెరవేర్చుటయే యాతనిపరమాశయము.

గ్రంథము లాతనిసన్మిత్రములు. ప్రకృతి యాతని గురువు. సద్గ్రంథకాలక్షేపము చేసి కొంచెము విసుగుఁజెందినప్పుడుగాని మఱియొకవిధముగ తీరుబాటున్నప్పుడుగాని యాతఁడు ప్రకృతిసందర్శనార్థ మేగును. ప్రకృతిదృశ్యములందు నిమగ్నుఁడైనప్పు డాతనికాకలిదప్పు లుండవు. ఆతని కన్నులు భూనభోంతరములఁ గలయఁజూచి యానందించును. మఱియు లౌకికవిషయములను గ్రహించుటయం దాతనికిఁ గుతూహలము మెండు. వానిలో నాతఁడు సామాన్యముగ ఐక్యము గలిగించుకొనకపోయినను వానిని జూచుటవలన నాతని ప్రపంచపరిజ్ఞానము వృద్ధియగుచుండును. బజారులో నేదైన యపూర్వవిషయము జరుగుచుండిన నచ్చట నాగి యా కలకలము శాంతమగువఱకు నుండి మఱికదలును. అట్టిసమయములయం దితరములగుపనులను విస్మరించుటవలన పురుషోత్తము లొక్కొకప్పు డీతనిని మందలించుటయు కద్దు. అట్టిచో హింసను జూచినయెడల నీతఁడు తనకపాయమువచ్చినను విడువక సాయముఁజేసి యాహింసను దొలఁగించును.

ఇఁక విద్యావిషయము. విద్యాభ్యాస మీతనికి మంచినీళ్లప్రాయము. ఇతరు లెంతోకాలమునకు గ్రహించునదాని నీతఁడు క్షణకాలములో గ్రహించును. దానిని మననము చేసి స్థిరపఱచుకొనుట కాతఁ డెంతమాత్రమును శ్రమపడఁడు. సూక్ష్మగ్రహణ మాతనిగుణము. మననముచేసి స్థిరపఱచు

కొనకపోవుట లోపము. తోడివిద్యార్థులు నిద్రను విసర్జించి రాత్రులంతయు మేల్కొని చదువుచుండ నితఁడు రాత్రియం తయు సుఖముగ నిద్రించును. కాని నూత్న గ్రంథము చదువ వలసినచో తదేకదీక్షతో నతఁడు చదివి ముగించును. అప్పుడు నిద్రాహారము లాతనికి రుచింపవు.

నారాయణవరములో పురుషోత్తములదూరపుబంధువు లొకరుండిరి. ఒకానొకసమయమునందు బురుషోత్తములు తమ కుమారుని వారికడనుంచి నాలుగైదుమాసములు తీర్థయాత్ర కేగుట తలస్థించెను. అప్పుడా బంధువులబాలుఁ డొకఁడు సచ్చి దానందముతోఁబాటు చదువుచుండెను. అతఁడు నిరంతరము పుస్తకములముందు కూర్చుండి యుండును. అట్లె గంటలు దిన ములు గడచుచుండెను. పుస్తకములోనిపత్రములు మారిపోవు చుండును. నిశ్చలధ్యానాసక్తుఁ డగుసూర్యోపాసకుఁడుపోలె యాపత్రములయందలి యక్షరము లేకాగ్రతతో నాతఁడు గాంచుచుండును. బందుగు లీతనిదీక్ష కాశ్చర్యపడుచుండురు. ఆపత్రములలోనివిషయము లాతనిమనసున కెక్కుటలేదనియు నిదంతయుఁ గపటనాటకమనియు వారెఱుఁగరు. ఆతనితోఁ బోల్చిచూచి బొత్తిగ చదువుటలేదని పురుషోత్తములకుమా రుని నిందించుచుండిరి. సచ్చిదానందము దాని కిట్లు ప్రత్యు త్తరము చెప్పువాఁడు. "విషయగ్రహణము ప్రధానము గాని యెక్కువగంటలు చదువుట గొప్పగాదు. నేను పరీక్షయం

దుత్తీర్ణుఁడను కానప్పుడు నన్ను నిందింపుఁడు. ఇతరులతో సమానముగనో యంతకంటె నెక్కువగనో యుత్తీర్ణుఁడ నగుటకు వలసినంత చదువుచున్నాను.” ఈసమాధానముతో వారికిఁ గోపము వచ్చి పురుషోత్తములకు “మీ బాలుఁడు చదువుట లేదు. తిరుగుటతోడను గర్వోక్తులతోడను గాలము గడపుచున్నాఁడు. ఈతనిని జదువించుటవలనఁ బ్రయోజనము లేదు” అని వ్రాసిరి. అందులకుఁ బ్రత్యుత్తరముగ బురుషోత్తములు, “ఎవ రేయేకర్మల నెంతవఱ కాచరింతురో యంతఫలము పొందుదురు. మావానికి విద్యాభ్యాసమునకుఁ దగు నేర్పాటులుచేయుట మనపని. అతనియదృష్ట మెట్లున్న నట్లు ప్రవర్తించును. దానికి మనము విచారింప నక్కఱలేదు. బలవంతముగ నెవ్వరిచేతనైనను ఏపనినైనను జేయింపఁజాలము” అని వ్రాసిరి. పురుషోత్తముల ప్రత్యుత్తరము బందుగులకుఁ దృప్తికరముగ నుండలేదు. వారిబాలుఁడు రెండుమూఁడేండ్లు చదివినను నుత్తీర్ణుఁడు కానందునను నుపాధ్యాయు లాతఁడు విద్యానర్హుఁ డనితీర్మానించినందునను వారియీర్ష్య మఱింత యయ్యెను. పురుషోత్తములు పరమశాంతస్వభావులును సమర్థులు నగుటచే వారెవ్వరి నేమియుఁ జేయలేకపోయిరి.

ఆబందుగులచరిత్ర యింతతో ముగియలేదు. సచ్చిదానందమునకు గలసాత్త్వికస్వభావమును వెల్లడించుటకు మిగిలిన విషయములను జెప్పవలసియున్నది. ఆబాలుఁడును దల్లియు

సచ్చిదానందమును బాధింపమొదలిడిరి. యజమాని యమా యకుఁడై వారిమాటల విశ్వసించుచుండెను. ఆయిల్లాలిపేరు మారాంబ. మారాంబ సచ్చిదానందము స్నానపానముల విష యమై శ్రద్ధవహింపదయ్యెను. పోషణములేని కారణమున నాతనితలలో పేలుపడెను. శరీరమున దురద ప్రారంభమయ్యెను. "ఈతనివలన మనయింటికి కనర్థముగలుగును. మనకు పేలు దురదయుఁ దలస్థించును." అని మారాంబ తనపెద్దకుమారుఁ డగుమాధవునకు బోధించెను. మాధవుఁడు సత్స్వభావుఁడు గాన, "మానవులకు వ్యాధులువచ్చిన వానిని దగుపోషణ ముచే మాన్పుకొనవలెను గాని మెలుకలకొఱకు కిల్లుచిచ్చుపెట్టు టుచూ" యని యామెను ఖండించెను. మఱికొన్నిరోజు లకు మరల మారాంబ గగ్గోలుపెట్టినది. సచ్చిదానందముపై నెన్నియో స్వల్పము లగునేరముల మోపినది. చెప్పగా చెప్పగా మాధవునకుఁ జెవి నాటినది. ఒకరోజు నాయన సచ్చిదా నందమును బిలిచి, "నీవలన మా కనేకచిక్కులు తటస్థించు చున్నవి. మఱియొకచోటు చూచికొనుము." అని చెప్పెను. పురుషోత్తములు తిరిగివచ్చువఱకైన నాతని నచటనుండనీయక వారందఱు వేధించిరి. అంతటితో నాతని కాయిల్లు దుర్భరమై నందున పురుషోత్తములకు సన్నిహితులైన మఱియొక రాతని నాహ్వానించిరి. అచ్చటికి సచ్చిదానందము వెడలిపోవుచుండ మారాంబ గద్గదికతో, "వద్దు నాయనా వద్దు నాయనా. ఇచ్చటనే యుండుము." అని పలుసారు లనెను. ఆతఁడు

మఱియొకరికడ కేగియు మారాంబను ద్వేషింపక వచ్చుచుఁ బోవుచు క్షేమ మరయుచు నుండువాఁడు. నూతనబంధువులు పరమకృపతో నాతని బోషించు చుండిరి. ఆయింటియిల్లాలి పేరు రాజ్యరమాదేవి. ఆమెతల్లివలె నాతనికి సుఖమును జేకూర్చి పూర్వదుఃఖములన్నియు మఱచునట్లుచేసెను. అందు వలన నాతనికి చక్కనియారోగ్యము లభించి మరలపుష్టో త్తములు వచ్చునప్పటి కాతనికానందమును గలిగించునట్లు సుఖముగ నుండెను. పురుషో త్తము లీవిషయములన్నియు శాంత భావముతో గ్రహించిరి.

శాంతిపురమున నున్నకాలమున సచ్చిదానందము తన మేనమామ యగు వీరభద్రశాస్త్రిగారింటి కప్పుడప్పుడు వెళ్లి వచ్చుచుండె ననియంటిమి. వీరభద్రశాస్త్రిగారిది శాంతిపురమునకు సమీపముననున్న శివపురము. ఆయన గృహిణి పేరు సావిత్రి. తల్లి మహాలక్ష్మి. ఆయన కిరువురు కుమాళ్లును నిరువురుకుమార్తెలును గలరు. ఆయింటనందఱును సచ్చిదానందముపై గాఢానురాగము గలిగియుండిరి. మహాలక్ష్మి కప్పటి కరువదియేండ్లు. తనకుమార్తె కపుత్రుపుత్రుబిడ్డఁ డగుసచ్చిదానందమును జూచిన నామెప్రాణములు లేచివచ్చును. ఇట్టిసమాదరణ ముండుటవలన నతఁడు శాంతిపురమునుండిగాని తాను విద్యాభ్యాసము చేయుపట్టణమునుండిగాని యవకాశ మున్నప్పుడెల్ల నచ్చటి కేగువాఁడు. వీరభద్రశాస్త్రిగారి పెద్దకుమార్తె పేరు చంద్రరేఖ. చంద్రరేఖ కప్పటి కెనిమిదియవ యేఁడు.

మిసిమిదళుకొత్తు పసిడిచాయ గలశరీరము. చెంపకుచేరెడేసి కన్నులు, నునుకాంతివెల్లువలుగురియుచెక్కుటద్దములు, కాటుక నపహసించుశిరోజములు, మృదుమృణాళభాసురము లగుహస్తములు, గలిగియాకన్య చక్కనిచుక్కయని యిరుగుపొరుగు వారి ప్రశంస వడసినది. పసితనమునఁ దనమేనత్తకుమారునితో నాటలాడినయాబాల యీడువచ్చినకొలది సిగ్గుఁజెంది మాటు దూరముగఁ దిరుగుచు క్రేఁగంటిచూపుల నీక్షింప మొదలిడెను. బావగారికి వలయుపదార్థముల నాపె స్వయముగఁదెచ్చి యిచ్చుచుండును. ఆతఁ డితరులతో సంభాషించుచుండఁ దలుపుచాటున నిల్చి యాతనివైఖరి నీక్షించుచుండును. బంధువు లెవ్వరైన, "బావను పెండ్లియాడుదువా" యన లేనికోపము దెచ్చుకొనును. చిరునగవుదళుకొత్తునామెవదనబింబమునచ్చిదానందమునకుఁ గన్నులపండువుగ నుండెను. ఆపె చిలుకపలుకుల నాతఁడు చెవియొగ్గి యాకర్ణించును. ఆమెనుగూర్చినభావములతో నాతనిమనస్సు రసస్ఫూర్తిగలిగి విద్యాదివ్యాపారముల నుత్సహించుచుండును. ఇరుగుపొరుగువా రందఱును చంద్రరేఖాసచ్చిదానందములు దంపతులుకాఁగలరని రోళ్లరోకండ్ల పాటలుబాడమొదలిడిరి. పురుషోత్తములకుమారునికిఁ బిల్లనిచ్చుటకంటె నదృష్టము వేరుగఁ గలదా యని వీరభద్రశాస్త్రి భావించుచుండెను. నాయికానాయకులకును సర్వజనులకును సమ్మత మగునీవివాహముహూర్తము సమీపించెను.

---

# పదునాలుగవప్రకరణము.

## శ్రీనగరము.

ఉన్నతవిద్య నభ్యసించుటకు సచ్చిదానందము ప్రయాణమయ్యెను. పురుషోత్తములు తమకుమారు నున్నతవిద్యాలయమునందుఁ బఱంపఁజేయుటకై శ్రీనగరమునకుఁ బ్రయాణమైరి. వా రాతనిని శ్రీనగరమునందలి న్యాయవాది యగు జగన్నాయకులుగారింట విడిచి మిగిలినయేర్పాటులన్నియు వారు చేయునట్లును వలసినధనమునంతయుఁ దాను బంపునట్లును జగన్నాయకులుగారితో మనవిచేయఁదలంచిరి. తమకుమారునకు పలయుదుస్తులను నారాయణవరమునందు సిద్ధముచేయించి తెప్పించిరి.

శ్రీనగరమువిశాలమైనపట్టణము. అందనేకవిభాగములు గలవు. విశాల మగుమార్గములందు లెక్కకుమిక్కుటముగ బండ్లు తిరుగుచుండును. వీధులప్రక్కను బోరులుదీరి కాలినడకను వేలకువేలు ప్రజలు నడచుచుందురు. వర్తకవ్యాపారములు జరుగుబజారులు క్రిక్కిరిసి దుమ్ములురేగుచుండును. ఆదు మ్మాకసమునంటుచు దిక్కులునిండి ప్రయాణికులకు దుర్భరముగనుండును. ఆవీధులలో దొఱుకనివస్తువులు లేవు.

నూలుపోగులనుండి యున్నివస్త్రములవఱకును, నారబట్టల నుండి చీనిచీనాంబరములవఱకును, రాళ్లనుండి వజ్రములవఱకును, సాంబ్రాణినుండి కస్తూరివఱకును, సూదులనుండి శుద్ధ స్వర్ణభూషణములవఱకును, ఉప్పుమొదలుకొని చారపప్పువఱకును గలసమస్తపదార్థములు నచ్చట లభించును. ఆపట్టణములోఁ గొన్నిభాగములు రాజభవనములతోడను నుద్యోగుల భవనములతోడను, విశాలముగ నుండును. వాలగచ్చుతోడను బలపపురాళ్లతోడను నాభవనములు స్వచ్ఛకాంతిచంద్రికల బఱపుచుండును, ఆభవనములను బరివేష్టించి వివిధపుష్పఫలభారనమ్రతరువులతోఁ బ్రకాశించు సురుచిరోద్యానములు విరాజిల్లుచుండును. మఱికొన్నిభాగములు కర్మాగారములతో నిండి కొలుములసొగలతోడను సమ్మెటప్రేటులతోడను, కర్మకరులరాకపోకలతోడను సంకులముగ నుండును. ఇంకకొన్ని భాగము లతిసంకుచితములుగనుండి మార్గము తెలియని చిన్న గొందులును మురుగుకాల్వలును, చీకటిమూలలును గలిగి బీదలకు నివాసముగ నుండును.

కతిపయ ప్రయాణములఁ బురుషోత్తమసచ్చిదానందములు శ్రీనగరముఁ జేరిరి. న్యాయవాది జగన్నాయకులుగారిల్లు విశాలోద్యానములు గలశ్రీరామపుర మనువిభాగమునఁ గలదు. అచ్చటికి వీరుదయముననే చేరిరి. ఆసమయమున జగన్నాయకులుగారు తమతోఁ బనియుండివచ్చిన మనుష్యులతో

మాటలాడుచు తండ్రికుమాళ్లను గూర్చుండుమని సంజ్ఞ చేసిరి. జగన్నాయకుల సమీపమున విమలుఁడనువిలేఖకుఁడుండెను. వారిరువురును కేవలహృదయరహితులవలె నుండిరి. జగన్నాయకులే క్రిందివిధముగ వ్యవహారముల నొక్కగడియలోఁ బరిష్కరించెను.

"శాంతయ్యసెట్టీ ఇఁక నీవు చెప్పవలసిన దేమియు లేదు. నాకు వ్యాజ్యమంతయు బోధపడినది. సాక్షులకు సమనులు చేయించవలెను. ఇంకను చేయవలసినవ్యవహారములు చాలగలవు. మాపైకము చెల్లించినావా? లేదా?

శాంతయ్య—చిత్తము. ఉదయము విమలయ్యగారికిఁ జెల్లించినాను. మన మింకేమేమి చేయవలయు నండి

జగ—ఇఁక మాటలాడినచో నీకట్టయావల బారవేయుదును. నీవు పాఠములు చెప్పనక్కరలేదు. పోవమ్మావలకు.

అని మఱియొకవైపునకుఁ దిరిగి, "రామయ్యా, అత్యంతశ్రమఁ జెంది మీవాని కురితప్పించినాము. మనుష్యునిఁ జంపినవాఁ డెవ్వఁడైన యురినుండి బయటఁబడునా? నీ విక సణగినందువలనఁ బ్రయోజనము లేదు. పైకము దెచ్చినయెడల నున్నతన్యాయస్థానమునఁ బ్రయత్నించి ద్వీపాంతరవాసమునుండి శిక్షతగ్గునట్లు ప్రయత్నింతము. విమలా!

మనసూరయ్యా వీరినేరములో నింకను సాక్ష్యము తయారు చేయఁ గలఁడా ”.

విమలుఁడు—చిత్తము.

జగ—“ రామయ్యా ఇక నీవు వెళ్లవచ్చును. ” విమలా ఆసుబ్బమ్మను మనయింటివైపు రావద్దనుము. పైకము లేకుండ వ్యాజ్యములోఁ బనిచేయుటకు మన మామొఖానిసలమా. “ ఇంక నీరోజున వాయిదా లేమేమి కలవో చూచి వానికి సంబంధించినకాగితములు నాముందు పెట్టుము. ఈరోజు ప్రకాశభూపతిగారిన్యాయస్థానమునకు వెళ్లవలెనని బండి వానితోఁ జెప్పుము ”.

పురుషోత్తములుగారూ మీరిరువురు భోజనమునకు లెండు. మీరు వ్రాసినయుత్తర మందినది. సచ్చిదానందము నున్నతవిద్యాలయములోఁ బ్రవేశపెట్టి దానికిసంబంధించిన వసతిగృహములో భోజనాదిసౌకర్యము లేర్పాటుచేయుదము. సుఖముగ నుండును. మీరు నిశ్చింతగ శాంతిపురమున నుండవచ్చును ”. అని లోపలికేగెను. పురుషోత్తములును సచ్చిదానందమును జగన్నాయకులవ్యవహారదక్షతకును, కాఠిన్యమునకును నాశ్చర్యమందిరి. తరువాత షడ్రసోపేతముగ భుజించిరి. పురుషోత్తములు వారింట న్యాయవాదితోఁ దమపూర్వపరిచయములను వ్యవహారములనుగూర్చి చాలసేపు ముచ్చ

టించి తమకుమారుని వారికప్పగించి సెలవుగై కొని శాంతిపుర మున కేగిరి.

జగన్నాయకుల సహాయమున సచ్చిదానందము విద్యాలయమునఁ బ్రవేశించెను. వసతి గృహములో నాతనికొక గది యీయఁబడెను. దానికి, "ఒంటిస్తంభముగది" అనిపేరు. అందు దయ్యములు గలవని యితరులు భయమందుచుండిరి. కాని ఇతని కట్టిభయములు లేవు. కొంతకాలమున కితని కచ్చట సందఱు మిత్రులైరి. ఒకరిరువురు శత్రువులు బయలుదేరకపో లేదు. సచ్చిదానంద మావసతిగృహమున నొకప్పుడు నిర్వాహకుఁ డయ్యెను. ఈవసతిగృహమున భోజనాదిసౌకర్యము లొకయుపాధ్యాయుని యాధిపత్యమున జరుగుచుండెను. అంత రంగికనిర్వహణము విద్యార్థులే తా మెన్నుకొనిన నిర్వాహకుని ద్వారా నెరవేర్చుకొనుచుండిరి.

ఇఁకను విద్యాలయమున నిర్ణీతసమయములయందుఁ బాఠముల బోధించుచుండిరి. ఒకమహామహోపాధ్యాయుఁడు సంస్కృతభాషయందు నాటకాలంకారములను బోధించు చుండెను. మఱియొక యాంధ్రపండితుఁడు భారతభాగవతాది గ్రంథములను లక్షణసహితముగ బోధించుచుండెను. వేఱొక విద్వాంసుఁడు నానాదేశచరిత్రలను రాజ్యాంగతంత్రములను గఱపును. ఒకప్రతిభాశాలి విద్యార్థులను హూణభాషాపారం గతులఁజేయును. ఒకానొక నిష్ణాతుఁ డుస్నతి తరగతులలో

ప్రాచ్యపాశ్చాత్యతత్వశాస్త్రముల నభ్యసింపఁజేయును. మఱి యునిచ్ఛగలవారికి సంగీతము, చిత్రలేఖనము, రసాయనశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, వేదపరిశోధనము మొదలగుశాఖల నభ్యసింపఁజేయు నుపాధ్యాయులుండిరి. ఇందు సచ్చిదానందము క్రమక్రమముగ విద్యలనభ్యసించుచు తత్వశాస్త్రము నభిమానవిద్యగ గ్రహించెను. ఇక్కడివిద్యాభ్యాసకాలము సుమారు నాలుగుసంవత్సరములు.

సచ్చిదానందము వాఙ్మయపఠనమునందు నిమగ్నుఁడై రసజ్ఞుఁడుగను కవిగను పరిణమించుసూచనలను గనఁబఱచుచుండెను. ఛందస్సును వ్యాకరణమును గ్రహించుటలోఁ గొంత శ్రద్ధ వహించెను. ఇదియెగాక దేశీయవార్తల నెఱుఁగుటయం దాతనికి శ్రద్ధగలదు. వార్తాపత్రికల నిరంతరపఠన మాతనికి వ్యసనమయ్యె ననవచ్చును. ఇందుల కొకరిద్దరుపాధ్యాయు లాతని మందలించుటయు సంభవించెను. లోకములోని కఱవులు, హింసలు విని కని యాలెంచు శోకించును. స్వాతంత్ర్యనిరోధకవిషయములు, దుర్భరములనును. ప్రజాసేవయే పరమాశయమని భావించును. హైందవప్రాచీనౌన్నత్యమును నాగరికతను దెల్పుగ్రంథములు నిరంతరము పఠించును. ఈసమయమున నాతనికి ముగ్గురుస్నేహితు లేర్పడిరి. వారు సంఘసంస్కర్తలు, విగ్రహారాధనవిముఖులు, హైందవసంప్రదాయముననుసరించిచూచిన నాస్తికులతో సమానులు.

వారితో విరుద్ధముగఁ గొంతకాలము వాదించియుఁ దుదకు మనయువకుఁడు వారివలలోఁ జిక్కెను. వారికిఁ బ్రాణులయెడ దయ మిక్కిలిగనుండుటవలనను దేశభక్తివిస్తారముగనుండుట వలనను వారితోనితఁడు గాఢస్నేహముఁ జేయుట సంభవించెను. ఈసంసర్గమువలన నాతని కప్పుడుకలిగినభావములు కొన్ని యుదాహరింతును. వర్ణవిభేదము దేశనాశనమునకుఁ గారణము. స్త్రీలకు విధవావివాహములును రజస్వలానంతర వివాహములును గావింపవలయును. ఈశ్వరు నుపాసించుటలో విగ్రహారాధనము గూడదు. ఈభావములతో నుపన్యాసముల నారంభించుస్థితికి వచ్చినసచ్చిదానందమునకు విద్యాభ్యాసము నందలిమూడవవత్సరమున సుధీరుఁడను చిన్నవానితో స్నేహ మయ్యెను. ఇతఁడు విచిత్రశక్తియుక్తుఁడు. సమస్తవిద్యానిపుణుఁడు. యుక్తియుక్తముగ మాటలాడుటలో నగ్రగణ్యుఁడు. ప్రార్థనాచారపరాయణుఁడు. ఇతఁడు మననాయకునితోఁ బెక్కునెలలు వాదించి తుదకాతని దనపక్షమునకుఁ ద్రిప్పుకొని దిగ్విజయముచేసినట్లు భావించెను. ఈవిషయములను గూర్చిన వివరములకు మఱియొకపరి వచ్చెదము.

ఈసమయమున సచ్చిదానందము రెండుసంఘముల స్థాపించెను. మొదటిది యుపన్యాససంఘము. వసతిగృహమున నందున్నవిద్యార్థు లందఱు నీవిషయమున నాతనికి సహాయము గావించిరి. ఈసంఘయాజమాన్యమునఁ బ్రతిశనివారము

సాయంత్రము భగవద్భజనయు ప్రతియాదివారము సాయం
త్రమున నుపన్యాససభయు జరుగుచుండెను. మననాయకుఁడే
యీసంఘమున కధ్యక్షుఁడు. ఇతనికి సంగీతమునందు విశేష
పాండిత్యము లేకపోయినను భజనలను నెరవేర్చుటకు వలయు
సాహస ముండెను. భజన లీతఁడు మహోత్సవముగ నెరవేర్చుచు
విద్యార్థులసుహృద్భావమును బెంపొందఁజేసెను. ఉపన్యాస
సభలలో రాజకీయ మతసాంఘిక వాఙ్మయాదివిషయములు
చర్చకువచ్చుచుండును. ఈసభలలో మనమిత్రునియుపన్యాస
ము లు సర్వజనరంజకముగ నుండును. ఆతఁడు తనపరివర్తనము
ననుసరించుచు విషయములను వివరించుచుండును. అనేక
యుగములనుండి ప్రసిద్ధివహించిన హైందవనాగరికతాతత్వ
మును బ్రకటించుటలో నాతఁడు మిక్కిలి శ్రమవహించును.
దేశభక్తి ఆర్షమతభక్తి విద్యార్థులలోఁ బురికొల్పుట కెంతయో
ప్రయత్నించును.

ఆతఁడు స్థాపించిన రెండవసంఘము ప్రాణిసేవాసంఘము.
పద్మపతిగారివద్ద నభ్యసించినవిద్య వృథపోకుండునట్లాపద్ధతులపై
నితఁడు ప్రాణిసేవాసంఘమును స్థాపించెను. తనహృదయము
ల్లోనిమహాశయముల నమలులో నుంచఁదలచి యీతఁ డీసం
ఘమునకుఁ గొన్నికట్టుదిట్టముల నేర్పాటుగావించెను. సభ్యు
లందఱు కొన్నిశాఖలుగ విభజింపఁబడిరి ఆశాఖలు తమతమ
నాయకులను బ్రత్యేకముగ నెన్నుకొనవలెను. ఆనాయకు

లందఱు ప్రధాననాయకునకుఁ లోఁబడియుందురు. అందఱు సంప్రతించుకొనియే యెట్టిపనులనైనను జేయుచుందురు. ఈసంఘసభ్యు లత్యంతనియమముతోఁ బ్రవర్తింతురు. లోకోపకారము వారి ప్రధానధర్మము. చీమలు దోమలు మొదలుగ సమస్తప్రాణులలో నేది యాపదలలోనున్నను వారు రక్షించి తీరవలయును. సత్యవాక్యనిరతియు వ్యసననిరాకరణము వారి కవశ్యాచరణీయములు. దైవమాతాపితృగురువృద్ధజనభక్తి యవశ్యకరణీయము. మోసమనునది పీసమైన నుండరాదు. ఇట్టి నిర్బంధములన్నియు పరాపాదితములుగాక స్వీయముగ బుద్ధిపూర్వకముగ నాచరణములోనికి రావలయును. ఇట్టియాచరణమువలన విద్యార్థులనేకులు సన్మార్గవర్తనులైరి.

ఈసంఘముపేరుప్రతిష్ఠలు లోకమందు వ్యాపించెను. కాని సంఘాధిపతి యగుసచ్చిదానందము కేవలనిరాడంబరవృత్తి కలవాఁడగుటవలన తానును తనసంఘమును స్తుతులను బహుమానములను బొందకయుండ లోకోపకారము చేయవలయునని మిక్కిలి ప్రయత్నించుచుండెను. సంఘాధ్యక్షుఁడేల ప్రాచుర్యమునకు రాడనిలోకులు సభ్యులను బ్రశ్నించుచుండిరి. ప్రాచుర్యముగాని ఫలాపేక్షగాని మాసంఘనియమములకు విరుద్ధములని వారు ప్రత్యుత్తర మిచ్చుచుండిరి. ఒకసభ్యుఁడు ప్రతిఫలమును గ్రహించుటవలన నాయకుఁ డాతనిని మందలించెను. ఏవిషయ మెచ్చట నాచరింపవలసినను నాయకుఁ

డందఱికంటెముందు సిద్ధపడును. ఈవిషయమున నాతనినాయకత్వముసార్థకమయి సభ్యుల కానందదాయకమయి మార్గదర్శకమైనది. మఱియు వారు సహాయకాలమున జాతిమతవివక్ష చేయరు. ఉచ్చనీచము లాలోచింపరు. ఈసభ్యుల కాత్మరక్షణమునకును పరులరక్షించుటకును వలయు నావను, వైద్యవిద్య, ఈఁత మొదలగులక్షణము లన్నియు క్రమముగ దక్షులసహాయమున నాయకుఁడు వారికి నేర్పించెను. అప్పుడప్పుడు వీరు ప్రాచీనచరిత్రప్రసిద్ధము లగుస్థలములఁ గాంచి యుప్పొంగి తమ దేశభక్తిని పెంపొందించుకొనుచుండిరి. సచ్చిదానంద మొక్కొక్కప్పుడు నియమముల నతికఠినముగ సభ్యులపై నమలుజరపుచుండెను. ఇది కొందఱకిష్టములేకపోయినను సుహృద్భావముతో వారు దానిని సహించి యాతనిలోపమును మన్నించి తమసంఘైక్యమునే ప్రధానధర్మముగ భావించిరి. ఈసభ్యులందఱును ప్రజలనుండి ధనధాన్యములను సేకరించి బీదలకన్నమిడుచుండిరి. ఇందుఁ గొందఱుపెద్దలు పాల్గొని పేరు సంపాదించుకొనిరి. కాని యీసంఘమునకు కొన్నిచిక్కులు తటస్థించినపు డాపెద్దలు తొలఁగిచనిరి. మన యువకుఁడు మాత్రము కంటికిరెప్పవలె నీసంఘమును కాపాడుకొనుచు తన విద్యాకాలమును సార్థకముగావించెను. అతఁ డావిద్యాలయమునందు విద్య ముగించి శ్రీనగరము వీడినతోడనే తగిననాయకుఁడు లేకయాయుద్యమము సన్నగిల్లెను.

ఈవిద్యాభ్యాసకాలమున సచ్చిదానందము మిత్రులతోఁ గొండవీడు కొండపల్లి దుర్గములఁ గాంచి ప్రాచీనచరిత్రాంశముల స్మరించి స్మరించి దుఃఖించెను. ఇట్లు సంఘమునందు కార్యవశమున వర్తించుచుండియు మనయువకునకు నేకాంతమునందుఁ బ్రేమమెందు ఆతనికింపఁదుమిత్రులుండియు నేకాంతము మాత్రమాతనికి నిజమైన మిత్రుఁడనవచ్చును. వాఙ్మయ గ్రంథములాతనిచుట్టములు. జనసమ్మర్దములోఁ బ్రవేశించుటాతనికి సమ్మతముగాదు. ప్రవేశించినను తెలిసికొనఁబడక లోకవృత్తమును సమగ్రముగ నీక్షించి భావించుట యాతనికిష్టము. ఈవిద్యాభ్యాసకాలమున నవకాశముగల్గినపుడు మనయువకుఁడు స్వగ్రామములకు వెడలి పురుషోత్తములను వీరభద్రశాస్త్రిగారింట చంద్రరేఖను జూచి వచ్చుచుండువాఁడు. ప్రణయినీకటాక్షప్రసారము లాతనియౌవనవృక్షమున కత్యంతప్రశంసనీయ దోహదము లయ్యెను.

---

# పదునైదవప్రకరణము.

## అరణ్యము.

అది యొకమహారణ్యము. అందొకపెద్దలోయ గలదు. ఇరుప్రక్కల బాహువులఁ జాచి యాకసమున కేమో మొఱ వెట్టుచున్న ట్లత్యున్నతములైన పర్వతశృంగములు నింగి నంటుచున్నవి. ఎచ్చటఁజూచినను వృక్షములు, పొదలు, లతానికుంజములు, కొండగడ్డితో నిండినగుట్టలు దట్టముగనున్నవి. మిట్టమధ్యాహ్నపు సూర్యునికిరణము లెంతకసితో నసిధారాపాతముగఁ బడినను పరోపకారపారీణము లగువృక్షసమూహములు పాంథుల రక్షించుచున్నవి. సూర్యభగవానునిదాడి కోర్వలేక చీఁకటి గుహలలోఁ బ్రవేశించినది. పక్షిసంఘము లిటునటు నెగురుచు వృక్షచ్ఛాయలయందుఁజేరి యావృక్షముల ఫలముల నారగించుచున్నవి. చెట్లశ్రమ పక్షు లేమెఱుఁగును! పెద్దల కష్టనిష్ఠురము లెఱుఁగక పసిపాపలు కేకలిడుచు వారిచుట్టుఁ దిరిగి యాడుచుందురు! క్రూరమృగములుసహితము చల్లని పొదలలో డాగి నిద్రించుచున్నవి. పులికూనలు నిద్రించు తమతల్లిపై నటునిటుదుముకుచు నాడుచున్నవి. లేమావిచిగుళ్ల మెక్కి గండుకోయిలలు తమకుహూకారముల నరణ్యములఁ

ప్రతిధ్వనింపఁ జేయుచున్నవి. కొండసెలయేళ్లు తమకడ్డము వచ్చినరాళ్ళపై నణఁగుకొనుచుఁ బ్రవహింపఁదొడఁగినవి. అడవి బర్రెలు మెత్తమెత్తనిమేతల మేయుచు నేశబ్దము వినవచ్చినను బిక్కిబిక్కి చూచుచు పదనుగల కొమ్ములతోఁ గొండలఁ గ్రుమ్ముచు నేనుగు గున్నలవలె పులులనుగూడ భయపెట్టుచు న్నవి. ముద్దులుమూటగట్టులేడిపిల్ల లొకచోఁ గుమిగూడి చెంగు చెంగున గంతులిడుచు నాడుచుండ తల్లిలేడి తనచంచలనేత్ర ములతో నలువైపులఁ జూచుచున్నది. తొండలఁ దినియు పిట్టల గ్రసించియు పొట్టలునింపి, మత్తిల్లి పడియున్నపాము లచ్చటగలవు. జుంటితేనియల మాధుర్యమును దానితోఁబాటు తేనెటీగపోటులను రుచిచూచువారును, పిల్లనగ్రోవులనూదికొ నుచుఁ బశువులఁగాచికొనువారును, వాగురములనొడ్డి పిట్టలఁ బట్టువారును, పిట్టలఁబట్టుట హేయముగనెంచి ప్రాణములకుఁ దెగించి గండుపులుల వేటాడువారును, వెలగపండులను వెదురు బియ్యములను ప్రోవుచేయువారును, నయి యాటవికపురుషులు పెక్కు రా ప్రాంతములఁగన్పట్టుచున్నారు. కొండప్రక్కలనున్న వెదురుగుడిసెలలో స్త్రీలు వెదురుబియ్యము బాగుచేయుచు, వెదురుబుట్టల నల్లుచు, శిశువుల నాడించుచు, ఫలముల నందుచు, సుఖముగ మాటలాడుచు నానందమున నున్నారు. పరమానందదాయకమై మందమలయానిలము సకలప్రాణు లను సేదదేర్చుచు విహరించుచున్నది. వనవాసము కఠినమా!

దుస్సహమా! మధురఫలాహారములు, నిర్మలనిర్ఝరిసలిలపా
నములు, నవకుసుమసురభిళశీతజలకణసహితమలయానిలాను
భవములు, విపులతరుచ్ఛాయాచ్ఛాదితవాలుకాప్రదేశమృదు
శయ్యలు, దుస్సహములే యగును! సంసారాంధతమఃపతితు
లకు, లోకమున నింతకంటె నెక్కుడుసుఖము గలదె! ముఖ్య
ముగఁ బట్టణములయం దయ్యది గోచరించును. రోగాల
వాలము లగు హేయపదార్థాహారములు, సమస్తకల్మషపూరిత
దుష్పానములు, దుర్భరమలమూత్రదుర్గంధపూరితవాయుసేవ
నములు, మశకమత్కుణసమేతశయ్యలు, దుస్సహవాసములు,
నిత్యాసత్యవ్రతములు, ఎకసక్కెములు, నాస్తికత్వములు పర
మానందదాయకములు గాఁబోలును. ఆయాబవికాలమోహముల
నుండువిష్కాపట్య మిశ్రజలపు సహస్రపుటములు బెట్టినను
రాదు రాదు. ముమ్మాటికిని రాదు. ఎవ్వఁడైన దారితప్పి
విక్కుపటియుండినచో వాని నెగతాళిచేసి యీలోకులు
మెల్లనఁ దమలోఁ జేర్చికొందురు. అయ్యో! జగన్మోహన
దివ్యారణ్యదర్శనమునుండి యీదిక్కుమాలినప్రపంచప్రశంస
కేలనచ్చితిమి? మరల నచ్చుటకేఁ బోవుదము. ఈతప్పంతయు
మనస్సుది. మనస్సు మానవుని కాశినుండి రామేశ్వరమునకును
కావేరినుండి గంగకును తూర్పుసముద్రమునుండి పశ్చిమసము
ద్రమునకును క్షణకాలములో లాగుకొనిపోవును. అగుగాక.
ఇది చీమలు దూరని చిట్టడవి. కాకులుదూరని కారడవి.
లోయలోనుండి యొకకాలిదారి యుం దగుపడుచున్నది.

ఈదారి నరుదుగ ప్రజ లేఁగుదురు. ఏ నాఁబోటివెఱ్ఱివాఁడో యీవనసౌఖ్యము గ్రోలునుగాని సామాన్యజనులు ప్రాణముల యందలితీపిచే నేదొంగలుకొట్టుదురో యేమృగము లడ్డగించునోయని యఱచేతఁ బ్రాణము లుంచికొని బిరబిరనడచి పోవుదురు. ఏయాకుచప్పుడైనను పెద్దపులివచ్చె ననుకొందురు. ఏరాయిదొర్లినను నెలుఁగుబంటి దుమికెనని భావింతురు.

ఇట్టియీయరణ్యమున నెవ్వరో యొకబాటసారి యొంటరిగ నేగుచున్నాఁడు. శ్రద్ధగఁ దిలకింపుఁడు. పాప మాతఁడెవ్వఁడై యుండును. పాప మేమి? మిక్కిలిసంతోషముగ నేగుచున్నాఁడు. విశాలనేత్రము లుజ్జ్వలకాంతుల నీనుచున్నవి. మోము మరవిరిసిన చిఱునగవుల వెన్నెలలతోఁ బ్రకాశించుచున్నది. నిరాడంబరనాగరికువిలక్షణములు గలవు. వనమునెల్ల వీక్షించుచు, కొంచె మటునిటు చూచుచు మెల్లగ నడచుచు మరల వడివడిగ నడచుచు నేగుటచూడ నాతఁడు ప్రకృతిసౌందర్యము నీక్షించుటవలన నెమ్మదియుఁ గార్యవ్యగ్రతవలన తొందరయుఁ గలవాఁడుగఁ దోఁచును. ఆతనియునికిఁ జూడ మృగభయ మావంతయు లేనట్లును, చోరభయ మంతకుముందే లేనట్లును మార్గాయాస మసలే యెఱుఁగనట్లును గాన్పించును. మానసికవృత్తియు దేకాగ్రత నొందినవారి కీప్రపంచమునఁ దమలక్ష్యముతప్ప మఱియొకటేదియు గోచరింపదు. స్వీయాలోచనమునందు నిమగ్నుఁడగుచు తలపంకించుచు నేగు

మున్నాఁడు. ఇంతలో నెవ్వఁడో యాటవికుఁ డెదురుగవచ్చుటఁ జూడ నాతని గొట్టుటకా యనిపించుచున్నది. అయ్యో ఆసత్య మూర్తికి మన మెట్లు సాయపడఁగలము. పంచరూప్యముల వసూలుచేసి యాకోయవాని కిచ్చి నమస్కరించిన నాతని విడుచునేమో. వెఱ్ఱితలంపు. అరణ్య మెక్కడ? మనమెక్కడ? పంచరూప్యము లెక్కడ? యమదండమునంటి మహాదండము భుజాదండమున వహించి యెదురుగ వచ్చి యిట్లు గద్దించు చున్నాఁడు.

"ఓరు నీవు? యాడికయ్యో. నిలు నిలు. బాపనయ్యా. బయము లేదు! బండలు లేవు! యావూరుమీది?".

పాటసారి చిరునవ్వుతో, "మాది శాంతిపురము. నాపేరు సచ్చిదానందము. లోకోపకారార్థమై సంచారము చేయుచున్నాను. నేనేమియు ధనముకలవాఁడను గాను".

ఆటవికుఁడు—"అయ్యో నేను కొట్టిపొట్లాడేవోడ్ని. నీమొగము సూస్తె నాకు మొక్కబుద్ధవుతది. నీసంగతేందో కాత్తె సెప్పు".

సచ్చిదానందము—"ప్రజలకు మేలుచేకూర్చుటకును వారిదురాచారములు మాన్పుటకును, వారికి సద్బుద్ధి యలవఱచుటకును ఐకమత్యము చేకూర్చుటకును నేనుకృషిసేయు చున్నాను. ఇప్పుడు ప్రజలకు గలదుఃఖములను మాన్పి సౌఖ్యము నొనగూర్చుటలో నీవు నాకుఁ దోడ్పడవలెను"

ఆటవికుఁడు—"ను వ్వన్న దేందో తెలవలేదు. బాబు. మంచోడి వనుకుంటున్నాను. ఏమిదైర్నం. గుంపులుగుంపులు జనం గూడా తుపాకోడు లేకుండా మాకు బయపడి యీాడి కొమగుబెట్టరే! సచ్చి సచ్చి యీాదోవన బోతరే. నీకు బయ మెట్టా లేదంబా ?"

పొండి పొండి దొరా! పొండి పొద్దుబోయింది".

సచ్చిదానందము—"అన్నా యిటురా" అని వానిని పిల్లెను.

ఆటవికుఁడు—"ఇదేంమంచో డయ్యో. నెత్తురంట గిల్లుతుండావు".

సచ్చిదానందము—ఓరి! నీకు నొప్పిగలిగినదా?

ఆటవికుఁడు—నే నేం మడిసినా! రాయినా?

సచ్చిదానందము—మనుష్యు లందఱికి నొప్పియుండునా?

ఆటవికుఁడు—అందఱిది ప్రాణమే.

సచ్చిదానందము—ప్రయాణికు లందఱిది నీప్రాణము వంటిప్రాణము కాదా!

ఆటవికుడు—అయితే యేం?

సచ్చిదానందము—నీవుగాని మీావారుగాని కొట్టి దోచినప్పుడు వారికిఁ గష్టముగదా! మీాశరీరములపై మీా కెంతప్రేమయో వారికి మాత్ర మంతేగాదా? గిచ్చిన నీకు

నొప్పికలిగినది. తలపగిలినచో వారికెంతబాధ యగును? నీపెం డ్లాముబిడ్డ లెట్టివారో వారిపెండ్లాముబిడ్డ లట్టివారు మీదేవ్రుని పేరేమి?

ఆటవికుఁడు—'మల్లయ్య'.

సచ్చిదానందము—నీవు చచ్చినతరువాత నాయన ని న్నిట్టికష్టములే పెట్టును. జాగ్రత. అదిగాక మీ రడవిరాజులు. తినుటకుఁ జక్కని వెదురుబియ్యము మాంసము పండ్లు మీకుఁ గలవు. త్రాగుటకు సెలయేటినీళ్లు, తేనెలు గలవు. కట్టుకొను టకు చర్మములు గలవు. ఇఁక నాపాఁడుధనమును సంపాదించి కూడఁబెట్టనేల? ఆధనము వా రనేకమంది నన్యాయముచేసి సంపాదింతురు. ఆపాపిష్ఠిధనము మీకచ్చుబాటు రాదు. పైగా దానికొఱకు రక్షకభటులు మిమ్ము వెంటాడుదురు. అదుష్ట ప్రజలను మీరు కన్నులనైన చూడగూడదు. మంచివారు మీరు. కల్మషములేని బ్రతుకు మీది. కపటములేనిమనసు మీది. వారితోఁగలిసినంతమాత్రమున వారియుష్టమైనరోగ ములు మీ కంటి, మీవజ్రకాయములకు వ్యాధులు గల్గును. వారిదురాచారములు మిమ్ము వెంటాడును. కావున జాగ్రత యని చెప్పుచున్నాను. మల్లయ్యకు భయపడి మంచివాఁడ వగున ట్లొట్టుబెట్టుకొనుఁడు.

ఆటవికుఁడు—అయ్యా! నీవు సెప్పిందేదో తెల్సింది. మల్లయ్య దేవుఁడితోడు. ఇంక యిటువంటిపనులు సెయ్యను.

మాయింటికిరావో రా. మావోండ్లకు బోదసేతువు. ఆపాడు మడుసులసామ్ము మాకొద్దు. నీయంటోడ్ని సూశ్లేయీవఱకు మాయింటికొచ్చి కాత్తతేనె తాగుతావు? నాపెళ్లాం యెలగ గుజ్జు పెడ్డి. నెమిలెయిసనకర్ర నీకిసర బుద్దయింది. కాసేపు మాయింటికాడ కూకో. నీసోటికి నిన్ను పంపిత్తా.

సచ్చిదానందము త్వరగ వెళ్లవలసియున్నను నాకొండ వాని యాతిథ్యమును గ్రహించి వానిబంధువులను జూచి సన్మార్గబోధ గావింపఁదలఁచి వానితో నేగెను. వారింట వెదురుచాపపైఁ గూర్చుండి యావిందులారగించి యావనవా సులతోఁ బ్రసంగించుట నాతఁడు స్వర్గభోగముగఁ బరిగణించెను. సాయంకాలము కావచ్చుచున్నది. ఆయాటవికుఁడు సచ్చిదా నందము నాయడవివెలుపలివఱకు సాగనంపి యనేకనమస్కార ములు పెట్టి మరల రావలయునని యాహ్వానించి పోయెను. మెల్లగ నాతఁడు గ్రామమును సమీపించుచుండెను. పర మేశ్వరా! నీకరుణ నెంతని కొనియాడుదును. నీలీల లద్భుత ములు గదా. కొట్టవచ్చినయాటవికునిచేత సత్కారము చేయించితివి. సత్సంకల్పముతో నేగు ప్రజలను నీవన్నివిధముల గాపాడుచుందువు. సామాన్యులు తమకు స్వల్ప మగుకష్టము వచ్చినంతమాత్రమున నిన్ను నిందింతురు. వివేకులు కష్టము లను నీప్రసాదితము లగుమహాఫలములుగను భావిసుఖములకు

బీజములుగను భావింతురు. ఒకసజ్జనుఁడు రొట్టెలమూటగట్టి
కొని యడవి నేగుచుండెనఁట. వాని ననుసరించివచ్చినదుర్జనుఁ
డొకఁడు దొంగతనముగ బడితెతో వానిని బడగొట్టి యాతని
రొట్టెలను వస్త్రాదికమును హరించెను. ఈవిషయము భగవ
దనుగ్రహముగ భావించి దుఃఖింపక యాసజ్జనుఁ డట్లే పడి
యుండెను. దుర్జనుఁడు మాత్రము పరమానందముతోఁ గేకిసలు
గొట్టుచు రొట్టెల నారగించెను. ఆరొట్టె లింటికడనే విషదుష్ట
ములై యుండుటవలన నాదుర్జనుఁడు త్వరలోనే తద్దోషమున
మరణించెను. తరువాత వచ్చినబాటసారు లీసంగతివిని భగవ
ద్విలాసమున కచ్చెరువంది సజ్జనునకుఁ దగునాయముఁ జేసిరఁట.
నేఁడును సచ్చిదానందమున కపకృతియగుటకు బదు లుపకృతి
గలిగినది. తలపగులుటకు బదులు తలవనితలంపుగ బందుగు
లేర్పడిరి. ఇట్లాతఁ డొకయూరిలోనికిఁ బ్రవేశించెను.

మనమిత్రుని నీయడవులలోఁ గలసికొందు మని మన
మెన్నఁడును దలంపలేదు. ఆతనివిద్యావ్యాసంగ మేమయ్యె?
పురుషోత్తము ప్రేమయేమి. ఈతనకు నచ్చుచున్నచంద్రరేఖ సంగతి
యేమి? ధనసంపాదనప్రయత్నము లేమయ్యె? ఇవన్నియు
సమస్యలే. అతఁడు వాఙ్మయపఠనమువలన గడించిన కవితో
త్సాహమునఁ గవితలో మగ్నుఁడగునని తలంచితిమి. మఱియుఁ
బురుషోత్తముల కడనుండి ముదుసలితనమున వారిని సేవింప
వచ్చును. కొంతవిశ్రాంతియు నవసరమే. లోలమ్మ పెట్టినయిక్క

ష్టాలు, బంధుగులశ్రమలు, విద్యాభ్యాసాయాసము, పూట
కూలింటిచిక్కులు నాతని నలంచివైచినవిగదా! ఇఁక సుఖించవల
సినరోజులు వచ్చినవి. ప్రస్తుత మీతఁడు సర్వసంగపరిత్యాగి
వలె, సన్యాసివలె సీపర్యటన మేమి, యీవేషభాష లేమి,
యీప్రచారము లేమి, యీదుస్తరప్రయత్నము లేమి?
ఆతనిశీలమును మనమిదివఱ కెఱిఁగియే యున్నాము. పరివర్తన
కాలమునుండి భూతదయ యాతనికిఁ బ్రధానలక్షణముగ
నుండెను. లోకారాధన మాతనిముఖ్యధర్మము. విద్యాభ్యాస
కాలమున దేశభక్తి యతిశయించినది. వార్తాపత్రికాపఠనము
దానిని బ్రజ్వరిల్లఁజేసినది. దేశీయ దారిద్ర్యమును దుఃఖము
నపనయింపవలయునని కోరిక క్రమముగ నెదుగుచుండెను.
ఇట్టిసమయమున దేశపరిస్థితులు విషమించినవి. హైందవవిజ్ఞాన
మును సాంప్రదాయములు నడుగంటి విదేశధర్మములను బ్రజ
లవలంబింపఁజొచ్చిరి. ప్రభువులు విదేశీయు లగుటవలన దేశీ
యాశయపరిపూర్తికిఁ దగుకృషి చేయఁజాలకపోయిరి. అవినీతి
వృద్ధిఁబొందెను. కలహము లతిశయించి న్యాయస్థానములు
నిరంతరసేవ్యము లైనవి. నీతి నశింప మొదలిడెను. త్రాగుఁడు
మొదలగువ్యసనములతోఁ బ్రజలు దుర్భరస్థితికి వచ్చిరి. దేశీయ
వాణిజ్య మధమస్థితిలో నుండెను. లోకుల కైకమత్యము
శూన్యము. వారు చేతులుగలపిననేగాని యెట్టిపనియైనను నెర
వేరదు. ఇందులకు దేశీయులలోఁ బ్రముఖు లగువా రొక
సమావేశము గావించి లోకము నుద్ధరించుటకుఁ దగుయుప

తులకై యాహ్వానములఁ బ్రకటించిరి. ఆయుపకులు విద్యా దక్షులు నుపన్యాసధురీణులు సన్మార్గులు గానలయును. వారు సర్వత్యాగము గావించి యాపదలకుఁ జంకక గ్రామగ్రామము లకుఁ దిరిగి సద్విషయముల బోధించనలెను. ప్రజలకు దేశ భక్తి, నైతికబలము, ఐకమత్యము చేకూర్పవలయును. ఇట్టి పనిని నెరవేర్చుటకు సచ్చిదానందము ముందంజ వైచెను. వాఙ్మయమును వెనుకకుఁ ద్రోచి, ద్రవ్యసంపాదనాసక్తి కట్టి పెట్టి, పురుషోత్తములపై భక్తిని వారిసేవను సఫలించి, చంద్ర రేఖవలపును విరళముగావించి, సౌఖ్యములకు దూరుఁడై దేశ సేవయే ప్రధానముగాఁ బట్టణములనక, పల్లెలనక, యరణ్యాము లనక, వనములనక, కాలిబాటలనక రాజమార్గములనక, మంచి యనక చెడ్డయనక నుద్యుక్తుఁ డయ్యెను. పురుషోత్తము లాతని యావేశ మణంపరానిదని యెఱిఁగి సరి యనితలఁయూచిరి. కాని వారికిఁ దమకుమారుని ప్రవర్తన మంత నచ్చలేదు భారతభాగవతాది గ్రంథములనుండి ప్రజలకు భక్తిగలిగించు పద్యముల నాతఁడు చదువుచు గ్రామవాసులను ముం దాక ర్షించును. తరువాత వారివారి ప్రత్యేకలోపములను దేశస్థితిని తరణమార్గమును నాతఁడు వారికి బోధించును. పిదప నా గ్రామమున కున్న ప్రత్యేకలోపములను విచారించి వానిని నివారించు నుపాయముల నాచరింపఁజేయును. ఇట్లు లోకోద్ధ రణ ప్రచారము నారంభించి యిప్పటికిఁ గొన్ని మాసములైనది.

---

# పదునాఱవ ప్రకరణము.

## ప్రచారము.

సచ్చిదానంద మాయూరిలోనికేఁగఁగనే, అయ్యా! మీ దేయూ రనువారును, ఎచ్చటనుండి వచ్చితి రనువారును, భోజనమునకేమైన నేర్పాటుజరిగినదా యనువారును, ఏమిపనియుండి వచ్చితి రనువారునునై యాతనిచుట్టును ప్రజలు గుమిగూడిరి. అత్యుత్సాహముతో నాతనికి వలయుసౌకర్యము లన్నియు వారేర్పాటుగావించిరి. ఆరాత్రి యచ్చట నాతని యుపన్యాసము జరుగునని గ్రామమంతటికిని క్షణకాలములోఁ దెలిసినది. సత్వర మూరిలోని ప్రజలందఱును సాయంకాల భోజనము ముగించి యాసభకు బోడ్రాతివద్ద గుంపులుగఁ జేరుచుండిరి. ఏమి యీశ్రద్ధ! ఈఆదరము! ఈయుత్సాహము! ఇచ్చటనే యేమి. ఏపల్లెటూరైన నింతే. సౌహార్దము దయ సత్యశౌచములు నిష్కల్మషత పల్లెలయం దవతరించియుండును. నవనాగరికతానిలయము లగుపట్టణములకును, ప్రాచీననాగరికత కొలదిగనో గొప్పగనో నిలచియున్న పల్లెలకును భేదమిదియే. పల్లెలయందలిసంఘజీవనము కడుంగడు హృద్యము. ఒకయింటఁ గల్యాణమైనచో నూరంతయుఁ గల్యాణమే. అందఱియిండ్లకు

సున్నములు. అందఱిగోడలకు నెఱ్ఱమన్నుపట్టెలు. అందఱి వాకిండ్లకుఁ బచ్చనితోరణములు, పసపులు, కుంకుమలు, ముగ్గులు, అలంకారములు, నూత్నవస్త్రధారణములు చేయుచు నందఱును స్వర్గసుఖ మనుభవింతురు. ఒకరియింట మరణము సంభవించినచో నూరంతయు దుఃఖమే. ఊరంతయు నొకచోటికిఁ జేరి విచారించుచు, నోదార్చుచు, విహ్వలతనొందుచు నున్నరనుచు, దుఃఖసూచకముల నన్నింటిని సహించును. ఏసందర్భమున నెట్టిసహాయముఁ జేయవలసినను సందఱును సిద్ధము. రామాలయముఁ గట్టవలయునన్న నందఱు బండ్లుగట్టి రాళ్లు మట్టి తోలుదురు. కలపను సేకరింతురు. తలకొకచేయి వేసి గోడలను లేవఁదీయుదురు. పలుకిసధనధాన్యముల సేకరించి సులభముగఁ బ్రతిష్ఠచేయుదురు. శ్రీరాములయెదుట భజనలు కోలాటములు, పప్పుపానకములు గావించి యానందింతురు. ఒకయింట నేకూరలు పెరిగినను నేకాయలు గాచినను, అందఱి యిండ్లలో నవి కూరలుగావలసినదే. ఒకయింటిబఱ్ఱె యీనిన యెడల నందఱు జున్నుతినవలసినదే. ఒకయింటి కేక్రొత్తవస్తువు వచ్చినను అదియందఱును జూచియానందింపవలసినదే. ఊరిలోని కతిథివచ్చినాఁడనిన నాతనినాదరింపక ముద్దయెత్తరు. హింసకు మూల మగుమాంసాహారమరుదు. రాజచోరాగ్ని బాధల నొందుకొరులకు సాయముగ నుందురు.

ఇకఁ బట్టణములలో నెవరిగతివారిది. ఇరుగింటికష్టము పొరుగింటివారికిఁ బట్టదు. పొరుగింటిసుఖ మిరుగింటివారికి

గమనింపఁదగినదిగాదు. ఏయింటఁ గల్యాణమైన నాయింటి తోడనే ముగియును. అందుఁ బాల్గొనువారు లేరు. ఏయింట మరణమైన నాయింటితోడనేసరి. దయదలచువారు కాన్పింపరు. విచారించువారు శూన్యము. సహాయముఁజేయువారు మందునకైనదొఱుకరు. ఒరులకష్టములను విచారించి యందుఁ బాల్గొని తోడ్పడవలసినంతకర్మ మేమిపట్టినది, వారికి? "చిన్ననాపొట్టకు శ్రీరామరక్ష" యనుటయే వారిప్రధానధర్మము. నీరుమిక్కిలి వేనవేలు నోరులేనిపశువులఁ జంపి మాంసములమెక్కి క్రొవ్వుకండలు పెంచుకొని కదలలేక మెదలలేక ఒడలు పరవశమై యుందురు. దుర్వృత్తిపరులై లెక్కలేనిరోగములకుపుట్టలై వైద్యులకు దాసానుదాసు లగుదురు. మోము చెమటలూర్చి యార్జించి మితాహారులై ధనముగడించుతమ దేశీయులసర్వస్వము నేమాయలచే నెల్లనుహరింతునూ యను జపముదక్క వారి కొండుయోచనగాని దైనముగాని లేదు. ఈపల్లెలలో నివాసము, ఈయరణ్యములలో సంచారము మనఃయువకునికిఁ బరమానందదాయకములుగ నుండెను. ఆతని భోజన ముచితముగ లభించును. ధనము గ్రహించువారు లేరు. 'నీటిమజ్జిగనుండి తోటకూరవఱకు పైసఁజెల్లించిగాని కొనవలనుపడనిబస్తీలా యివి' యని యాపల్లెల వారప్పుడప్పుడనుచుందురు.

జామురాత్రి కావచ్చినది. ఆబాలగోపాలము బౌద్ధశాల దగ్గర చేరినారు. కలకలము చెలరేగినది. మనయువకుని యుపన్యాస మాలకింపవలయునని ప్రజలు తహతహపడుచున్నారు. ఉపన్యాసకుఁడును సిద్ధపడినాఁడు. మొట్టమొదట దైవప్రార్థన మారంభించినాఁడు. శ్రీమద్భాగవతము సప్తమస్కంధము నుండి, "కమలాక్షు నర్చించుకరములు కరములు" మొదలుగ ననేకపద్యములఁ జదివి యుపన్యాస మీవిధమునఁ బ్రారంభించెను.

"అస్మద్దేశీయులారా! మహాజనులందఱకు నమస్కరించి నే నొకటిరెండువిషయములు మనవిచేయఁదలఁచి వచ్చినాను. కరుణాకరుఁ డగు శ్రీమన్నారాయణుఁడు గావించిన యీచరాచరసృష్టి యత్యంతవిచిత్రమైనది. ఈవిశ్వమునం దెన్నిలోకములు గలవు? ఎన్నినక్షత్రమండలములు గలవు? వానియం దెన్ని కోట్ల జీవరాసులు గలవు? ఈజగ మెట్లు పుట్టి పెరిగి నశించును? ఇవన్నియు దురూహ్యములైనవిషయములు. ఈసృష్టివైచిత్ర్యము నెఱుంగఁగోరి ఋషులు ప్రబలప్రయత్నములు గావించి వేదములఁ గాంచిరి. వేదధర్మములను వ్యక్తీకరించుటకే శాస్త్రపురాణేతిహాసాదిమహాగ్రంథములు బయలుదేరినవి. ఇట్లు ఋషిధర్మము బయలుదేరిన మనభరతఖండ మనేకవేలవత్సరములనుండి ప్రఖ్యాతి వహించినది. ఇది వేదవేదాంతాదివిద్యలకుఁ బుట్టినిల్లు, ధన

ధాన్యసంపదలకుఁ దావరము. రత్నరాసులకు నిధానము. పుణ్య నదులకు నెలవు. పవిత్రక్షేత్రముల కాకరము. మహోన్నతము లగు హిమవదాదిపర్వతశిఖరముల కునికిపట్టు. మహర్షుల కాలపట్టు. మహారాజుల కాశ్రయము. సర్వపుణ్యములకు నివాసస్థానము. అట్టిపవిత్రభూమియందు జన్మించినమనమెల్లరము ధన్యులము. ఇది కర్మభూమి. ముక్తిపొందదలఁచినవారిందుండియే ముక్తులుకావలెను. మోక్షము ప్రధానధర్మముగ గలదేశ మీలోకమున నిదియొక్కటియే. మనపూర్వులు కేవలము వేదాంతపరులగుటయేగాక ప్రబలకార్యశూరులు సుఁడీ. ఇప్పటికి శిథిలములైన పూర్వమర్గములు శిల్పములు మనవారి యాధిక్యమును జాటును చరకశుశ్రుతాదివైద్య గ్రంథములు. వరాహమిహిరునిజ్యోతిషగ్రంథములు, ఆర్యభట్టునిబీజగణితము, భాస్కరునిసూర్యసిద్ధాంతము, కౌటిల్యునియర్థశాస్త్రము మొదలగునవి వారిప్రతిభను బ్రకటించుచున్నవి. ఇవి యన్నియు జ్ఞాపకముఁజేసికొని మన మందఱ మీవిశాలభారతముపై మాతృభక్తి గనుపఱుపవలెను. ఈతల్లి మనలను బెంచి పోషించినది. ఈదేశమాతృమూర్తిని పూజించనివాని జన్మ మేమిజన్మము ?

హైందవులకు జాతీయతలేదనియు నైకమత్యము లేదనియు విదేశీయులు కొంద ఱందురు. ఇది కేవలము కల్ల. సంస్కృతవాఙ్మయవైశాల్యమును, విదేశయాత్రికులు వ్రాసిన

వృత్తాంతములును, "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యనుమొదలగుసామెతలును, మనదేశమునందలి ప్రజలదేశ భక్తిని జాతీయతను వెల్లడించుచున్నవి. తీర్థయాత్రలసంస్థాపనము మాతృదేశారాధనమున కొకమార్గమైనట్లు స్పష్టమగుచున్నది. ఇట్టిమహత్తరమైనదేశమునకు, ఇట్టిభక్తులమగుమనకు నేటికి విపరీతపుఁరోజులు వచ్చినవి. అనేకవిధముల విదేశీయ సంపర్కముచే మనయాచారములు మారినవి. మనధర్మము బడుగంటినవి.

పరాధీనవృత్తి పరమదుఃఖభాజనమైనది. పరాధీనుల గోడు నాలించువా రుండరు. వారియాశయము లడుగంటును. వారిసంపదలు కొల్లగొట్టఁబడును. వారివృత్తులు క్షీణించును. వారివ్యాపారము లంతరించును. వారిపంటలు పాడగును. వారి కాదాయముకంటె వ్యయమెక్కుడగును. అట్టిదుర్భరస్థితిలో మన మిప్పుడున్నాము. మనకిప్పుడు భక్తి నశించినది. ప్రతిదినమున దేవాలయమునకేగి యాపరమపురుషు నారాధించి ధన్యతి నొందు నుత్కృష్టాచారమును మానివైచితిమి. దైవమును మారువారల కదృష్టము దూరముగ నుండునుగదా. దైవ భక్తితోఁబాటు దైవభీతి నశించినది. ధర్మాచరణముకూడ నావెంటనే పాఱిపోయినది. పెద్దలఁ బొడగన్న నమస్కరించుట, సర్వకాలములయందును సత్యమును బరిపాలించుట, అహింసయే పరమధర్మముగా భావించుట పరస్త్రీలను దల్లులుగా

జూచుట యను నార్యధర్మములు నేఁడు నశించినవి. నేఁ
డా యార్యధర్మములను మీరెల్లరును పాటుపడి పునరుద్ధరింప
వలయును. ఏమహామహులు అణిమాద్యష్టసిద్ధులతో విరాజి
ల్లిరో, ఏమహామహులు భౌతికాధ్యాత్మిక రాజ్యముల స్థాపించి
సమ్రాట్టులగుటలో ప్రసిద్ధులో, ఏమహామహులు సమస్తదేశ
ములఁ జమసౌకావ్యాపారములతో నించి భారతదేశమును
ధన్య మొనర్చిరో, ఏమహామహులు సర్వవిధసస్యములఁ బం
డించి సర్వౌషధులఁ బెంచి ధన్యులైరో, ఏమహామహులకు
భక్తిజ్ఞానవైరాగ్యములతో మోక్షసంపాదనమే పరమధర్మమో
అట్టి భారతీయులసంతతి యిక్కాలమునఁ గూడ నంతటివారై,
నీతి నుద్ధరించి, స్వాతంత్ర్యమును బ్రతిష్ఠించి ప్రతిభాపూ
ర్ణులై కీర్తిఁ గాంచవలయును. ఇందుకువలయు దేహారోగ్య
మునుగూడ సంపాదింపవలెను. మనయాచారములు దేహమును
జక్కఁగఁ బోషింప ననువైనవి. వాని నుద్ధరించి కర్రసాము,
కుస్తీపట్టుట, ఈదుట మొదలుగ కసరత్తులఁ గావించి శరీరము
లను బలముగలుగునట్లు చేసికొని యాత్మరక్షణమునకు సమర్థు
లము గావలయును. బీదసాదలను దఱిమివేయక మనతోఁ బాటు
కలిమో గంజియో వారికి నొసంగి వారికి వృత్తులఁ గల్పించి
మనకు వారు సమయము వచ్చినప్పుడు సాయము చేయునట్లు
గావించుకొనవలయును.

ప్రస్తుతకాలమున మనదౌర్భాగ్యమునకు కొన్ని ముఖ్య
మైనకారణములు గలవు. వానిని విచారింతము. ఇందు మొద

టిది మద్యపానము. సప్తవ్యసనములను మనపూర్వులు నిరసించిరి. వానిలో మద్యపాన మగ్రస్థానము వహించుచున్నది. దీనితో నెడతెగక జూదము వర్తించుచున్నది. మద్యపానము చేయువాఁడు చేయుచు రాఁగతఫలముల కనలేఁడు. తనక్షేమమునుగాని యితరులసౌఖ్యమునుగాని యాతఁడు విచారింపఁడు. ఏపరిస్థితిలోఁ దానుసంపాదించిన కొలదిరూకలను త్రాగుటలో నాతఁడు వినియోగించును. అందుచేఁ ద్రావకమునకుఁ గావలసినను లేక కుటుంబమంతయు మాడిపోవును. ఇల్లాలు నోరెత్తినచో నాతఁ డామెను పిడుగఁదన్నును. తనగౌరవమునకు భంగమగు నట్లు బూతులాడి తన్నులుదినును. ఏపెంటలలోనో పడి పొర్లాడును. అహో! యీమద్యపాన దురాచారమువలన నెన్నికుటుంబములు నాశనమగుచున్నవి. ఎందఱు దుర్మార్గులై త్రాఁగుటకు ధనముకావలసి చౌర్యమునకుఁ దిగుచున్నారు. ఎందఱి శరీరములు గుల్లలై శవాకారము లగుచున్నవి. సోదరులారా! దుర్భరము. దుర్భరము. దైవమును మదిందుంచుకొని యీరోజే మద్యపాన విసర్జనమునకుఁ బ్రమాణము సేయుఁడు. త్రాఁగనివారు త్రాఁగువారికి బోధింపుఁడు. మన త్రాఁగుడును మాని మనము ధనికుల మగుదుముగాక. మనకుటుంబములు సుఖించునుగాక.

(ఆసమయమున నూరిపెద్ద లేచి. 'అయ్యా! ఈరోజు నుంచి మనయూరిలో నెవ్వరును త్రాఁగకూడదు. అట్లు త్రాఁగిన

వారికి 20 రూప్యములచొప్పున నపరాధము విధింపవలెను'.
అనెను. దాని కాయూరిలోని పెద్దలుచిన్న లంగీకరించిరి. (త్రాగి
నవారో కులమునుండి వెలివేయుటకుఁగూడ తీర్మానించిరి.)

సోదరులారా! ఇంతటితో మనపని పూర్తి గాలేదు.
మనము విచారింపవలసినవిషయములు పెక్కులు గలవు. మనదు
ఃఖకారణములలో రెండవది పరస్పరకలహములు, వ్యాజ్య
ములు. వ్యాజ్యములందు, వాది నష్టము ప్రతివాది ముద
రిష్టము న్యాయవాది యదృష్ట మనుసామెత కలదు. మనకుఁ
బూర్వకాలమునఁ బంచాయతిపద్ధతి కలదు. ఇప్పటికిని పంచా
యతు లున్నను ఉపయోగముగఁ బనిచేయుటలేదు. ప్రజలు
దుర్మార్గులవలనఁ బ్రేరేపింపఁబడి న్యాయస్థానములపాలై నిర్ధ
నులగుట సంభవించుచున్నది. మనకుఁ ద్యాగబుద్ధి యుండవల
యును. ఒండొరులు త్యజించుటకు సిద్ధముగనున్నచో వ్యాజ్య
కారణమే గలుగదు. ఉన్నను సామరస్యముతోఁ బరిష్కరించు
కొనవచ్చును. మిక్కిలి యావశ్యక మగుకార్యములలోఁ బం
చాయతిదారులు దైవసాక్షిగ న్యాయమును జెప్పవలెను.
ఈసందర్భమున మనకందఱకు సర్వసమభావ ముండవలయును.
"శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః॥" అని భగవ
ద్గీత చెప్పుచున్నది. న్యాయమునుదీర్చుటయం దందఱకు నంద
ఱియెడ సమబుద్ధి యుండవలయును; జాతివివక్షతలు, ఉచ్చ
నీచభేదములు పాటింపఁగూడదు. మతభేదములు ద్వేషమును

గలిగింపరాదు. మనదేశములోఁ బ్రబలిన మతసహనము ప్రపంచమం దెచ్చటను లేదు. ఈపైఁజెప్పినపనులను జేయుచు నైకమత్యము సంపాదింపవలెను. ప్రజలంద ఱేకమైన నెట్టి మహోద్ఘటకార్యమైననుసాధింప నచ్చును. దేశాభిమానము నుంచుకొని దేశీయవస్తువులనే కొనవలెను. దేశీయపరిశ్రమలను బ్రోత్సహింపవలెను. యంత్రనిర్మితవస్తువులను నిరాకరించి స్వయంకృషితో వస్తువులను దయారుచేసి యనుభవింపవలెను. స్వతంత్రమైనవృత్తి, స్వతంత్రమైన జీవనము, స్వతంత్రమైన పరిపాలనము, స్వతంత్రమైన మోక్షప్రయత్నము, నవలంబించి, ధన్యులుగండు. నిత్యమును వార్తాపత్రికలను జదివియుఁ జదివించుకొనియు రాజకీయపరిస్థితుల నెఱిఁగి దేశమునందలి, పెద్దలయభిప్రాయముల ప్రకారమాచరించి, స్వరాజ్యసక్రమనిర్వాహణమునకుఁ బ్రయత్నింపుఁడు. భారతమాత మీకాయురారోగ్యములిచ్చి లోకమునకు శుభము నిచ్చునుగాక. "సర్వేజనాః సుఖినో భవంతు".

ఈ యుపన్యాసమును మిక్కిలి సంగ్రహపఱచితిమి. సచ్చిదానంద ముపన్యసించినవిషయము లింకను బెక్కులు గలవు. అవియన్నియుఁ బ్రజలహృదయములఁ బ్రోత్సహించి నూతనజీవశక్తిని గ్రామమునందుఁ గల్గించెను. ఆ మఱునాఁడాయూరిపెద్దలందఱును జేరి యాతనిఁ బ్రార్థించి మఱియొక

చుటకిచ్చుట యవకాశము లేదు. బాహ్యప్రకృతిని మానవ ప్రకృతిని నాతఁడు చూచిన తెఱఁగునవర్ణించుట యాయాకాలములనాఁడెట్లు ప్రవర్తించెనో చెప్పుట యనునవి ప్రధానములు. ఊళ్ల పేరులుగాని మనుజుల పేళ్లుగాని చెప్పనవసరము లేదు.

సచ్చిదానంద మొకనాఁడొకయూరి కేగెను. అట్టి గ్రామము లాప్రాంతముల ననేకములు గలవు. కాన నాప్రాంతమున కీయూరు మదుపుగా నెంచవచ్చును. ఆయూరిలోనియిండ్లన్నియు పూరిగుడిసెలే. సామాన్యముగ జనులందఱును బక్కచిక్కి యున్నారు. పొలములన్నియు రాతిభూములగుటచే వారికిఁబండునదియు నంతంతమాత్రమే. ఆయూరి కొకవైపున నొకపెద్దవాగును నొకవైపునఁ జెఱువును గలవు. వాగులో నెప్పుడును నీరుండును గాని చెఱువులోనికి నీరువచ్చుటయుఁ పైరుపండుటయు నరుదు. ఆవాగునకు సమీపమున నొకచిన్న కొండయు గుట్టలును గలవు. పశువులకును మేతతక్కువగుటచే నెట్లో యాగుట్టలపై మేసి యావాగులోనినీరు త్రావి యవి జీవించుచుండును. గ్రామమునసబుగారొక్కరుమాత్ర మాయూరిలోనికెల్ల ధనవంతులు. పెట్టుబడిదార్లును వారే. వారింటనే రెండుపూటల భుజించుట. ఆయింటివారే బలిసియుండుట. వారికే లక్ష్మీకటాక్షము. కరణముగారింట నొంటిపూటభోజనము. సంకటియో సారెకయో గంజియో గటకయో

నేమూడుజాములకో లభించును. ఇచ్చటిసుస్థితులన్నియు సచ్చిదానంద మొకరైతు నడిగి గ్రహించెను. తదుపరి యాతఁడాయూరిలోనికేగి కరణముగారింట బసచేసెను. ఆయింటిలో వృద్ధులగుదంపతులును కొడుకును కోడలునుగలరు. నలువురు కొంచమునల్లనిశరీరములు బక్కచిక్కినరూపములు గలవారు. వారి కొకపూరియిల్లు. అందొకమూల వృద్ధదంపతులు గూర్చుండి విస్తళ్లు కుట్టుచుండిరి. కరణముగా రొకమూల లెక్కలు వ్రాయుచుండిరి. పాపము! బొందులో మంగళసూత్రముదక్క నింక నేభూషణములెఱుఁగని యాయిల్లాలు ధాన్యములేనికుండల నటునిటు సవరించుచుండెను. నొల్లపొలమునకుఁ బోవువేళయగుటచేఁ గాఁబోలు నాయింట నున్నవాడిబట్టె యఱచుట కారంభించెను. దూడమాత్రము కేవలమమాయిక మగుతనమోముతో నందఱిని దేరిపారఁజూచుచుండెను. అతిథి కర్ఘ్యపాద్యముల నిచ్చినతరువాత మూడుజాములవఱ కుండగలిగినవో మాత్రోటిపా టెంతకలిగెనో గంజియో త్రాగవచ్చునని యజమాని చెప్పెను. సచ్చిదానంద మెప్పుడును కలియుగంజియుఁ ద్రావినవాఁడు కాఁడు. శ్రాంతీపురము పల్లెటూరైనను నాతనికి వరియన్నమునకుఁ గొఱత గలుగలేదు. ఇచ్చట సంకటి యెట్లు భుజింతునా యని చింతించి కోమటింటి కేగెను. అదియు నొకచిన్నగుడిసెయే. అచ్చటచ్చటఁ జేర్చినకుండలలో సజ్జలు, జొన్నలు, పప్పు, బెల్లము, ఉప్పు, ఉల్లిపాయలు మొదలగునవి చేర్పఁబడియుండెను.

ఇంతలో నెవ్వరో మందులోనికి దుంపరాష్ట్రము మొదలగువస్తు
వులవుఁగ లేవనియూకొట్టుయజమాని ప్రత్యుత్తరమిచ్చెను.
కొనువారంజలును కొలఁదిగ గింజలనుదెచ్చి యేదియోయొక
వస్తువునుకొని కొసరుక్రింద పొగాకు, ఉల్లిపాయ, మిరపకాయలు
మొదలగునవి యనేక మడుగుచుండిరి. షావుకారును వీనికిఁ
దగినట్లుగ అసలువస్తువులో తగ్గించి యిచ్చి కొసరుతో వారిని
సంతోషపెట్టి యింటికిఁ బంపుచుండెను. షావుకారుభార్యయు
దొంగలభయముచే సొమ్ములు కుండలలో దాచినది గాఁబోలు.
ముదుకచీరె ధరించి రవికెయు ముదుకదే తొడిగికొని ఉదయ
సూర్యబింబముననుకరించు ఎర్రనికుంకుమబొట్టుతో పంటిని
భుజముపై నిడుకొని వాగునుండి నీరు చేరఁబోయుచుండెను.
ఆమెకుమారు డాఱేండ్లవాఁడు సగముచినిగినగోచిపెట్టుకొని
దొడ్డిలోనివేపచెట్టుక్రింద నాడుకొనుచు వేపపండ్లేరితినుచుం
డెను. నాయనా! తినవద్దు జబ్బుచేయు నని తలిదండ్రులు
నుంపలించిన నాతఁడు వినలేదు. పాపము పసిపాపనికి చలిది
యన్నము లేనపు డాతఁ డెట్టులు వినఁగలఁడు! ఇట్లే పెద్దలును
ఆకులలములు కాయగసరులు వివక్షత లేక తినుటవలన నా
యూరిలో నజీర్ణవ్యాధి యెక్కుడుగ నుండెను. ఆషావుకారు
వద్దకేగి మనసచ్చిదానందము బియ్యమిత్తువా? యని యడి
గెను. చూచెదము రండనియాతఁడు కుండలన్నియు నవరిం
పఁగా నవరింపఁగా నేడుండ్లనో మూడుసంవత్సరములనాటివి
గిద్దెడునర బియ్యము దొరికెను. మరియొక యంగడిలేమిచే

వానితోఁ దృప్తిపొందినవి కొన్ని యూరకరాముగారింట నిప్పగా పాఁక మాయింటియిల్లాలు ప్రొద్దుపోయినదాఁక నుండఁజేసిన గ్రహించి త్వరగ నాతనికిఁ బడకనుచేసి భుజింపఁబెట్టెను.

ఆరాత్రి మనసుబాగాలేనట్టి కేశవులుసిద్ధముగ వాని యింటను బియ్యములేకపోవుటచే వరిగయన్నమును దినవలసి నవాఁ డాయెను. కన్నులు మూసికొని చిక్కనివిషజ్వరతో దెల్లో యూరాత్రి యాతఁడు భుజించెను. మరునాఁ డుదయమున మన సచ్చిదానంద మాయూరువదలిపోఁబోవుచుండ నొక్కడై యాతని కాపురా లిచ్చెద నన్నని యాహ్వానించెను. ఆయింటఁ గూడ దుష్టిబీభత్సశిథిలమే గనుపించెను. వానివస్త్రములన్నియు ననేకఛిద్రములు గలవియై యెన్నిమారులో కుట్టఁబడి మరల మరలఁ జినిఁగి ముక్కలై యున్నవి. ఆతనివాని వస్త్రములు సహితము నట్లున్నటు దుస్సహముగ నుండెను. ఆరాత్రిన నాతఁ డేగుచుండ నొకయింట నార్తరవము వినఁబడెను. అద్దానిని విని యూయింటిలోని కేగ నొక మనుసలిసమాతఁడు మరణమునకుసిద్ధముగనుండెను. ఆతని కెవ్వరును దిక్కు లేరు. లేకపోయినను యూరివారు మాత్రము తాముదినుఅన్నములోనే కొంచెమొక్కొక్కడాతని భుజింపఁబెట్టుచుండిరఁట. ఆతఁడు కొంతకాలము బ్రతుకగలఁడు మరణ మాసన్నమైనది. పరిసరప్రజ లాతని విషయమయి యిట్లు చెప్పుకొనుచుండిరి. పూర్వ మాతఁ డాయూరిలో పెద్దకాపుఁట. దొడ్డినిండ యావులు ఇంటి నిండ బిడ్డలు,

గలవాఁడఁట. కరవులవలనను బాహ్యములవలనను వాని నంపిన విధిప్రేరణమువలనను దుఃఖమనుభవించుటకుఁ గుద కీతఁడు మాత్రము మిగిలినాఁడు అహో! కాలవైపరీత్యము! రామ రామా! యనుచు, నాతఁడు దుఃస్థితిలో మరణించినాఁడు. సచ్చిదానంద మచట నుండఁజాలకపోయెను. కన్నులనుండి యశ్రుప్రవాహ మంతకంతకు హెచ్చుచుండె మార్గమును జూచుటకుసహితము వీలుగాక కన్నులు చీకటులు గ్రమ్మ దోవతడవుకొనుచు మార్గముఁబట్టి మఱియొకయూరి కేగెను. ఈ ప్రజల కేమని బోధింపవలయును. వారన్నమో రామ చంద్రా యని యల్లాడుచుండ మనమన్నముతినుట చాలక ఫలహారములకై పలుకూరకలు వెచ్చించినాము. వస్త్రవిరహితులై యుండ మనమంగీలపై జోడంగీలు ధరించుచున్నాము. వారికిఁ ద్రాగుట కొంటిపూట గంజయైనను లేకుండ మనము సోడా, కాఫీలనేగాక బ్రాంది విస్కీలను సహితము సేవించుచున్నాము. వారు తమదుఃస్థితిని జూచికొని గుండెలు తఱిగి కొనిపోవునట్లు దుఃఖించుచుండ మన మూళ్లవెంబడి మనసౌఖ్యమును దలంచి సంతసముతో గంతులిడుచున్నాము.

ప్రపంచమందలి ధర్మము నశించినకొలఁది వర్షములు తగ్గిపోయి పంటలుపండక కొంతవర కీదారిద్ర్య మేర్పడుచున్నది. పండినకొలఁది పంట లెగుమతులతో మననోటికడనుండి మఱియొకరినోటి కేగుచున్నవి. మనసొమ్మంతయు నయోమార్గ

ములు మొదలగుయానసౌకర్యములకు వెచ్చించుచున్నారు. వర్షములేనియికాలమున చెఱువులకుఁగాని కాలువలకుఁగాని జలాధారముల నేర్పరుచుటకుఁ వలఁపమైతిమి. దేశీయవస్తువులు నశించుట యీదారిద్ర్యమునకు రెండవకారణము. దేశీయ వస్తుజాలము నుపయోగించినగాని యావృత్తులు పునరుద్ధరింపఁబడి వారలకు వృత్తులేర్పడవు. ఈదుఃస్థితి జూచి గాంధి సచ్చిదానంద మింకనంగీలను తొడుగనని శపథముచేసెను. విదేశీయ వస్తుసామాగ్రి నుపయోగింపనని మొక్కుకొనియెను. ఇట్లాలోచించుచు నీతఁ డేగుచున్నప్పు డాతనికి మార్గాయాసము గాని భయముగాని లేదయ్యెను. ఆకలి యాతనిని వెనుకంజ వేయింపఁ జాలదాయెను. ఒక్కొక్కయెడ నాతఁడు పాలు మాత్రము త్రాగి యుండవలసివచ్చెను. ఒక్కొక్కయూర సామాన్యముగ సజ్జయన్నమో జొన్నన్నమో భుజింపవలసి వచ్చెను. ఇదిగాక రాలు రప్పలు ముండ్లు గలమార్గములు దొంగలుతఱచుగ విహారణముగ కొట్టెద రను త్రోవలు, చెట్టుచేమలు లేక యెండలలో మలమలమాడవలసిన యెడారులు, దప్పికయైనచో నాలుకయెండవలసిన చోటులు, అచ్ఛాదనము లేకపోవుటచేఁ గ్రిందను పైననుగూడ మండిపోవు కొండప్రదేశములు, మొదలగునవి యాతఁ డాయాసమని తలంపక దాటిపోవుచుండెను. మానవ సేవయే భగవత్సేవయని యాతఁ డెంచి మార్గమునం దెల్లప్పుడును, సత్యమార్గపూర్గణ ధురీణుఁ డగుబుద్ధునివలె నాలోచించుచు నడచుచుండును.

మఱియొకయూరి విషయము కొంచెము చెప్పెదము. ఇది అంతబీదయూరు గాదు. మిద్దెలు విరివిగ నున్నవి. ప్రజలు కొంచము సుఖభాజనులే. ఆయూరిలో నొకముదుసలి యాపె యింటికి సచ్చిదానందము భోజనమునకై యేగవలసివచ్చెను. ఆయింటిలో నింకెవ్వరును లేరు. ఒకపెద్దమిద్దెయుఁ బంచయు వెనుకదొడ్డియు నున్నవి. ఆమిద్దెమధ్య నొకపీటపై సుమారరువదిడెబ్బదియేండ్ల ముదుసలియాపె కూర్చుండి యుండెను. చామనచాయ గలశరీరము. విధవరాలగుటచే కేశములు లేని శిరముపై ముసుగు, చేతులకు గోట్లుగలవు. ఆమెచర్మము ముడుతలు పడియున్నది. కన్నులు ప్రత్తికాయలంతంతలై భయముం గొల్పుచుండెను. అమ్మా! సామగ్రి తెచ్చుకొందును కొంచె మన్నము వండిపెట్టుదువా! యని సచ్చిదానందము శాంతముగ నడిగెను. ఆమె 'పో, పో, ఆవలికిపో,' యని విదలించుకొని నీకు దాసి నేమి? యని చీదరించుకొని దొడ్డిలోనికేగి దొడ్డిలోనున్న బఱ్ఱెగొడ్డును కఱ్ఱతో రెండు ప్రేటులు వేసి మరలవచ్చెను. మరల మరల నాతఁ డన్యమార్గము లేనందున వినయముతో నడుగుటచే సరే తెచ్చుకో పో' అని యీసడింపుతో ననియెను. బ్రతికితి నమ్మా! యని యతఁడు సంభారము లన్నియు తేగ మూఁడుజాములకు ముడి మిరపకాయల కారమును, ఉడికియుడుకని యన్నమును నాతని కిడెను. అమ్మా! నేయి యనిగాని మజ్జిగయనిగాని యడిగినపు డెల్ల గుడ్లు మిటకరించి, యీసడించి యావలకేగుటచే నాతఁ డెట్లో యాపూట నాయింటఁగడపి యావలకే

ెను. ఈ నాఁటి ప్రకృతి యాతనికిఁ బ్రోత్సహించెను. ఇట్టి విషయ
ములలో నీర్ష్యను క్రోధమును వహించుట యాతఁ డెఱుఁగఁడు.
ప్రబంధములలో వర్ణింపఁబడిన శోభావతారమో, జరావతా
రమో, యీముదుసలి యనుట నిర్ణయింప సాధ్యముకాదు.
ఈ ప్రయాణములయం దాతనికి భగవద్గీత హస్తాలంకారముగ
నుండెను. అందు శ్రీకృష్ణుఁ డర్జునున కుపదేశించినకర్మయోగ
మాతనికి మార్గదర్శకము, పరమాశయమును. అవకాశము
గలిగినపుడెల్ల దానిని పఠించుట యం దాతఁడు శ్రద్ధాళు
వయ్యెను. ప్రతిఫలాపేక్ష లేనికర్మయోగము దానాచరించుచు
నితరులకు బోధించును. ఆగ్రంథమహిమవలన నాతని నిరాక
రింపఁదలఁచినవారు సహితము పరమాప్తులై కార్యక్రమ
మునఁ దోడ్పడుదురు. కొన్నిచోట్లఁ బ్రజలకోరికపై నాతఁడు
పౌరాణికుఁడు నయ్యెను.

ఒకనాఁ డొకయూర నొకయింట నాతఁడు బసచేయ
వలసివచ్చెను. ఆయింటియాఁపె యనాథ్యురా లని కొందఱు
చెప్పిరి. సచ్చిదానందము జంకలేదు. అది సంపన్నగృహము.
ఇంటిముం దొకవిధవరాలు గూర్చుండియున్నది. లోపల బజా
రున కెదురుగ పట్టెమంచముపై తాంబూలముసేవించుచు
నొకయువతి కూర్చున్నది. ఈమె యాయింటికోడలు. విధ
వరా లత్తగారు. మఱియొకబాలుఁడు పండ్రెండేండ్లవాఁ డింట
నుండెను. ఆతఁడు గృహయజమానునిసోదరుఁడు. “అమ్మా!
మీయింట నేను బసచేయుట కవకాశముండునా” యని సచ్చి
దానంద మన, పెద్దయాఁపె పట్టెమంచమువైపు చూచినది.

పట్టెమంచమునుండి " ఎవరునీవు " అను ప్రశ్న వచ్చినది. " అమ్మా ! దేశసేవకుఁడను " అని జబాబు. " నీబోటివారిని లక్షమందిని చూచినాను. నడు నడు వెలుపలకు " అని పట్టె మంచము, గద్దింపఁగా నత్తగారు, " నడునడు ఇక్కడ తావు లేదు ". అని యందుకొనినది. భోరున వర్షము కురియు చుండుటవలన నింకొకచోటికిఁ బోవుట దుర్ఘట మనియెంచి యతఁ డాయువతికి మనసుకరగునట్లొక యుపన్యాసము గావించెను. ఆమె యుండుఁ డని శాసింప నత్తగారుగూడ నంతఁ బలికెను. అంతట వంటచేయుట కత్తగా రింటిలోనికేగ నాయువతి కొంచెముసేపు జావళీలుపాడి నిద్రించినది. మగఁ డెటనుండియో వచ్చి యెంతలేపినను లేవదు. తుద కెట్టులో విదలించుకొనుచు లేచి తనసబ్బులు, ముఖముమెఱుఁగులు, అద్దములు, చిత్రవిచిత్రవసనములు, పౌడరులు సవరించుకొని లేచునప్పటి కర్ధరాత్రి యయ్యెను. ఈపెది పట్టణనివాసమట. నగరమునుండి యీామెను దెచ్చుకొని యీామెకు దాసానుదాసులై యేమియుఁ జేయజాలక నింటిలో నందఱును గుందుచుందురు. బస్తీకోడలితోఁ గులుకుచున్నారా యని యిరుగుపొరుగువారు వారి నాక్షేపించు చుందురు.

ఇట్లాయాయూళ్లలోనాయాచిత్రవిచిత్రప్రకృతులను గాంచుచు వివిధపరిస్థితులయందు దచంచలుఁడై మనమిత్రుఁడు తనకార్యక్రమమును నిర్విఘ్నముగ సాగించెను. సత్యసంకల్పము దృఢనిశ్చయముగలవారి కేపరిస్థితులైనను సమానములే.

---

# పదునెనిమిదవ ప్రకరణము.

"కష్టసుఖములు కావడికుండలు"

ఈ సమయమునఁ గొందఱు దేశసేవకుల మని పేరుఁ బెట్టుకొని నైచ్యమునకు వెనుదీయక ఆత్మస్తుతి గావించుకొనుచు పేరునుసంపాదింప సమకట్టిరి. ఇట్టివారికిఁ బరోపకారము ప్రధానముగాదు గావున నాత్మలాభమునకు వలయుపాట్లన్నియుఁ బడిరి. వీరిలోఁ గూటికిని గుడ్డకును లేక యేదియో యుపాయముచే ధనమార్జింపఁదలఁచువారు కొందఱును, ధనవంతులయ్యు వట్టిప్రగల్భములాడి కార్యాచరణమున వెనుదీయువారు కొందఱును, ప్రభుత్వముతో సంఘర్షణము సంభవించినప్పుడు పిరికిపడువారు కొందఱును గలరు. వీరు ప్రజలకు లేనియాశలఁ గల్పింతురు. అసాధ్యవిషయముల బోధింతురు. ముందు వెనుక లాలోచింపక కార్యక్రమముల నాదేశింతురు. ఇట్టివారి ప్రచారముతో సచ్చిదానందమువంటి సత్యనిరతులకుఁ జిక్కులు సంభవించెను. పరస్పరవైరుధ్యములు శ్రేయోదాయకములు కావు. గ్రామప్రజ లమాయికులు. వారు దేనినైన విశ్వసింతురు. అట్టిది సంభవింపనిచో నిరుత్సాహముఁ జెందుదురు. దుష్టప్రచారమున కెదురీది సచ్చిదానం

వసమువంటి సత్ప్రచారకులు సత్యమును నిలువఁబెట్టిరి. అసత్య మున్నతముగఁ దోఁచినను నీటిబుడగవలె క్షణభంగురము.

ఈ ప్రయాణములలో నాతఁ డొకమారు పల్లెనాటి కేగినాఁడు. అచ్చట మనయువకుఁడు గుణగ్రహణపారీణుఁ డయ్యెను. ఆసమయమునందుఁ గలిగిన యనుభవములు నాప దయుఁ జెప్పవలసియున్నది. అచ్చటి యరణ్యములలో మార్గ ముఁదప్పి యతఁ డిక్కట్లపా లయ్యెను. ఒకనాఁ డొకచిన్న యడవియందు మార్గముతప్పి యెన్నికొండదారులు చూచినను మరల యథాస్థానమునకే వచ్చుచుండెను. అందుల కాతఁ డొకయుపాయము చేసెను. సూటిగ నడచినయెడల నీయరణ్య మెచ్చటనో ముగియగలదని భావించి సూటిగఁ బోవఁబోవ తుద కాయరణ్యము ముగిసి గ్రామమువచ్చినది. ఒకప్పుడు త్రోవతప్పి తోటలలోనికిఁ బ్రవేశింప నాకుఁదోట కాపరు లాతనిని సత్కరించి మార్గముచూపించిరి. వారిసాంసారికవిష యము లాతనికి నివేదించి యాతనిసానుభూతిని బొంది సల హాను కృతజ్ఞతతో నంగీకరించిరి.

ఒక్కమా రాతఁడు మహారణ్యమునఁ ద్రోవతప్పెను. మృదుపదములను ముండ్లును గండ్లును బాధించినవి. పాదములు గాయము లైనవి. ఎటు చూచినను దట్ట మగునడవి. కమల బాంధవుఁడు నిష్కారణముగ నెత్తిఁబొరి యాగ్రహము వహించిన ట్లుండెను. సాయంకాల మగుచుండినను అది గ్రీష్మ

కాలమగుటవలన వడగాడ్పు లపారముగ వీచుచుండెను. పక్షుల
కలకలము తగ్గుచుండినది. నక్కలయఱపులు మిక్కుటమైనవి.
మార్గాయాసముచే దప్పియగుచున్నను గ్రుక్కెడునీళ్లు లభింప
చుట కిరవులేదు. రాత్రి యేవృక్షముపై కెక్కియైనను నిద్ర
మింతమన్నను దాహముడిగు టెట్లు? అట్లుండ నాతనిమన సెట్లుండు
డును? మరణమున కాతఁడు వెరువఁడు. చిన్నవయసునచే
భగవద్గీతాపఠనమున నాతనికి వైరాగ్యబుద్ధి గలిగినది.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ"

* * * * *

యని చెప్పినట్లు ప్రాతవస్త్రములవలె విసర్జింపఁదగిన
యీశరీరము విషయమై యాతనికిఁ జింతలేదు. సత్కార్యాచర
ణమునందును, పరోపకారార్థమును, మృతినందుట కాతఁడు
సంతసించును. కాని చాలకాలము జీవించుటయే యున్నయెడల
దేశసేవయు మానవసేవయుఁ గావించి మోక్షార్థము ప్రయ
త్నింతును గదా యని యాతనిచింత. వృద్ధులగుపురుషోత్తము
లకుఁ దగుసేవ చేయనైతినని యాతఁడు వగచెను. మాతృసే
వకు నోచుకొనలేదు. పితృసేవకుఁగూడ నవకాశము లభింపక
పోవుటయా? బాల్యక్రీడల కాలపు బృగుశాంతిపుర మాతనికి
జ్ఞప్తికి వచ్చినది. విద్యాభ్యాసకాలమునందలి మిత్రులు గురు
వులు నాతనిమనోవీథి నలంకరించిరి. తనహృదయఫలకమునఁ
బ్రతిఫలించుచుఁ జంద్రరేఖ యాతనికిఁ బ్రత్యక్షమైనది.
ఆయరణ్యము పులులకునివాస మనుశంక యాతని నలాప

లేదు. అడవిపందులు చెలరేగుసమయమైన దనుభీతి యాతనికిఁ గలుగలేదు. కొండచిలువలు పారాడుచుండు ననుభయము తోఁపలేదు. అధికమగుచున్న పిపాసార్తి యన్నియూహలను ముంచివేసి మనస్సంతయు నిండిపోయినది. కాళ్లు తడబడుచున్నవి. నాలుక పిడుచగట్టినది. చెవులు గడియలుబడినవి. చీకటి పడినను వడగాడ్పు లాతని ప్రాణమును హరించుటయందు నిశ్చయముచేసికొన్నట్లు ద్విగుణితోత్సాహముతో వీఁచుచున్నవి. ఇఁక నడువ శక్యముగాలేదు. హా! యని చతికిలఁబడి యిట్లు భగవత్ప్రార్థనము గావించెను. "హా! లక్ష్మీనృసింహా! నే నిదే వచ్చుచున్నాను. నన్నలంపక నీలోఁ జేర్చికొనుము. నీవు కరుణామయుఁడవు. కృపాజలధివి. ఆనందదాయివి. మోక్షప్రదాతవు. అనంతుఁడవు. అవ్యయుఁడవు. అచింత్యుఁడవు. నిన్ను వర్ణింపనాకు శక్తి లేదు. ఇదే కడసారినమస్కారము. నీవే నాకు శరణ్యము. నన్నే కారణముచేనైన జీవింపఁజేయదలఁచినచో నీపదములయందు నిరంతరభక్తి నిచ్చి మఱియు జీవింపఁ జేయుము. నీకల్పితమైన యీప్రకృతిని యీప్రజలను సేవింప నవకాశమిమ్ము. మోక్షానుసంధానమునకు మార్గదర్శివి కమ్ము. నమస్తే నమస్తే నమః॥"

అహో! ఆతఁడు పడిపోయినాఁడు. ఇదియేనా యాతని సదాచరణమునకు ఫలితము. ఇవి మంచికి రోజులుకావుసుమా! ఇచ్చట న్యాయమునకుఁ చావులేదా? సత్యమునకు జయము శూన్యమా? ఈశ్వరుఁడు సర్వవ్యాపి యఁట. భక్తులఁగాపాడు

నఁట. ఏదీ! యాతనిశరణాగతరక్షణబిరుదము? ‘కలఁడు కలండనెడువాఁడు కలఁడో లేఁడో’ యనుసంశయమున కవ కాశము గల్గుచున్నది. ప్రభూ! నీవిట్లు మామిత్రుని హరించుట న్యాయమా? మంచివారి నందఱిని నీవరికేఁ ద్వరఁగఁ జేర్చికొందువని ప్రజలందురు. వారిని లోకమున కీయక యప హరించుటవలన నీ కేమిలాభము? కోటీశ్వరునకును పన ధన మును వృద్ధిచేసికొనవలెనని లోభమున్నట్లు నీకును మంచివారిని బ్రోవుచేయుటయందు లోభమా? అట్లయిన నీవు దుష్టశిక్ష ణము శిష్టరక్షణముఁ జేయుదువనుమాట కర్థమేమి? హితబోధకులను హరించినచో నీలోకరక్షణకార్యము దుష్టలము కాదా? ఆహా! దుర్భరము! ప్రాణమిత్రుఁడు పోవుచున్నాఁ డని వృక్షములు కుంజనిలీనపక్షిరవముల నేడ్చుచున్నవి. శృం గములను బాహువుల నెత్తికొని గుహాలనునోళ్లు తెఱచికొని పర్వతములు మృగారావముల నల్లాడుచున్నవి. ఇఁక నేదిమార్గము? ఇం కెక్కడదిక్కు? ఇం కేవిధమున దేశసేవ? ఇఁక నెక్కడి సచ్చిదానందము? పురుషోత్తములగతి యేమికావల యును? కన్నుల నశ్రులు గ్రమ్మినవి. కంఠము గాద్గద్యముఁ జెందినది. లేఖిని నడువకున్నది. గోడకుఁ జేరగిలఁ బడితిమి.

* * * * *

ఇంతపుణ్యమా! వేడిగాలి తగ్గినది. కొంచెము చల్లని గాలి వీచుచున్నది. ఈతెలివి ముందే మైనది. ఇప్పుడు ప్రయో

జనముండునా ? మేఘము లాకసమునిండఁ గ్రమ్మినవి. ఇంతలో నింతయద్భుత పరివర్తనమా ? ప్రకృతిచిత్రముల నెవ రెన్నఁగలరు ! అయినను మబ్బులోనీళ్లున్నఁ గడుపెట్లునిండును ? అచేతన మగునామేఘమునకు జాలియా ?. కరుణచే నచేతనములుమాత్రము కరుఁగవా ? మందమలయానిలము వీచుచున్నది. దిశలు ప్రసన్నములైనవి. సత్వరమే ఝుంఝూమారుతము విజృంభించినది. రంయిమని గాలి వీనఁ జెట్లు చిందరవందరలైనవి. అడవి యల్లకల్లోలమైనది. శుభసూచకముగ పుష్పవృష్టివలె జల్లు ప్రారంభము. ఆజల్లు ప్రబలవర్షముగ పరిణమించినది. సచ్చిదానందమువస్త్రములన్నియుఁ దడిసినవి. ఏమో ! ముందే ప్రాణముపోయినదేమో ! మించిపోయినతరువాత నెన్ని శీతలోపచారములఁ జేసిన నేమిప్రయోజనము ? ఇంతవఱు కాతఁడు కదలలేదు. కొంచె మోపికపట్టుఁడు. ఆశయో నిరాశయో తేలును. అదిగో సెలయేళ్లు ప్రవహించుచున్నవి. ఆజలప్రవాహమునఁ దడిసినమనమిత్రుఁ డిటునటు పొరలినాఁడు. అమ్మయ్య బ్రతికితిమి. అతఁడు నోరుదెఱచి యావర్షజలము నాస్వాదించెను. దానితో నాతనికిఁ దెలివివచ్చినది. గట్టెక్కినాము. ఈకథ ముగిసెననుకొంటిమి. ఇఁక నాభీతి యక్కరలేదు. మనమింకను గొంతకాల మాతనితో సహవాసము చేయుటకు నోచినాము. తన్మూలమునఁ గొంత కాలముకలసి ప్రయాణముచేయగలము. అదిగో ! లేచి కూర్చుండి తానెక్కడనున్నాననని విమర్శించుకొనుచున్నాఁడు.

మరణశయ్యనుండి యుత్సాహముతో లేచినవానిసంతసమే మేము
వర్ణింపఁగలము? ఇంతలో తొందరపడి యీశ్వరనింద గావించి
తిమి. కలఁడో లేఁడో యంటిమి. అతనికమాత్రము పరమే
శ్వరునిపై భక్తితాత్పర్యము లొకేరీతినున్నవి. ఇప్పటికిఁ జీఁకటి
పడినది. ప్రపంచ మంధకారబంధుర మైనది. మార్గ మిప్పుడు
కనుగొనుట దుస్తరము. గ్రామ మిప్పుడుచేరుట మహాయాసము.
రాళ్లలో నడచుట దుస్సహము. కావున మనమిత్రుండు ప్రక్క
నున్నవృక్షము నధిరోహించినాఁడు. ఆరాత్రియంతయు
నాతఁ డరణ్యమునందలి చిత్రవిచిత్రమృగగానముల వినుచుఁ
బ్రకృతివైచిత్ర్యమున కచ్చెరువందుచు భగవల్లీలలస్తుతిం
చుచుఁ గాలక్షేపముఁజేసి మరునాఁ డుదయము చెట్టుదిగి
మార్గమునుగనుగొని సమీపగ్రామమున కేగెను. అతనిసాహస
మున కాగ్రామవాసు లచ్చెరువంది మిక్కిలి స్తుతించిరి.

దీనితరువాత కొలఁదికాలమున కాతఁడు కార్యమ
పూఁడి దర్శించెను. శ్రీనాథునివీరచరిత్ర మాతని స్మృతిపథ
మున కప్పుడు వచ్చినది. అందు నాయకురాలి ప్రజ్ఞావిశేష
మును, బ్రహ్మనాయని యుత్తమశీలమును, బాలచంద్రుని
ప్రతాపమును, వీరులయావేశమును, వారి భయంకరయుద్ధ
ములను దలఁచి తలఁచి ప్రస్తుతకాలపు నిర్వీర్యత్వముతోఁ
బోల్చిచూచి పలవించెను. ఒకస్నేహితునిసాయమున నచ్చట
నిప్పటికిని బవిత్రములనఁబడెడు క్షేత్రముల దర్శించి పూజ్య

భావముతో వానికి నమస్కరించెను. అట్లే మాచర్లనుజూచి యచ్చటి చెన్నకేశవస్వామిని దర్శించి చంద్రవంకజలపాతమును సేవించెను. ఆచంద్రవంకజలపాతసమీపమున బౌద్ధయుగమునాటి గుహాలు గలవు. అచ్చటి యపూర్వశిల్పమును జూచి యానందించి యాజలపాత సమీపమునఁ గూర్చుండి యచటి మందమలయానిలము ననుభవించి యాతఁడు ధన్యుఁడయ్యెను.

ఇట్లు గ్రామములదర్శించి యుపన్యసించుచు నాతఁడు రెండుమూడు సంవత్సరములు గడపెను. ఈలోపల నాతఁడు పురుషోత్తముల దర్శించుటగాని వీరభద్రశాస్త్రిని జూచుటగాని తటస్థింపలేదు. కొంతకాల మగునప్పటికి దేశమునం దనుకూలపరిస్థితు లేర్పడెను. మనమిత్రునిసేవను బ్రశంసించుచు నాతఁ డిక స్వీయవ్యాపారములలోని కేగవచ్చునని నాయకులనుమతించిరి. మొట్టమొదట నాతఁడు తనకార్యరంగమును స్వగృహసమీపమునకు మార్చికొని క్రమక్రమముగా దాని వదిని మానివైచెను. పురుషోత్తములు తమకుమారుని సాహసమును క్షమించి సుహృద్భావముతో మెలంగిరి.

అప్పు డాతని వివాహమునకై బంధువులంద ఱెదురు చూచుచుండిరి. బంధువులలోఁ బెక్కుమంది పురుషోత్తములను సమీపించి వీరభద్రశాస్త్రితో వియ్యమందుటకు నాతనిఁ

ప్రోత్సహించిరి. అతఁడు తనకుమారున కావిషయమును వదలి
వైచెను. సచ్చిదానందమునకును చంద్రరేఖకును పరస్పరగాఢా
నురాగ మిదివఱకే వృద్ధిఁబొందుచుండినందున నిష్కంటకవివా
హము నేర్పాటుగావించుట సులభమయ్యెను. చంద్రరేఖ
సంగీతసాహిత్యములయం దసమానపాండిత్యము సంపాదించెను.
వీరభద్రశాస్త్రిగారు తమకత్యంతప్రియ మగువివాహ ప్రయ
త్నములను బ్రారంభించిరి. చంద్రరేఖకు నూత్నాలంకరణ
ముల నేర్పరచిరి. భూమియంతయరుగులు, ఆకాశమంతపందిళ్లు
నిర్మింపఁబడినవి. అలుకులు ముగ్గులు పసపులు కుంకుమలు
తోరణములు శుభప్రదముగాఁ బ్రత్యక్షమైనవి. వీరభద్ర
శాస్త్రిగారి సతీమణి అప్పడములు, వడియములు, అటుకులు
మొదలగునావశ్యకపదార్థములను సిద్ధముచేయుటయం దాసక్తు
రాలైనది. పురుషోత్తముల యింటఁ దగినయేర్పాటులు గావిం
చుటకు బంధువర్గము రావింపఁబడిరి. చంద్రరేఖ కమూల్యా
భరణములను బురుషోత్తములు తయారుచేయించిరి.

వివాహలగ్నము సమీపించెను. మహావైభవముతోఁ
బురుషోత్తములు తరలి వీరభద్రశాస్త్రిగారి యింటికి వెళ్లిరి.
వారు పెండ్లివారిని దగురీతిని సత్కరించి విడిదియింటఁ బ్రవేశ
పెట్టిరి. లగ్నసమయమునఁ దెరనుంచి నప్పుడా తెర నెప్పుడు
దీయుదురా యని వధూవరు లెదురుచూచిరి. సక్రమముగ
మంగళవాద్యములు భోరుకలఁగ విప్రుల యాశీర్వాదములు

మిన్నుముట్ట బంధువుల జయజయనాదము లాకసమునంట, ముత్తైదువుల మంగళాశీర్వాదము లతిశయింప మంగళసూత్ర ధారణాదు లగులగ్నమునాఁటి కార్యములు ముగిసినవి. మూఁడవరోజున సదస్యము మహావైభవముతో జరిగినది. దేశదేశములనుండి వచ్చినపండితులను బంగారునాణెములతోడను, సాలువులతోడను బురుషోత్తములు సత్కరించిరి. చతుర్వేదపారగులగు బ్రాహ్మణోత్తము లాశీర్వాదములఁ గావించిరి. వధూవరు లగ్నిహోత్ర సతిభక్తి సేవించి యగ్నివేదికాసమీపమున శయనించి ధన్యులైరి. నాకబలి నెరవేరినది. మామగా రల్లునకు స్వర్ణరజతపాత్రములను చీనిచీనాంబరముల నొసంగి లాంఛనముల నన్నిటిని నడపి యప్పగింతలతో సాగనంపిరి. వధూవరులు తిరిగివచ్చుటయుఁ బదునారురోజులపండుగ మొదలగుసమస్త విభవములు నెరవేరినవి. దీర్ఘకాలమునుండి కోరిన కోరికలు ఫలించినందులకు బంధులోకమును బరిచితలోకమును మిక్కిలి సంతసించెను.



# పందొమ్మిదవప్రకరణము.



## యాత్రలు.

సచ్చిదానందము సాంసారికజీవనమున కవిశ్లాఘారుచుం డైను. కాని దాని కింకను కొంచెముగ ముప్పు కలదు. ఇక్కాలమున నాతనినివాసము శాంతిపురము. పురుషోత్తములసేవ యాతనికృత్యము. ధనవ్యయము గావించి తెప్పించిన యుత్తమ గ్రంథములు పఠనీయములు. ఇంగ్లీషువాఙ్మయమున నాతని కభిరుచి మెండు. షేక్స్పియర్ మహాకవిరచించిననాటకములఁ జదివి యందలిభావములయం దాతఁడు నిమగ్నుఁడగును. పాశ్చాత్యులలోఁ గష్టాంతనాటకము లుండుటకును మనలో సుఖాంతనాటకములు విస్తారముగ నుండుటకుఁ గారణమాతఁడు విమర్శించును. భారతీయులు తమజీవితములు మంగళాంతముగ నుండవలయుననియు, మోక్షమంగళమును బ్రతిమానవుఁ డాశింపవలయుననియు నట్టియితివృత్తములను కావ్యములందుఁ బ్రతిపాదించి యట్టిభావములను బ్రజలయందు గలిగింపవలయుననియు నభిప్రాయము గలవారు. అందుకొఱకు "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే" అని పెద్దలు చెప్పుచుందురు. పాశ్చాత్యులు లౌకికబుద్ధి, విస్తార

ము:గ: గలవారు. లౌకికకార్యముల నున్నవి యున్నట్లుగ: ప్రకటించుటయందు వారిలో: గొందఱికిఁ బ్రీతిమెండు. కథా సంవిధానములమార్చి మహాశయనిర్వాహణమున కనువుగ వ్రాయువారు పెక్కురు లేకపోలేదు. ప్రపంచముననున్న యన్నివిధములమానవప్రకృతులను షేక్సుపియరు చిత్రించినాఁడు. ఆతనిప్రతిభ యిట్టిదనివర్ణించుట భగవంతునినిరూపింపఁదలఁచుటవంటిది. మానవులశీలములు, నరులయందుసంభవించుపరస్పరసంఘర్షణములు, పరిస్థితులననుసరించి యొక్కని యందే సంభవించుమానసికసంఘర్షణములు, నాతనితోసమానముగ మఱియొకరు చిత్రింపఁజాలరు. షేక్సుపియరువ్రాసినవి లౌకికసత్యములఁ బ్రకటించునాటకము లెన్నియున్నను నచ్చటచ్చట జీవితపరమావధి యగుతత్వమును వెల్లడించుచుఁ దుదకు టెంపెస్టనునాటకమునఁ దనపూర్ణతత్వమును వెల్లడించియున్నాఁడు. ఆషేక్సుపియరునకు సమాకాలికులు నాటకకర్తలుపెక్కురు గలరు. వారిలో 'మార్లో' గట్టివాఁడు. ఆతని నాటకములం దొక్కఁడే నాటకమునంతటి నాక్రమించియుండును. ఆతని విషాదాంత నాటకములనుండియు శోకకథలనుండియుఁ బెక్కువిషయములను షేక్సుపియరు గ్రహించియున్నాఁడు. మఱియొక కవి బెన్ జాన్ సన్. ఇతనినాటకములప్పటి యాచారములను నప్పటిప్రేమలను వెల్లడించును. ఈకవి రచించిన చిన్నపద్యములలో నొకదాని నుబుసుపోకకై మన

మిత్రుఁ డాంధ్రీకరించెను. దాని నీక్రింద నుదాహరించు చున్నాము.

> " ముద్దిడుము ప్రేయసీ! నీదుముద్దు లిడుము;
> ఎవఁడో యజ్ఞుఁడు నీముద్దు నెంచు వెలిగ,
> ప్రేమపూరితము లం డ్రది పిన్నదియని.
> లేరు లేరిచ్చు టెవ్వరు లేరు వినుము,
> సురుచిరానంద నిర్భర స్రోతమందు
> తొప్పఁదోఁగఁగ ముద్దిమ్ము పూర్ణముగను;
> ఏవివందలు వేల్మఱ యేవి లక్ష
> యేవి ముద్దు లసంఖ్యమ్ము లేవి యెంచ
> జలనిధుల నుండుసంపూర్ణ జలముతోడ
> జలధివేష్టితమైన యీజగముతోడ
> నుడుగణంబుల నిసుకల నోటువరచి
> సత్కవీశుల కందనిచాయ మించి
> కావు వర్ణింప శక్యంబు గావు సుమ్ము!
> ప్రేయసీ! నీదుముద్దును బ్రేమనిడుము ".

షేక్సుపియ రిట్టికవులనుమించి, భారతీయపతివ్రతలతో సమానముగఁ జెప్పఁదగిన కొందఱుస్త్రీలను సృష్టించినాఁడు. అందు 'డెస్డిమోనా' ప్రధానస్థానము నాక్రమించుచున్నది. తన్నక్రమముగ భర్త చంపివేయుచున్నను, అతనియం దేమియు

నేరములేదనియు నతఁడే యెన్నిజన్మములకైన తనభర్తకా వలయుననియుఁ బ్రార్థించినది యాసాధ్వీలలామ.

అటుతరువాత మిల్టన్, డ్రైడెన్, పోప్ మొదలగు కవుల గ్రంధములను బెక్కింటిని మనయువకుఁడు పఠించినను గోల్డుస్మిత్ కవియాతనినాకర్షించినట్లు మఱియొక కవి యెవ్వరు నాకర్షింపలేదు. గోల్డుస్మిత్ స్వభావము, భూతదయయు నౌదార్యముగల హైందవస్వభావమువంటిది. తిన కున్నది యితరుల కిచ్చి బాధఁజెందు భారతీయునివలె నాతఁడు జీవనమును గడపి మరణించినాఁడు. యంత్రనిర్మితమై యర్థకామములు ప్రధానముగ గలయీనాగరికత నాతఁడు గర్హించినాఁడు.

ఇది యతని వాక్యము :—

"ఎచ్చో ధనికులు, మత్తులో
యెచ్చోఁ బ్రజ దుఃఖమంది హీనులగుదురో
యచ్చో సంకటము ల్వడి
హెచ్చి వినాశంబు చేరువేయగు సుమ్మా."

యంత్రాగారములవలన నేకొద్దిమందియో కోటీశ్వరులగుటయు, ఆయంత్రముల సేవించుటకుఁ బ్రజ లుగ్రామములవీడి వచ్చి, దరిద్రులై విపన్నులై దుర్భరస్థితియం దుండుటయు నాతఁడు సహింపలేఁ డయ్యెను. గోల్డుస్మిత్తు తరువాత మనమిత్రుని మిక్కిలి యాకర్షించినకవి వర్డ్సువర్తు. షెల్లీ, కీట్సు, టెన్నిసన్

కవులగ్రంథము లాకర్షకము లయ్యు వర్ణ్యవస్తుకథ ప్రకృత్యారాధనము సామాన్యవస్తుసంభావనము ననుగుణము లెక్కువఁగఁ గలవు. ఇఁక నవలలవాఙ్మయమున ముఖ్యులు మువ్వురు. స్కాట్, తేకరీ, డికెన్సు. వాఙ్మయోపవనమును బూసగ్రుచ్చిన ట్లెఱుంగఁదలఁచినవారికి వీరి నవలలు ముఖ్యాధారములు. కాని యాంగ్లవాఙ్మయము నెంతగాలించినను తత్త్వగ్రంథము లెక్కువగ లేవు. లాక్, హ్యూమ్, మిల్, బ్రాడ్లీ కార్లైల్ వంటివారు చెప్పినతత్త్వ మతిస్వల్పము. ఫ్రెంచివాఙ్మయమునందలి 'డేకార్టే' తో, జర్మన్ తత్త్వజ్ఞుఁడు 'కాంట్' తో, సమానులెవ్వరునులేరు. ఇందుఁగలసి హైందవతత్త్వములలో నేమూల నున్న సత్యములనో కొన్నింటిని మాత్రమే యసమగ్రముగ వెల్లడింపఁగలిగిరి.

సచ్చిదానందమున కాంధ్రవాఙ్మయమునం దభిమానము మెండు. కవిత్రయమువారు రచించిన మహాభారతము విలక్షణమై యనన్యభాషాసామాన్యమై, యపూర్వమై వాచకుల కుత్సాహజనకమై, గుణఘనమై విరాజిల్లుచున్నది. పాల్కురికి సోమన వ్రాసిన బసవపురాణము తేటతెనుఁగులకు నిధి. పోతనభక్త్యావేశము వర్షకాలమహానదీప్రవాహమువలె నగణ్యశక్తిగలది. శ్రీనాథునిశృంగారవిలాస మాశ్రీనాథుని శృంగారవిలాసమును దలఁపించును. పింగళిసూరన కల్పనాశక్తి యప్రతిమానమైనది. జగ్గకవిహాస్యరస మనితరసాధారణము. మనునను

చరిత్రకారుల ప్రతిభయు నాముక్తమాల్యదాకారుని యసా
మాన్యలోకజ్ఞానమును మఱియొకవాఙ్మయమునఁ గానము. ఇట్టి
యాంధ్రవాఙ్మయ మహాసముద్రము నతఁడు పునఃపునర్మథ
నము గావించుటవలన నాతనియందుఁ గవితాస్రవంతి యావి
ర్భవించెను. మననాయకుని బాల్యకవిత్వమునకుఁ బ్రధానకా
రణ మాతనిమిత్రునిమరణము. ఏమిత్రుని సహవాసమువలన
నతనికార్షధర్మాసక్తి గలిగినదో, ఏమిత్రునిబోధయను సంజీవి
వలన స్వమతద్వేషవిష ముపశమించినదో, ఏమిత్రుని వాక్సుధా
ధారలచే నాతనిపరధర్మావలంబనార్చు లడఁగినవో, ఏపవిత్రుని
దివ్యసందేశమున నాతనికాంధ్రసంస్కృతభాషలయం దభిమాన
మధికమైనదో యట్టిమిత్రుఁడు సుధీరుఁడు మరణించుట యా
తని కింతయనరానిదుఃఖమునకు హేతువయ్యెను. అప్పటివిషా
దమువలన నాతనిభావములు పద్యరూపమును దాల్చినవి. అవి
ప్రౌఢములు గాకపోయినను సచ్చిదానందమునకుఁ బ్రథమసం
తానమగుటవలనఁ బ్రియతమములు. వాఙ్మయప్రశంసయం
దాపద్యముల నుదాహరించుట యప్రస్తుతము కాదు.

క. సనకసనందనవినుతా !
వినతాసుతవిమలవాహా ! విశ్రుతభావా !
ఘనవైకుంఠనివాసా !
మనవిని విని కావు నన్ను మాధవ కృష్ణా ॥

సీ. పుట్టినప్పటినుండి పుణ్యమార్గమె గాని
పాపపుఁద్రోవలఁ బడియెఱుఁగ
వాజన్మమును వినయంబె చూపుదు గాని
పెద్దలయెడ గర్వ మెద్ది లేదు
సత్యవాక్యంబు నాసక్తి యాడుదు గాని
యనృతంబు నెన్నఁడు నాడియెఱుఁగ
పతులితం బగుధర్మ మందలిరుచి గాని
యవినీతియనుట నీయందు సున్న
యయ్యొ వీరుఁడ వినుఁబోలి యాత్మసుతులు
పొఱుపు త్రిలోకమందున దుర్లభంబు
సుమ్ము దుఃఖాంబురాశిలో మమ్ము ముంచి
పోవన్యాయంబె సుందరాద్భుతచరిత్ర !

సీ. ఆఠవమాసంబు నైనదాటకమున్నె
ముద్దుమాటలతోడ మొనసినావు
మూడవ వత్సరం బున్ బ్రవేశించియె
యాటపాటలమించి యలరినావు
పంచవర్షప్రాయ మంచితస్థితినుండ
విద్యాలయమునకు వెడలినావు
ద్వాదశాబ్దంబులు దాటిపోవకమున్నె
సామాన్యవిద్యలఁ జాలినావు

షోడశాబ్దంబులకుమున్నె సురుచిరాద్భు
తంపుపాండిత్యమున్ జెంది ధైర్య మంది
దుష్టమతసంకటంబులన్ ద్రోలినావు
మిత్ర నిన్ బోలుధన్యచరిత్రు నెఱుఁగ॥

సీ. తరుణిమీాదను నీదుతనయునిమీఁద ప్రేమ
విడనాడి యెట్టుల వెడలితయ్య
ఈడుపారల నీదుతోడికవీంద్రుల
విడనాడి యెట్టులు వెడలితయ్య
ఊరిపెద్దల పొరుగూరిపెద్దల నెల్ల
విడనాడి యెట్టులు వెడలితయ్య
మిత్రుని నను స్నేహపాత్రుని నిర్దయన్
విడనాడి యెట్టులు వెడలితయ్య
సూర్యసమతేజ ! పండిత ! శూరవర్య !
నీదుమరణంపువార్తతో నిండి నాదు
హృదయసీమంబు భగ్నమై యుదిలఁగొనుచు
పగిలి బ్రద్దలునై నీరు పారుటాయె॥

సీ. సన్మిత్రునకు రుజాసంకట మనుచును
తెలిసినంతనె చాల దిగులుబుట్టె
విశ్రుతనామునికిన్ శ్రమంబాదవెనం
చనుటనె గుండియ లదలిపోయె

సన్మాన్యుననఁ గల్గె సంధి యంచనిపిన
గల్గినంతనె చెప్పఁ గ్గడియలుబడె
మహితునిజీవిత మాహాఢడోలిక
మన్నమాత్రనె ప్రాణ మవిసిపోయె
నాహా ! పోయితి వనివిన్న యంతమాత్ర
మెంతఘోషించియుంటినో యెవఁ డెఱుఁగుఁ
నన్ను బాయుట కీవెంత ఖిన్నుఁడయితొ
యేరికైనను వర్ణింప నింతయంతె॥

మిత్రం సాత్త్విక మార్యపూజితగుణం సత్స్నేహసంభావితం
ధీరం శస్త్రమఖండపండితకవిం షట్శాస్త్రవిద్యాన్వితం
సత్యాసత్యవివేకశీల మమలం దూషప్రభావోన్నతం
త్యక్త్వా కాలవశా ద్విషాదజలధౌ మగ్నోస్మి సంప్రత్యహ
[యహమ్॥

మనమిత్రుని కవితాకన్య వరించినను నయ్యాది యాతని
స్వాధీనమునం దుండునదికాదు. ఆమె యిచ్చవచ్చినప్పుడు తానె
ననుగ్రహించునేగాని యాతనికిఁ గోరికగలిగినప్పుడెల్ల స్వాధీను
రాలు కాదయ్యెను. అందుల కనుగుణముగ నావేశమువచ్చి
నప్పుడుమాత్రమే యాతఁడు కవిత్వమును వ్రాయుచుండెను.

ఈసమయమునఁ జేర్కొనదగినవిషయము శ్రీశైల
ప్రయాణము. దుర్గమము లగునరణ్యములను బర్వతములను
దాటిననేగాని శ్రీశైలమును జేరుటకు వీలులేదు. కొంత

మారము బండ్లమీద ప్రయాణము. మిట్టపల్లములలో నాబం
డ్లలో నడుములు చదరమగును. కొన్ని బండ్లు బోల్తాపడినవి.
కాని ప్రయాణికులకు దెబ్బలు తగులలేదు. ఇఁక నిచ్చటినుండి
లక్షాధికారియు భిక్షాధికారియు సమానులు. అనగా బండ్లు
వెళ్లని-చోట నడిచితీరవలయును. ఏమునలమ్మయో డోలీచేసి
కొన్నను నది సుఖమునకుగాదు. విధిలేకనే. మోయువారికిని
మోయించికొనువారికిని నరకమనుటకు సందేహములేదు.
మార్గమున త్రిపురాంతకమునందు శాసనాదికముల నాతఁడు
పఠించి ప్రాచీనస్థలములను శ్రద్ధతో దర్శించెను. ఈప్రాంత
ములు నరణ్యములు పిట్టములయి సెలయేళ్లతోనిండి దర్శ
నీయముగ నుండును. తెలుఁగురాయని చెఱువుకడ కోయవాం
డ్రనుజూచి యాతఁడు వారిస్వభావమును గ్రహించెను.
శ్రీశైలశిఖరమును జూచి, ' శ్రీశైలేశశిఖరం దృష్ట్వా పునర్జన్మ
న విద్యతే ' యనియు ' కాశి కరుగంగ నేటికి కాళ్ల జాలి '
యనియు స్మరించెను. తదుపరి పంచదార పాలధార యను
ప్రదేశములఁ గాంచి శ్రీశైలమల్లికార్జునుని దర్శనముగావిం
చెను. అచ్చట పాతాళగంగలో స్నానము, ఋషిగుహలసంద
ర్శనము, శ్రీశైలప్రాచీనచరిత్రస్మరణము ననువిశేషముల
ననుభవించెను. ఇచ్చటికి సామానులఁ దెచ్చునవి గార్దభ
ములు. వానియోర్పు మఱియొకజంతువునకు లేదు. గుణ్ణము
లొక్కక్షణములో నలసిపోవును. ఇం దయ్యవార్లం గారి దేవ
తార్చనలును ఈశంఖుమూతిగుణ్ణములు తీసికొనిరావలసినదే.

తెరుగుమార్గము మహానందిమీదుగఁ గలదు. ఏమునికొత్తోలను నాగలూటు మొదలగు ప్రదేశముల నతిక్రమించినతరువాత మహానంది వచ్చును. ఈ ప్రదేశములలో మోటబావులను జూచి గోదావరీతీరవాసులు “ఇదేమి యిచింతరం అమ్మా—యీగిత్తలు రామలచ్చుల్లాగ యిలా వస్తున్నాయి. ఆగిత్తలు రామలచ్చుల్లాగ అలాయెత్తున్నాయి. ఆలబ్బురుచి త్రెవ్వోంచి కీళ్లలా వస్తున్నాయి” అనిరి. మఱియు మార్గములలో మురికినీరు త్రాగినవారి కనేకులకు జబ్బులుచేసినవి. పుణ్యము కోసము పోవ పాపము వెంబడించినట్లు బంధువులనిపోవ దయ్యములై పట్టినట్లు తీర్థయాత్రకుఁబోవ రోగములతోఁ బెక్కురు మరణించిరి. సచ్చిదానందము సుఖముగ నిల్లుచేరెను.



# ఇరువదవప్రకరణము.

—————:0:—————

## ఆంధ్రదేశపర్యటనము.

చంద్రరేఖవలపు చదిగొన నొక్కమారు వీరభద్ర శాస్త్రిగారియింటి కేగివచ్చి పురుషోత్తములయనుజ్ఞఁ బొంది సచ్చిదానందము తెనుఁగుదేశమునంతను గాంచదలఁచెను.

"యశ్చ పర్యటతే దేశాన్
యశ్చ సేవేత పండితాన్
తస్య విస్తారితా బుద్ధిః
తైలబిందు రివాంభసి"

అనునార్యోక్తి ననుసరించి పురుషోత్తములు తమకుమారుని పర్యటనముల కామోదము చూపిరి. మరియుఁ దమ కుమారునివిజ్ఞానము సర్వవిధములఁ బెంపొందవలెనని వారి యుద్దేశము. మనమిత్రుఁడు తనసందేశమును వీలైనచోటుల వినిపించుటయును దానాయాస్థలముల దర్శించుటయును గలసి వచ్చునుగదా యని విపుల మగుపర్యటనాభిలాషచే బయలు దేరెను. ఇంతకుమున్నె యాంధ్రసాహిత్యమునందును నాంధ్రుల చరిత్రమునందును శ్రద్ధవహించియుండుటచే శాసనపరిశోధ

నమునను బురాతనతామ్రపత్రగ్రంథవీక్షణమునందును నాసక్తి శ్రద్ధగలిగెను. ఒకానొకపట్టణము ప్రధానముగఁ జేసికొని చుట్టుపట్టులనున్నయూళ్ళ నాతఁడు సంచరించును. విహారలక్ష్యవస్తువీక్షణముగాని విద్యాధికారులయు ధనాధికారులయు పరిచయము గాని యాతనికార్యక్రమమున ముఖ్యవిషయములు కావు. ప్రాతకట్టడములు, ప్రాచీనదేవాలయములు, కోటలు, ప్రాచీన శాసనములు, నవీనాచారములు, వేషభాషలు, సంప్రదాయములు, విచిత్ర ప్రకృతులు, [illegible] [illegible]. ఆకర్షి నచ్చినవిశేషముల నెఱుఁగుటయందుమాత్రము మన కాసక్తి. ఇతరవిషయములు చరిత్రలయందును భూగోళశాస్త్రముల యందును గాంచనగును.

మొట్టమొదట నాతఁడు దర్శించినది యుత్తరాంధ్రము. రాజమహేంద్రనగరము ముఖ్యస్థానముగఁ జేసికొని యాతఁ డుత్తరాంధ్రమునెల్ల దర్శించెను. రాజరాజుచే నిర్మింపఁబడి వేమవీరభద్రారెడ్లచేఁ బెంపుఁజెందినయీపట్టణము పరమపావని యగుగోదావరీతీరమున నున్నది. శ్రీనాథుఁడు వర్ణించినవైభవ మెల్లఁ బోల్పోయి యిప్పుడది మురుగుకాల్వలకంపును, మూఁగు దోమలగుంపును, రేగుదుమ్ములయింపును, చెలరేఁగునాగరి కంపుపోకడలును గలిగి మిగుల కళంకితమై యున్నది.

శ్రీనాథునికాలఁపునాగరికతకును నిప్పటిస్థితికిని గొండకును నావగింజకు నున్నంతయంతర మున్నది అప్పటివారు విశాల

నేత్రులు, విపులవక్షులు, ఆజానుబాహులు. పీవరశరీరులు, శౌర్యసాహసాదిసద్గుణోపేతులు. ఆవీరపురుషులసహాయమున నాంధ్రకీర్తి దిగంతవ్యాప్తమైనది. వారిరక్తధారలు గోదావరి వెల్లువలవలె శత్రుసంహారమునందుఁ బ్రవహించినవి. వారి శౌర్యకథ లిప్పటికిని బ్రసిద్ధములైనవి. వారిదానశాసనము లిప్పటికిని బ్రత్యక్షములైనవి. ఇప్పటియాంధ్రులవి కుబ్జస్వరూపములు, కుంచితవక్షములు, చికిలికన్నులు, చింతాకులితాననములు, రోగగ్రస్తశరీరములు, ఈర్ష్యాతప్తభావములు, భీరుత్వసహితమానసములు, నవనాగరికతాదగ్ధవివేకములు, పరధర్మావలంబనన్నష్టబుద్ధులు. ఇట్టిసంకుచితలక్షణముల కాంధ్రదేశమునం దీప్రాంత మగ్రస్థానమువహించుచున్నది. స్త్రీల యందుసహితము తేజోవిహీనత ప్రత్యక్షముగనున్నది. విరూపాననములు, శిశుపోషణానర్హశరీరములు, బహురోగార్తదేహములు, వారిని నడచుటకుగాని మఱేపనినైనను జేయుటకుగాని యనర్హలను జేయుచున్నవి. తదితరాంధ్రప్రాంతముల కైన యగుపల్లియలు కొన్ని యున్నను మొత్తముమీఁద నిచ్చట బలహీనులసంఖ్యయే యెక్కువ. ఇచ్చటివారు సుకుమారులఁట. ఈసౌకుమార్యమున కసమర్థత యని యర్థము. ఎంత కొద్దిప్రయాణమునందైనను వీరికి బడల్పుకావలయును. ఈసుకుమారతవలన వీరు కడుపునిండఁ దినజాలరు. చేతినిండ పని, కంటినిండనిద్ర, నోటినిండమాట, కాలికొద్దినడక, ఓపికకొలఁది సుఖము, వీరికి లేదు. కావున నిది దుఃఖాపాదకసౌకుమార్యము

గాని సుఖసంపాదకము గాదు. నవీననాగరికతాసూత్రముల ననుసరించి వైద్యాలయములయధికసంఖ్య యారోగ్యసూచక మనుచో నిచ్చటికన్న నెక్కుడువైద్యాలయములు గలభాగ మాంధ్రదేశమున నెచ్చటను లేదు. రోగులసంఖ్య మిక్కుట మగుటచే వైద్యాలయములు హెచ్చినవి గాని మఱియొక కారణ మూహించుట యసమంజసము. ఈరోగముల కవినీతి ముఖ్యకారణము. రోగులలో సుఖరోగులసంఖ్య విస్తారము. పల్లపుభూము లనారోగ్యమునకుఁ గట్టినయిండ్లు. పల్లముగాని నేల గోష్పాదమంతయైనను లేని ప్రాంతములును గొన్నియుంటఁ గలవు. పల్లపుభూముల ప్రజలబాధయు పశువులవ్యథయు నింతంత గాదు. ఇవి స్వేచ్ఛాసంచారమున కెడమీయనిమురికి కూపములు. ఇట బహిర్దేశములు శూన్యము. పాకిదొడ్లవాసన నాసికాపుటముల బ్రద్దలుకొట్టును. దోమలబాధ మిక్కు-టము. పశువుల కిది నరకకూపము. ప్రజలును బశువులు నింటికప్పుక్రిందఁ బెంచినమొక్కలవలె పాలిపోయి యుందురు. నవనాగరికతాప్రధానలక్షణ మగుస్త్రీస్వాతంత్ర్య మిచట మెండు. ఆస్వాతంత్ర్యము బాగుపడుటకుఁ గాదు. నీతికిని గాదు. ధర్మాచరణమునకుఁ గాదు. ప్రతిష్ఠకుఁ గాదు. ఆరో గ్యమునకుఁ గాదు. అది యవినీతికి, నధర్మమునకు, దురా చారనుష్ఠానమునకు, పురుషులుపాల్పడినవ్యసనములను, స్త్రీలు గూడనిర్భయముగ నవలంబించుటకు, హేతువు. ఈస్వాతంత్ర్య మువలన స్త్రీలార్జించిన విశేషములలోఁ బాశ్చాత్యవిద్యతో

కల్లి, చుట్ట, నస్యము, మద్యము, నల్లమందు, మొద లగునవి బహిరంగముగ సేవించుట. బహిరంగముగ జూదము లాడుట. బహిరంగముగ నవనీతి ప్రసంగములఁ జేయుటలో వెలువకుండుట, ముఖ్యమైనవి. సుప్రసిద్ధ గోదావరీతీరమున ననుష్ఠానము లడుగంటుచున్నవి. వర్ణాశ్రమధర్మములు నామ మాత్రావశిష్టము లైనవి. పూర్వాచారములు మంటఁగలసినవి. పానీయశాలలలో కాఫీలు త్రాగుట, పోకలు, సుగంధద్రవ్యసేవ, పాశ్చాత్యులనుండి బదులు తెచ్చికొనినవే. పురుషుల కేశఖండన పద్ధతి బంగాళమునుండి వచ్చినది. నుదుట బొట్టులేకుండుట పారశీకమునుండి సంపాదించినది. పురుషులకు దుష్ఫలముల నొసంగు నున్నతవిద్యను స్త్రీ లభ్యసించుట, యందువలనఁ జెడుటయు నిచ్చటఁ గననగును. విధవావివాహములకును, నామమాత్ర మతసంఘములకును నిది నిలయము. కలికాల మాంధ్రదేశమున నిచ్చటినుండియే విజృంభించును. భారత ధర్మనాశక మగువిషవృక్ష మిచ్చటనే పెరిగి పెంపొంది శాఖో పశాఖలై చిలువలుపలువలై దిగంతముల కెగ ప్రాకి పువ్వులు పూచి కాయలుగాచి పండులుపండి, "అప్రయోజన మభి వృద్ధి నతిశయిల్లు, అప్రయోజన మడఁగు కాలాంతరమున" ననువాక్యానుసారము నాశమున కుపక్రమించియు నింకను దిం పుడుకళ్లపాళతో మిడుకుచున్నది. ఇటసంఘసంస్కారణమను పేరుతో వర్తిల్లు నితరకార్యక్రమము లెట్లున్నను భోగస్త్రీలపై దండెత్తుట యనునది విచిత్రము. భోగస్త్రీలవృత్తినినశింపఁ

జేయుసంకల్పము మిగులదుష్టమై సంసారముల కష్టించుటకే ముప్పును దెచ్చుచున్నది. అవినీతి మిక్కుటముగనున్నకాలమున, మురుగుకాల్వలను వానిస్థానీయమార్గములఁ బోనీయక, వీరు వానిని గృహములపైకిఁ ద్రిప్పుచున్నారు.

స్త్రీస్వాతంత్ర్యమని ప్రపంచమున నేఁడనుకొనఁబడు నస్వాతంత్ర్యమును నిరసించినమాత్రమున సచ్చిదానందము స్వాతంత్ర్యవిరోధియని తలంచుట తప్పు. మానవజన్మమెత్తిన వారందఱును స్వాతంత్ర్యమున కర్హులని యాతఁ డంగీకరించును. శరీరముల బంధించినను వాక్స్వాతంత్ర్యము నరికట్టినను సర్వతంత్రస్వతంత్ర మగుమనస్సు నెవరును బంధింపఁజాలరు. జగద్వ్యాప్తమై యవినాశ్య మగునాత్మ నెవ్వరును నిరోధింపఁజాలరు. స్త్రీకి స్వాతంత్ర్య ముండవలయుననుటయు నాతఁడు కాదనఁడు. అయిన నీపరస్పరవైరుధ్యమును బాపుటెట్లు. వివేకులగువారి కందు పరస్పరవైరుధ్యము లేదు. దీనికి సమన్వయము కడుసులభము. స్వాతంత్ర్యము అనుపదమును నిర్వచించినచో నీచిక్కు లన్నియుఁ దీరును. మానవజాతికి ధర్మాచరణమునందు స్వాతంత్ర్యము గలదు గాని, అధర్మాచరణమునందుఁ గాదు. స్త్రీపురుషులకు వారివారి శారీరికమానసిక ప్రవృత్తులనుబట్టి వ్యాపారములు వేఱగును. పురుషుఁడు శిశువులఁ బెంచిన వారు పాడగుదురు. స్త్రీ పురుషునివలె శ్రమపడెడి బాహ్యవ్యాపారములయందు మగ్నయైన నామెకు సచ్ఛిశువులఁ గనుశక్తియుఁ

బోషించుశక్తియు నశించును. నియమరహితముగ విచ్చలవిడిగి సంచరించుట స్వాతంత్ర్యమని కొందఱభిమానము. ఇది యజ్ఞానము. ఇట్టిస్వేచ్ఛాచరణమున నుపయోగములేకపోగ ప్రాణాపాయములుకూడ తటస్థించును. మానవులకు వారిలో వారికి ప్రబలకలహము లవతరించును. స్వాతంత్ర్యమున్నదని మితము దప్పి భుజించిన వ్యాధివచ్చును. అసలే భుజింపకపోయినచో మరణము సంభవించును. నియమరహితముగ మాటలాడినచో లోకులకు మనపై నేవ జనించును. అడ్డులేక భోగములందు నిమగ్నుడైనచో మానవునకు ధర్మచ్యుతియేగాక దేహచ్యుతికూడ సంభవించును. స్వాతంత్ర్యమున్నదిగదా యని క్రిందపైనతెలియక నడచిన కాలువిఱుగును; తల బొప్పిగట్టును. ఇట్లెన్నియేని చెప్పవచ్చును. దీనివలనఁ దేలినదేమన, నియమమో, మితియో, పారమో, ముందువెనుకలో, బంధములో, శాసనములో, లేనిస్వాతంత్ర్యము నాశనమునకుఁ గారణ మగును. అందాయాప్రకృతులు దేశకాలములు విచారించి మితుల నేర్పఱచుకొనవలయును. పురుషు లుల్లంఘించిరిగదా యని స్త్రీలచేఁ గూడ నియమము లుల్లంఘింపఁజేయుటకంటె పురుషులనుసహితము నియమములందుంచుటకుఁ బ్రయత్నించుట శ్రేయస్కరము. పురుషుఁడు పలుసార్లు వివాహమాడుచున్నాఁడుగదా యని స్త్రీకిఁగూడ పెక్కువివాహములు గావించి లోకమును గామాగ్నిలోఁ ద్రోసి నాశముచేయుటకంటె స్త్రీపురుషుల కిరువురికుఁ బునర్వివాహ

ములు నిషేధించి మోక్షాసక్తి గల్గించుట ధర్మము. అట్టి మోక్షాసక్తిగలవారు లోకోపకారు లగుదురు. కామాసక్తులు స్వార్థాసక్తులు లోకాపకారులు నరకకారణులు నగుదురు. స్వాతంత్ర్యము ననుభవించు సర్వదేశములును రాజ్యశాసనములచే బద్ధములై యున్నవి. మనదేశము ధర్మబద్ధముగూడ గావించుట కవకాశమున్నది. ధర్మములును శాసనములును బంధించనిచో నరాజకమే ఫలితము. అంధకారమే గమ్యస్థానము. సర్వధ్వంసమే తుది. ఇట్టినియమబద్ధస్వాతంత్ర్యమే పురుషునకును, స్త్రీ నియమబద్ధస్వాతంత్ర్యమే స్త్రీకిని సౌభాగ్యములు. ఇప్పటి స్వాతంత్ర్యఘోష నియమోల్లంఘనమునందేగాని నియమపాలనమునందు ఫలించుట లేదు. ఇంద్రియచాంచల్యమునందేగాని ఇంద్రియజయమునందుఁ బరిణమించుట లేదు. అర్థకామములయందేగాని, మోక్షధర్మమునందుఁ బర్యవసించుటలేదు.

ఈ ప్రాంతముల మనమిత్రుఁడు గాంచిన యొకటి రెండు విశేషముల నుదాహరింతుము. మొదటివ్యక్తి యాతని కొక సత్రమునఁ గాన్పించెను. చామనచాయశరీరము. కొద్దిపాటి పొడవు. అందులకుఁదగినయవయవసౌష్ఠవము గలస్త్రీ యామె. వెనుక గిరజాలవలె వ్రేలుకేశములు. పాశ్చాత్యపద్ధతిగ గౌను. జేబులో గడియారము. చేతిలో బెత్తము. కాలికి బూడ్సులు. కన్నులకు సులోచనములు. చిరకొంగు చేతితోఁ బట్టుకొని తింగురంగా యని నడకలు. మ్లేచ్ఛాదిసర్వజనులతో

ముదుకసరసములు. మూతివిరుపులు. కంటిసైగలు. దుర్భర
ములు !

రెండవది యొకగృహిణి. ఆపెమగఁడు బలహీనుఁడు.
ఆపె కొంచె మించుమించుగ ముందుచెప్పిన వనితవంటిది. మో
ముపై స్ఫోటకపుమచ్చలును గలవు. ఆపెయిటుఁ డాయింటనే
కాపురము. మగని దండింపగలసమర్థత యాపెకుఁ గలదు.
అతనికి నులకమంచము. తనకుఁ బట్టెమంచము. అతనికిఁ గంచు
పళ్లెము. తనకు వెండిపళ్లెము. అతనికిఁ జినిగినగుడ్డలు తనకుఁ జీని
చీనాంబరములు. అతనికి గంజినీళ్లు. తనకును విటునికిని షడ్ర
సోపేతభోజనము. ఇట్లు సమస్తభోగములు మగనికన్నులయెదుట
నాపె యనుభవించును. తన విటునితో నొక్కకంచముననే
యుదయమున భుజించి యాపె పాఠశాల కేగును. మరలవచ్చి
వంటచేసికొనును. ఆమగఁడు తనస్థితిని దలంచి దుఃఖించి
యాపెను జూచి, "తల్లిదండ్రులు చెప్పినట్లు వినక, నింగ్లీషు
చదివినందుకు ఫలితముగ, విద్యావంతురాలవని నిన్ను వరించి
నందు కిదియా ఫలితము. విద్యావ్యాసంగమువలన నాశరీరము
రుజాక్రాంతమై లేవలేకున్నాను. లేవఁగలిగినచో ని న్నేమిచేసి
యుందునో. నాతలిదండ్రులుగూడ నన్ను విసర్జింప నాపాప
మును నేనే యనుభవించుచున్నాను." అనుచుండ నాపె చీపు
రుతో నాతనికి దేహశుద్ధి గావించి, చెప్పుతో రక్షబెట్టి, పేడ
కలాపితో స్నానముఁ జేయించి శాపనర్థములతో మంగళహారతు

లిచ్చెను. ఇంక నీవిషయములను విపులముగ విచారించుట హేయము. నాగరికతాలక్షణముగ నీకిందుదాహరింపఁబడినవి గాని పుణ్యమని పురుషార్థమనియుఁ గాదు.

ఈ ప్రాంతముల ద్రాక్షారామము, సింహాచలము, మొదలుగఁ బుణ్యక్షేత్రముల నతఁడు దర్శించెను. పల్లెలయందున్న వేదపారగులను సేవించి వారివలన పరమధర్మముల నెఱిఁగెను. పట్టణములకంపుగాని, ఇనుపముక్కుదోమల పీడగాని పల్లెటూ భూముల బురదగాని యాతనికంత సుఖప్రదములు కానయ్యెను. అందువలన నీ ప్రాంతములను శీఘ్రమే విడచి యాత్రఁ జేసినతదితర ప్రాంతములకు వెడలి యచ్చటివిశేషముల నవలోకింతము.



# ఇరువదియొకటవ ప్రకరణము.

## ఆంధ్రదేశపర్యటనము,—సశేషము.

తరువాత నాతఁడు దర్శించినది పశ్చిమాంధ్రదేశము. ఇందలి ముఖ్యపట్టణములు కందనూలు, బళ్లారి, ఆదవాని, కడప, అనంతపురము మొదలగునవి. హంపి, రాయచూరు వంటిదుర్గములు దర్శనయోగ్యములు. దేశమునందు బీదతన మెక్కువ. అరణ్యప్రాంతములు మెండు. వర్షాధారము జలాధారము తక్కువ. ప్రజలకుఁ గఱవులచే నిక్కట్టులు విస్తారముగ నుండును. వరియన్నములుగాని వానివలనఁగలుగు బలహీనతలు గాని యిచ్చట లేవు. రాగిసంకటియు సజ్జ, జొన్న, ఒరిగ, కొఱ్ఱధాన్యములయన్నములు దిని సామాన్యప్రజలు బలముగ నుందురు. ఇండ్లన్నియు పూరికొంపలును మిద్దెలుగ నుండును. మేడలు తక్కువ. గాలివచ్చుటకుఁ బోవుటకుఁ దగువాతాయనాదిసౌకర్యములు స్వల్పము. కొన్నిచోటుల బహిర్ద్వార మొక్కటియే యుండును. బట్టలఁ గట్టుటయందుగాని యాహారమునందుగాని మాటయందుగాని మొరటుతన మచ్చుగ్రుద్దిన ట్లుండును. నవనాగరకతాపిశాచ మిట లేదు. కాన ప్రాచీన విజ్ఞానమును బెంపొందించుటకుఁ దగునవకాశ మిటఁ గలదనుట

యథార్థము. ఆచారముల యందును బరిశుభ్రత యందును ప్రజలు వెనుకఁబడినారనుట కనుమానములేదు. నూతన విద్యావిధానమువలనఁ గలిగినదోసగులు లేవ్రగాని యవిద్య వలన గలిగినయజ్ఞాన మున్నది. అనుభవమునుబట్టి చూచిన మవిద్యకంటె యవిద్యయే మేలనిపించుచున్నది. నవనాగరికత కంటె యనాగరికతయే శ్రేష్ఠ మనిపించును. సుకుమారతకంటె నిరోగతతోఁగూడిన మొరటుతనమే మేలు. స్వాతంత్ర్య ముకంటె సుపారతంత్ర్యము భావ్యము. నాగరికతవలన గలుగు నవినీతికంటె మొరటుతనమువలన నిర్బాధకమైననీతియే శ్రేయ స్కర మైనది. రోగభూయిష్ఠము లగుపల్లపుభూములసంపద కంటె నిరోగము లగుమెట్టభూములదారిద్ర్య ముత్తమము. నాశహేతువగునవీనసంఘ సంస్కరణముకంటె స్థిరత్వమును జేకూర్చు పూర్వాచారపరాయణత్వము శ్రేష్ఠము.

ప్రజలందఱకిచ్చుట తములపాకులను పొగాకును సమ లుటలోఁ బ్రేమ గలదు. ప్రతియింటను సచ్చిదానందమునకు మర్యాదగ తములపాకులు పొగాకు నందించుటయు నాతఁడు వానిని వందనములతో నిరాకరించుటయుఁ దటస్థించెను. ఈదేశ మున త్రాగుడు విస్తారము. దాని దుష్ఫలములను వేఱచెప్ప వలయునా ? వీధులయందుఁ ద్రాగి తందనాలువేయుచుఁ గత్తులఁ ద్రిప్పుచు నొకరిపై నొకరు తూలిపడుచు దుర్భాషలాడుచు మనుజులు చూపరులకు నవ్వును, భయమును, అసహ్యమును

గలిగింతురు. ఈ త్రాగుడువలన హత్యలు సంభవించుచుండును. బలమును ధైర్యసాహసములును రోషమును ప్రజలలో మస్తుగ నుండుటచేతను నిష్కాపట్య ముండుటచేతను, అవినీతిజరిగిన చోట్లనెల్ల హత్యలు జరుగుట పరిపాటి యైనది. ఈమొరటు తనమును, అనాచారమును, అవిద్యయు, అనాగరికతయుం, నిలకించినప్పుడు శ్రీనాథునిచాటువులు సచ్చిదానందమునకు జ్ఞప్తికి రాకుండగలవా ?

“ గొంగడి మేలుపచ్చడము కుంపటి నల్లులకొక్కుమంచమున్
జెంగట వాయుతైలము లక్కిణ్ణపుమందులు నుల్లిపాయలుం
ముంగిట వంటకట్టెయలమోపులు దోమలు చీరపోతులుం
రంగ వివేకి కీమొరసరాజ్యముకాపుర మెంతరోతరా ”

“ వంకరపాగలుం నడుమువంగినకత్తులు మైలకోకలుం
సంకటిముద్దలుం జనుపశాకములుం బలుపచ్చడంబులుం
దెంకగునోరచూపులును తేకునదప్పినయేసబాసలుం
రంకుల బ్రహ్మ యీమొరసరాజ్యము నెట్లుసృజించె
నక్కటా ”.

ఈ ప్రదేశములయందు మహమ్మదీయులసంఖ్య యెక్కువ. ఇండలి ప్రజల కాంధ్రముతోం గన్నడమును తురకమునువచ్చును. కర్ణాట మహమ్మదీయరాజ్యములసరిహద్దున నుంటచే వీరికన్ని భాషలు వచ్చుట మంచిదయ్యు నాంధ్రభాష సాంకర్యము

నొందుటకిది హేతువైనది. ఉత్తరదేశములందలి దీర్ఘములకు నీపశ్చిమదేశములందలి హ్రస్వములకును పోలికము సరిపోవును, మఱియు దుడ్డు (ధనము) వొబ్బు (శ్రేయు) తప్పు (పక్లెసము) తోలుకవచ్చుట (పిలుచుకొనివచ్చుట) మొదలగు పదములు, బొల్చి, పందుంపుల్ల, దోబు (ఈయు) వఱెహోవ్యాస్సదముగ నుండును. కాని దేశసంచారమువలన నితరులమాటలయెడ సహన మేర్పడును. వానినాక్షేపించక సచ్చిదానందుడు విశేషములను మాత్రము గ్రహించును. మూఁదుచెప్పినవానికంటె నాటకస్తోత్ర చారిత్రికపరిశోధనాసక్తి సచ్చిదానందుని దుర్గపరిశోధనము నం దెక్కుడుగ పురికొల్పినది. ఉత్తమనాగరికత కాలవాలము లగునావిజయనగరప్రాంతము లెట్లీవిధముగ మొటుతనమున కాలవాలమయ్యెనా యని యాత్రికుఁడు చింతించును. ఇది యేకాలమునందుగూడ మారని ప్రజాస్వభావము కాఁబోలు నని యాత్రికుఁడు శాంతించును. హంపి మొదలగు క్షేత్రముల దర్శించినప్పుడు విద్యారణ్యులవిజ్ఞానమును, కృష్ణదేవరాయల శౌర్యమును, పెద్దనవైదుష్యమును, విద్యానగరసైన్యముల పౌరుషమును, శిల్పకారులనైపుణ్యమును, ప్రాచ్యప్రభవభాగ్య సమృద్ధియుఁ దలఁచితలఁచి దుఃఖించిదుఃఖించి యొక్కొక్క శిల్పముకడ, నొక్కొక్కదేవాలయముకడ నొక్కొక్కదుర్గ ద్వారముకడ నిలచినిలచి తోడివార లెంతబలవంతము చేసినను కదలక యటనుండి కదలలేక కదలలేక కదలుచుఁ బోవలేక పోవ లేక పోవుచు వ్యథఁ జెందును.

ఆదవానిదుర్గమున జరిగినయొకవిషయమును మాత్రము ప్రత్యేకముగఁ జెప్పుచున్నాము. మనయాత్రికుఁడు మార్గదర్శిని తోడుచేసికొని యాదవానిదుర్గమును జూడనేగెను. ఒకటిరెండుద్వారములు గడచి కొండపై కెక్కుసరికి మార్గమునకుఁ బ్రక్కగ నొకమసీ దగుపడెను. ఆమసీదు క్రమముగ శిథిలమగుచు లోపలినుండి దేవాలయద్వార మగుపడుచుండి నది. అందలిశిల్పకళాచాతుర్యమున కచ్చెరువంది యందలి ద్వార మాతనిమనసు నాకర్షించుటచే నాతఁ డప్పటికి వేగమె పోయి వెంటవచ్చినమార్గదర్శి నిదియేమని యడిగెను. అతఁడు, "రామరాయలోరికాలంలోండ్రి, పిరాబోటిపెద్దమడుసు లీగుడి కట్టిండ్రి, తురకోం ల్లొచ్చి వాండ్ల న్దోలి గుడిపడదొబ్బి మసీదుకట్టిండ్రండ్రి. మసీదుపడి గుడి కానొచ్చిండ్రి" అని చెప్పెను. ఇది మిగుల సంతాపముగలిగింప మనమిత్రుఁ డాతనిమాటలకు నవ్వుటకు బదులు కన్నీరు జొటజొట కార నేడ్చెను. తరువాత దుర్గమంతయుఁ గాంచి యాతఁడు బస కేగెను.

ఆదవానిలో నొక్క దేవాలయమున నాతఁడు గూర్చుండి యుండ నొక్క పెద్దమనుష్యుఁ డటకువచ్చి మనమిత్రునియూరు పేరు లడిగెను. తనకిష్టము లేకపోయినను పెద్దమనుష్యుఁడు గదా యని యతఁడు తనయూరును బేరును జెప్పెను. అంతఁ బోక నాయన యాతనివిద్యావిషయమునఁ బరీక్షింప మొద

లిచెను. మనయుపకారుఁడు కోపమునొంది పరిహాసము సహించెను. అంతట నా పెద్దమనుష్యుఁడు క్షమార్పణముఁజెప్పి తానుకుంప ణీలో మహమ్మదీయవిద్యావ్యాప్తి గావించునుపాధ్యా యుఁడ నని చెప్పి ధనసహాయార్థము నైజాముగారి కర్జీ వ్రాసి పెట్టుమని కోరెను. ఇతరులకు సహాయము చేయుటయందు ఆర్య కంకణుఁ డగు పితృఁడు కోపమువాని నలయునాయకము చేసెను. మఱియు నాయూ ప్రాంతములపరిస్థితుల నెఱిఁగెను.

సచ్చిదానంద మీనాని నైజాముదేశమున కేగినాఁడు. అచ్చటి ప్రజలనుగూర్చి విపులముగ వర్ణింపఁ జాలఁపలేను. అవటి ప్రభుత్వపుప్రజలస్థితియు, దేశముఖ్ దేశపాండ్యాల సామ్రా జ్యమును, తాలూకాదారుల వైభవమును, ప్రజలయతిథిసత్కా రమును ప్రశంసనీయములు. కాలికముచ్చలును, పొడుగు బంగీయు, నిడుపుటోపియు హైందవులకును మహమ్మదీయు లకు నభిమతమైనవేషము గావున నీదేశమున వారిరువురను వేరు చేయుట కష్టము.

నైజామునందు వరంగల్లు కాకతీయులముఖ్యపట్టణము. పూర్వ మచ్చట సుమారుమూడుశతాబ్దము లాంధ్రలక్ష్మి యోలలాడినది. ఆంధ్రుల ప్రతాపము వెల్లివిరిసినది. ఆంధ్రుల పాండిత్యము విజృంభించినది. రెడ్డివెలమకమ్మబలిజనాయకుల కది స్థానము. సోమన, పోతన, తమ్మయ, విద్యానాథుల కునికి పట్టు. అక్కనమాదనలు సంచరించి యధికారము చలాయించిన

ప్రదేశము. కావునఁ బ్రాచీనశాసనములు, శిల్పములు, తాళపత్రగ్రంథములు, నిచ్చట విస్తారముగ దొరుకఁగలవు. అతఁ డా ప్రాంతములఁ బ్రతియూరను విద్యాధికులయిండ్లకేఁ పూర్వవృత్తాంతముల సేకరించి, ప్రాచీనతాళపత్రగ్రంథముల నార్జించి యముద్రితముల నతిజాగరూకతతో భద్రపఱచెను. ఇవన్నియు జాగ్రత్తపఱుపవలసినవనియు ప్రాచీనపు నాణెములను, రాగిశాసనములను సంపాదించిపెట్టుమనియుఁ బ్రార్థించెను.

నైజాము ప్రభుత్వమునందలి పోలీసుశాఖ బలదర్పములు గలది. ఒక్క పోలీసువానిని జూచిన లక్షాధికారియైనను బట్టఁ దడుపుకొనవలసినదే. సామాన్యోద్యోగులును బ్రజలపైఁ బ్రబలాధికారము చలాయింతురు. మనమిత్రుఁ డొకయూరిలో కరణము మొదలగు నుద్యోగస్థులతో రచ్చబండపైఁ గూర్చుండెను. పొరుగూరిచాకలియొకఁడు కిఱ్ఱుచెప్పులఁ దొడిగి, నోట చుట్టఁగాల్చుచు, బారుకఱ్ఱ చేఁబట్టుకొని, క్రొత్తబట్టలమూట మోసికొనుచు వెళ్లుచుండెను. అచ్చటనున్న సుంకపుద్యోగి జమానును బిల్చి, “కమాల్, వీఁడు పొగరెక్కి చుట్టకాల్చుచు వీథిని బోవుచున్నాఁడు మనకచేరివద్ద వీని నిలిపివేయుము”. అనెను. చిత్తమని వాఁడు పోయి యాతనిగుడ్డలకు సుంకము వసూలుచేయవలయునని నిర్బంధించి నిలిపియుంచెను. ఒకటిరెండుగంట లట్లుంచి ‘ యికెప్పుడు పెద్దమనుష్యులయెదుట

కట్టుగుడ్డను మడతమార్చి నెలరోజులు గట్టుదురు. దొడ్డికేగిన వస్త్రములతో వన్నిపనులను జేయుదురు. పట్టుగుడ్డలతో పాకీ దొడ్డికేగువారిని మనమిత్రుఁడు చూచెను. ఈగలు ముసరి నను నట్టికాకీపవ మాసరు. ఆమురుగుడు గృహములలో నాంగ్రులు భుజించుచుండ నతఁ డాశ్చర్యముఁ జెందెను. ఇట్టి యాలయములలో బ్రాందీవిస్కీల నాంధ్రులుకొందఱు తెప్పించి త్రాగుచుందురు. వేయిమంది వేయి చెప్పనిండు. చూడఁదగినవి వేయి కలవననిండు. అనుభవింపఁదగినవి లక్షగలవననచ్చును. వారితోఁ గలహింపక మన మీయూరిని వీడుదము. ఒక్కవిష యమును స్మరింపఁవలయును. అది కార్మికులదుఃస్థితి. ఒకపూట యరపూట తినియో తినకయో స్వేచ్ఛగ సంతోషముగ సంచ రించుచు, నీతి, పరువుమర్యాదలును, రక్షించుకొని బ్రదుకు పల్లెటూరివాండ్రు యంత్రాలయములయందు కూలి యెక్కువ దొఱకునని వచ్చి దుఃస్థితికి లోఁబడిరి. వారిస్వేచ్ఛ యడుగంటి నది. వారి మానప్రాణములపై దాక్షిణ్యములేనివారి కధికా రము వచ్చినది. వారియోామయ యంత్రములకు దాసానుదాసు లైరి. వారిగృహముల వర్ణించుట దుస్తరము. వారి దుఃస్థితి దుర్భరము. ఒక్కమాటలోఁ జెప్పిన వారు సకుటుంబము యంత్రములైనారు. వీరిఁకఁ దోడుగ నూరినిండ బిచ్చ గాండ్రుందురు. వృద్ధులు, రోగులు, కుంటివాండ్రు, అంధులు, మొదలగువా రనేకు లిచటఁ గలరు. ఈబిచ్చగాండ్రలో నాంధ్రులసంఖ్య యధికము.

బందరుగుంటూరులు ముఖ్యపట్టణములుగ నున్న మధ్యాంధ్రమును సచ్చిదానందము దర్శించెను. దాని యుత్తర భాగము నాగరికతగలది. దక్షిణపశ్చిమభాగములు మొరటు దేశమునకు సమీపమున నున్నవి. ఉత్తరమున భాషాశాస్త్రము ప్రశంసనీయ మైనది. స్వచ్ఛమగు లక్షింపదగినదానాదులు, వేషము లిచ్చట గలవు. దానము త్యాగములుకొంచెము. ఆవేశపరు బద్ధకము. ముందువెనుకలాలోచింపనివా రెక్కువ. ఇట్లు సచ్చిదానంద మాంధ్రదేశపర్యటనము గావించె.



# ఇరువదిరెండవ ప్రకరణము.

———:౦:———

## వ్యాధి.



దక్షిణాంధ్రమునందింకను జూడవలసిన ప్రదేశము లుండుటచే సచ్చిదానందము మరలఁ బయనమయ్యెను. కవిబ్రహ్మ యనిపేరుగాంచిన తిక్కనకుఁ, బెంపుడుగ్రామ మగుసింహాపురియు, అరవదేశమునకు సరిహద్దుననున్న చిత్తూరును దిరుపతియు నిందు ముఖ్యప్రదేశములు. ఇచ్చట దాక్షిణాత్యసౌరభము గలదు. గూడకట్టులు, ఏకమడులు, ఏసమాటలు, నున్నను ప్రజలు హాస్యరసప్రధాన మగునాంధ్రమును మాటలాడుచు నాగంతుకులను రంజింపఁజేయుదురు. స్త్రీ లందగత్తెలు. తెలివితేటలు కలవారు. రెడ్డిమహాజనుల సౌభాగ్యము సంపద మహౌదార్య మిచ్చటఁ బ్రశంసనీయములు. మనమిత్రున కీప్రాంతములఁ గొందఱుస్నేహితులు గలరు. అం దొక్కఁడు కవి. అష్టావధాని. అతిశయోక్తికిఁ బుట్టినిల్లు. ఈకవి మననాయకునకు మార్గదర్శకుఁడై నెల్లూరు జిల్లాలోని విశేషములఁ జూపించెను. ఈకవితో సంచరించునపు డతఁడు వ్రాసినయొకటి రెండుపద్యముల నుదాహరింతును.

## సమస్యాపూరణము.

“ బంగరులింగకాయ గలభామిని వైష్ణవకాంతయే గదా ”

సంగమవేళలన్ సురతచాతురి మేలిరిపించి నిచ్చలుం
బుంగమ క్షేమ మెల్లప్పుడు బ్రోచెడు నప్పు కష్ట కింతచేసి ని
ల్పొంగలివై చరింప మగవీక్ష జేరెదవారెవరిన్ని, నా
బంగరులింగ ! కాయగలభామిని వైష్ణవకాంతయే గదా.

“ అరమరలేనిలింగనవు నయ్యు సువైష్ణవనామ ముంచితే ”

హరిహరులొక్కటే యనుచు నిందరు తా మననష్టయాత్ర సు
స్థిరతను జెల్లు సృష్టులుగ నివ్వుడు నీశ్వరుఁ డేకమంచు శం
కరుఁడు ఘనుండు స్వీయమతగౌరవమిగా పృథగింపు ముంబ పే
నరమరలేనిలింగనవు నయ్యు సువైష్ణవనామ ముంచితే.

ఇచ్చటిహాస్యకథలు విచిత్రముగ నుండును. ఏక్రొత్తకథ నైనను నొన్నికృతులు వర్ణములు, వర్ణనలు నక్కడక్కడ నుపయోగించుచు క్షణములో హాస్యకథఁగాఁ గూర్చుకొని యవసరమగుపట్టుల సంగీతవచనముతో దాటవేయుచు, గాథకులు జనుల రంజింపఁజేయుదురు.

ఇచ్చట నాతఁడు చూచినయంశములలో నెల్లూరిరంగనాయకస్వామి తిరునాళ్ల ప్రశంసనీయమైనది. తిరునాళ్లలు నుత్సవములు మనమిత్రునకు సామాన్యముగ రుచింపవు. పవి

త్రము లగుభగవదారాధనము లిప్పటిపరిస్థితులచే కేవలము యనిపించుమాత్ర మాయుత్సవములలో నిలిచియుండును. కొం డఱు ప్రత్యేకముగ తుచ్ఛలౌకికానందమునకే విచ్చేయుదురు. కొందఱు దేవుని దర్శింపనుద్దేశమైనను గలవారు గారు. వచ్చిన జనులం జూచుట, ప్రజలం ద్రోసికొని తిరుగుటయే, ప్రధాన ప్రవృత్తిగ గలతుచ్ఛులు కొంద ఱుందురు. ఇట్టివారిలో ద్యూతా సక్తులు పానాసక్తు లుందురు. వారియాచరణములు మఱియు దుర్భరములు. సాత్వికులైన ప్రజ లీసమ్మర్దములలోనికిం బో వెఱతురు.

రంగనాయకుల తిరునాళ్లలో దేవునివైభవ మగణ్యము. దక్షిణదేశము నిధులకును, ఉత్తరదేశము నదులకును బ్రసిద్ధ మని యొకసామెత గలదు. ఆదక్షిణదేశదేవాలయవైభవము పవిత్ర మగుపెన్నాతీరమున నున్న నెల్లూరితోఁ బ్రారంభము. ఇచ్చట నేమి—భోగము, లేమి—యుత్సవములు! ఏమిభజన, లేమి కోలాటములు! ఏమిమేళము, లేమిపాటలు! ఏమిమందు సామాను, లేమిదీపములు! ఏమి తెప్పయుత్సవము, లేమిగరు డోత్సవములు! వర్ణించుట కాయాదిశేషుఁడే రావలయును. ఈపర్యటన మింతితొ ముగిసెను. అచ్చటచ్చట నాతఁడు విగ్ర హారాధనమును గూర్చియు వర్ణాశ్రమ ధర్మప్రతిష్ఠాపనమును గూర్చియు నుపన్యసించెను. ఇందువలన నతఁడు సంస్కరణ మున కంతటికి విరోధియనితలంపరాదు. సంస్కరణము పేర

ప్రియురాలుండుట యీసందర్భమున శ్రేయస్కరముకాదని వైద్యుడు నాదేశించెను. వీరభద్రశాస్త్రి లోకోపకారియని మనకుఁ దెలియును. వారును వారితల్లియుఁ గావించినసేవ యింతయని వర్ణింపఁజాలము. 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనే' యని పెద్దలు చెప్పుదురు. శరీరమును బోషించుట కెంతశ్రమమైనను మిక్కుటము గాదు.

అతనికి బాధయతిశయించినది. ప్రాణిసేవాసంఘమును గూర్చి యాతఁడు తలంపఁడు. సాహిత్యవిషయముల ముచ్చటింపఁడు. చారిత్రికవిషయమతనికిరుచింపదు. దేశసేవ నచ్చదు. ఆహారవిహారము లింపుగావు. బంధుమిత్రాదులతోఁ బ్రసంగము వెగటైనది. పరోపకారపరాయణుఁ డగు నాతఁడు స్వోపకారాన్వేషణాసక్తుఁ డయ్యెను. ఇతరులబాధ నివర్తింపఁజేయు నాతఁడు తనబాధ యెట్లునివర్తించునా యనుచింతతప్ప మఱి యొకటి లేనివాఁ డయ్యెను. తనమిత్రుని కేదో యపాయము గలిగినదన విని యూరకుండును. సారస్వతమున నేదియో విశేషము సంభవించినదన తలయూచి నిరాదరముఁజూపును. అతి భూమిని బొందినప్పుడు అతనిసమానశక్తి యెందు కక్కఱకు వచ్చును. రుజ యెంతచేసినది! ఇందుకే పెద్ద లీరీతి నుడివిరి.

"మనమునఁ నూహాపోహలు మఱ్వకమున్నె కఫాదిరోగ [ములొ
దనువుననంటి మేనిబిగి దప్పకమున్నె నరుండు మోక్షనా

ఘన మొసరింపఁ గానలయుఁ దత్త్వవిచారము చేయకుండుటల్
తనువుప్రకాశన్ విరోధ మిది దాశరథీ కరుణాపయోనిధీ ”.

ఇట్టిసమయములలో, భగవత్స్మరణము గల్గునో గల్గదో యని భక్తులు “నాఁటికిప్పుడే చిప్పకచేతు మీభజన” యని యెల్లప్పుడు నీశ్వరభజనఁ జేయుదురు. “వ్యాధి యను కృతకవస్త్ర మాతఁడు ధరించినాఁడు. బాధ యను ప్రజలవస్త్ర మాతని నావరించినది. అతఁడు తనదమూలసము పౌరులకుఁ జూపఁజేయక తనకోటను తనయందుఁ బాళముపేసికొని యుంచుకొనును. శయనించి మూల్గుచుఁ దనయవస్థకుఁ దానే జాలినొందును. స్త్రీసంతతి ఒకియములేక గొంతెత్తి తనదుఃస్థితికిఁ దాను దుఃఖించును. తనకుఁ దా నెట్లునాయముచేసికొనఁగలుగుదునా యని చింతించి చిన్నచిన్న యుపాయముల వెదకుట యారంభించును. ఒక్కొకమారు బాధపొందుగర్భము తనది గాదనుకొనును. ఒక్కొక్కమారు దానిని శస్త్రచికిత్సచేసిన బాగుగనుండునని తలంచును. ఇతరులు పొరలాడుచు ప్రక్కగున్న ముమతిలు పడినదని చింతించును. చూడవచ్చినవారితో మాటలాడఁడు. సరిగదా నా రక్తేంద్రియముల కారోగ్యముగ నుండవలయునని యూర్ష్యఁ బూనును. వైద్యునితో, “ఇది తక్షణము నివారింపగలిగిననేగాని మీరు వైద్యులు కారు” అనును. ఒక్కప్పుడు తానుమహారాజు నని భావించును. తనగది మహాభవనము. సేవచేయువారు పరివారము. పిచ్చిలవిడిగఁ బెట్టిగిసకేశ

పాశము నీలమణిఘటితకిరీటము. మెత్తనితనవస్త్రములు చీని చీనాంబరములు. శయ్య సింహాసనము. వైద్యుఁడు ప్రధాన మంత్రి. ఇట్లూహించుచుండ క్షణములో నాకల మురిగియును. యథాస్థితి ప్రత్యక్ష మగును. అతఁడు తీవ్రతీర్మానములను సేయును. అవి యెంతతీవ్రములో యంతసులభముగ గాలి పటె నెగిరిపోవును. పశ్చాత్తాపము గలుగును.

అతఁడు ప్రక్కలోఁ బొరలును. కుడిప్రక్కకుఁ జేరును. నుజల నెడమప్రక్కకు వచ్చును. వెలికెల బరుండును. మరల శిశువువలె బోరగిలఁబడును. దిండు నుదరముక్రిందఁ జేర్చి గట్టిగ నదుముకొనును. ప్రక్కనుండి లేచి యటునిటు కదలి కదలి శ్రమఁ జెంది మరల శయనించును. నిష్కారణముగ నితరులపైఁ గోపించును. వ్యాధిని బారఁద్రోలుటకుఁ బ్రబల ప్రయత్నములఁ జేయును. ఈదుష్టశత్రువును జయించుట సాధ్యముగాదని యనుస్మరనును. దైవమును

“ లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణం
[బులున్
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమం
[బయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావేయీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా ”

అని ప్రార్థించును.

దురు. ఆతనిముఖలక్షణముల నతిజాగరూకతతో వారు పరీక్షింతురు. వైద్యునియవస్థయు నాసమయమునఁ గఠినమైనదే ".

ఈసమయమున సచ్చిదానందము వ్రాసినపద్య మొకటి స్ఫురించుచున్నది. అక్కాలమున వ్రాయఁబడినదగుటచే నది శ్రేష్ఠమైనది గాకపోయినను భావపూర్ణమని యుదాహరించుచున్నాను.

" వర్ణింప నిది నాకు వశముగాఁబోవ
దర్ణవంబును బోలి యంత మెటులేదు.
చెప్పరానిది బాధ శ్రీరామ రామ
యప్పు డిప్పుడు లేక యహము రాత్రియును
కరిని బాధించు మకరిని బోలియును
పరకాంతఁ బీడించు నరకుచందమున
కన్నబిడ్డలఁ జంపుకంసుని రీతి
క్రన్ననఁ గఱచెడుకాలాహి విధము
పలుతెఱంగుల నన్ను భంగ మొనర్చి
యలుకతో వేధించు నయ్యొ యింకెట్లు !
మందుల మంత్రాల మాయంబు గాదు,
వందలశస్త్రాల వదలిపోఁ బోవ
దుదయము సాయంత్ర మొక్కరీతిగనె
యదయత వేధించు నర్లె మధ్యాహ్న
వేళయందున రాత్రివేళయందునను

కాయాంతమగుచున్న కష్టకష్టములను
వేయువిధంబుల వెలిగించఁ జేయు
గర్భగోత్రంబుల గణుతించు చేసి
యడ్డకత్తెముగూర్చు నయ్యురో! దాస!

మండెమంచి చిన్నారులన్నిటి యూరికిగాక కొన్నాళ్లు నివసించెను. కాని దేహము మిక్కిలి దుర్బలముగ నున్నది. కొంతకాల మారోగ్యము లేదాయె నయ్యెను. మరియొక వ్యాధి యంకురించినది. మందస్మితవదనము మాసిపోయినది. క్రమక్రమముగ శక్తి లభించుచుండెను. సంపూర్ణశక్తి వచ్చులోపల కాలమును బుద్ధులకు గ్రంథపఠన మారంభించెను. సంస్కృతమున రామాయణమహాకావ్యమును పఠించి ధన్యుఁడ నని తలంచెను. భగవద్గీతామహాగ్రంథమును వ్యాఖ్యానసహితముగ నాలకించెను. ఈవిషయములయందు వీరభద్రశాస్త్రి మిక్కిలి సహాయుఁడుగ నుండెను. త్వరలో నాతఁడు బలయుతుఁడై పూర్ణారోగ్యమును జెందెను. ఇఁక నాతనిదగ్గఱనుండి బంధువులందఱును వెడలిపోయిరి. సంస్కృతాంధ్ర ప్రబంధపఠనముఁ జేయుచు నాతఁడు శృంగారరసమున నాసక్తిగలవాఁడయ్యెను. నవనవోన్మేషముతో నాతని యౌవనము విజృంభించుచుండెను. చంద్రరేఖయుఁ బూర్ణచంద్రబింబము ననుకరించెను. ఇఁక సంసారమే ప్రారంభముకాఁదగినది. బంధువులు కోరినదది. వధూవరు లభిలషించినదది.

ఈశ్వరుఁడు సర్వకాల సర్వావస్థలయందును నెల్లరకుఁ దోడ్పడుచుండును. కర్మము ననుసరించి మనమేలును విచారించి మంచిచెడ్డల నాతఁ డొసంగుచుండునని భావింపవలయును. ముందు రాఁబోవుమేలును దలంచి భగవంతుఁ డనుగ్రహించిన సర్వమును సమబుద్ధితోఁ గాంచువారు ధన్యులు. కష్టములలో భగవంతు నిందించుటయు సుఖములలో మాత్రము ప్రశంసించుటయు వివేకముగాదు. సచ్చిదానందము స్వస్థచిత్తుఁడై సర్వవిద్యాపరిపూర్ణుఁడై, యౌవనోద్భాసియై, బలవంతుఁడై యుండుటను గాంచి పురుషోత్తములు తమసహజశాంతభావముతో భగవంతునియనుగ్రహమని భావించిరి.

# ఇరువదిమూడవప్రకరణము.

## విధిలాభము.

సర్వప్రధానాంశమున కిప్పుడు మనవ్యాసపరీక్షకవిద్యార్థి యంతయుఁ బూర్తియైనది. అతఁడు నానాదేశములఁ బ్రవాసమును బర్యాటనమును ముగించినాఁడు. గృహస్థజీవనము సన్నిహితమైనది. ఇంకను లోకస్థులవంటివి చూడవలయునని త్వరపడుచున్నాఁడు. తనకాలమునఁ బ్రభుత్వోద్యోగమునందుఁ జేరి తన కంటె సత్ప్రవర్తనపరుల నలంకరింపవలెనని పురుషోత్తముల యాశయము. కాని చదువునకు, అంతెక్కడ? దేశదర్శనాభిలాషకుఁ దృప్తియెక్కడ? భారతభూమి కొక్కమారు ప్రదక్షిణముగావింపవలెనని యాతనియూహ. తత్త్వగ్రంథములను సమగ్రముగ నవలోకింపవలెననియు సరియైన సాధనముచేఁ దత్త్వవిచారణము గావింపవలయు ననియు నాతనియుద్దేశము. ఆతనికిఁ జంద్రరేఖపైఁ గలప్రేమ యపారము. సారభూతమైన సంసారానందము నొక్కసారి రుచిచూచినతరువాత, విపులము లగు తన యాస్తులను బరిపాలించుటఁ బ్రారంభించిన తరువాత, దేశాటనమునకుఁ దీఱుబా టుండదని యాతని భావము.

ఇఁక నుద్యోగవిషయమై పురుషోత్తములమాట జెప్పవలెను. ఆయన కూడ యతఁడు ప్రత్యుత్తరమీయక తప్పించుకొని తిరుగుచుండెను. ఎంతమహోన్నతి పదవి యైనను, ఉద్యోగమన్న నాతనికి నేవగింపుగ నుండెను. సేవాధర్మము దుర్భరమైనది. మానవుని స్వాతంత్ర్యము నరికట్టి, ఆత్మవిస్వభావమును సంకుచితముఁ జేసి, అతనికాలమును వ్యర్థము చేసి, స్వార్థమునందుఁ గాని, పరార్థమునందుగాని, యతనియుత్సాహము నడుగంటఁ జేసి, అతనిని దోలుబొమ్మను జేసివైచుసేవావృత్తి గర్హ్యమని వేఱుగఁ జెప్పవలయునా? పొట్టకూటికై యెన్ని యబద్ధముల నాడవలయును? యజమానుని మెప్పించుటకై యెన్ని వక్రమార్గముల నడువవలయును? తనక్రిందివారిని జక్కఁగఁ బనులు నిర్వహింపఁజేయుటకై యెంతకాఠిన్యమును బూనవలయును? ఋజుత్వ మవలంబింపఁ దలచినచో నధికారులతో నెన్నిసారులు తగవులాడవలయును? కార్యనిర్వహణమునకై పరమార్థమున కక్కఱకురాని గ్రంథముల నెన్నింటిని జదువవలయును? ఎన్నిచోటుల పడిగాపులు పడియుండవలయు, నెన్ని గ్రామములఁ దిఱుగవలయు, అయుక్తము లెన్ని యాచరింపవలయు, యుక్తముల నెన్నిటిఁ బరిహరింపవలయు? అహో! దురూహ్యము! దుస్సహము!

అధికారము వహించినవాని దుర్లక్షణములను శ్రీనాథకవిసార్వభౌముఁడు మనోహరముగఁ బ్రకటించినాఁడు.

లేఁడు భూపతి, గలిగినే వాఁడు నృపుఁడె
విశ్వధాత్రి జనులపాలి వేల్పుగాక
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
నంతరరులను వర్జింప నలవిగాదు ".

రాజులతో సంబంధము పాములతోఁ జెలగాటమువంటిది. క్షణ
ములో వారు కోపింతురు. ఇంతలో ననుగ్రహింతురు. లక్ష్మీ
కటాక్షమును రాజులయనుగ్రహమును గాలిలోనిదీపమువలెఁ
జంచలమైనవి. అందువలన మననాయకునికి నుద్యోగమునం
దంతగా నుబలాటము లేదు. పురుషోత్తములు రాజ్యమునందుఁ
బరపతిగలవారు గావునఁ దమకుమారునికిఁ బ్రారంభమునందే
గొప్పయుద్యోగ మిప్పింపవలయునని మురియుచుండిరి. అంత
టితో వారు సంసారము నంతయుఁ దమకుమారునిపై నుంచి
మోక్షమార్గ మవలంబింప సంకల్పించిరి.

ఈపరిస్థితులలో భారతదేశ మామూలాగ్ర మొక్క-
మారు చూచివచ్చెదనని సచ్చిదానందము పురుషోత్తములఁ
బ్రార్థించి వారియనుజ్ఞ వడసెను. బంధువులందఱ కిది సమ్మ
తముగాకపోయినను వారినెట్లో యొప్పించి. యతఁడు తీర్థ
యాత్ర బయలుదేఱెను.

మొట్టమొదట నాతఁడు మైసూరురాజ్యమును మళ
యాళమును గాంచి పశ్చిమసముద్రతీరమును జేరెను. అఁట

పూనహాల్, బొంబాయిలను దర్శించినపిదప అజంతాగుహలను ఎల్లో
రాగుహలను సందర్శించి యచ్చటి బౌద్ధ, జైన, హైందవశిల్ప
ములం గాంచెను. అంతట భారతీయ శిల్పనిలయము మహమ్మదీ
పురము, చరిత్ర ప్రసిద్ధమైన ఉజ్జయిని, ఇసుకతిన్నెలమధ్య నగ
సూరత్, సస్యశ్యామలప్రాంతమైన ఘూర్జర దేశము, శ్రీకృష్ణనివాస
స్థానమగు ద్వారక, ఒకప్పటి రాజధానులలో మేటియగు అహమ్మదాబాదు,
జైనశిల్పభూయిష్టమును, శీతల ప్రదేశము నగు ఆబూపర్వ
తము, క్రమముగాఁ జూచుచు నాతఁడు రాజపుత్రస్థానమును
ప్రవేశించెను. రాజపుత్రస్థానమున రాజపుత్ర శౌర్యచిహ్న
ములైన చిత్తూరు, ఉదయపూరు, అజ్మీరు మొదలగు పట్టణ
ములు భావోద్రేకమును గలిగించెను. చదరంగపుగళ్ళవలె
సమానముగఁ జక్కఁగ నిర్మింపఁబడిన జయపురము ఆశ్చర్య
జనక మైనది. అచ్చట రాజపుత్రశిల్పమును, మొగలాయిశిల్ప
మును, అజంతా యెల్లోరాల ప్రాచీనశిల్పముతోఁ బోల్చిచూచు
కొని సచ్చిదానంద మానందించెను. అమీఁద సింధు, పాంచాల
దేశములద్వారా నాతఁడు కాశ్మీరమును జేరెను.

కాశ్మీరము భూలోకస్వర్గము. కాళిదాసుచేఁ గుమార
సంభవమునందుఁ బ్రశంసింపఁబడిన హిమాలయపర్వతము లం
దతిమనోహరదృశ్యముల నొసఁగుచుండును. ప్రశాంతములైన
కాశ్మీర హిమాలయ ప్రకృతి సందర్శనములు మననాయకునికి
వర్ణింపవీలులేని యానందమును శాంతి నొసంగినవి. అచ్చట

పూర్వము తపము గావించిన వ్యాసాదిఋషీశ్వరులను దలంచి యాతఁడు తన్మయస్థితిఁ జెందెను. ఆవెట్టిలోఁ గష్టనిష్ఠురముల గణింపక, యమునోత్రి, గంగోత్రి, బదరీనారాయణము, కేదారము మొదలగు హిమాలయపుణ్యక్షేత్రముల నాతఁడు సేవించి మఱల ఢిల్లీ చేరెను. ఢిల్లీలో మొగలాయిశిల్పములఁ గాంచి యయోధ్యమీఁదుగా ప్రయాగక్షేత్రమునఁ బ్రవేశించి యక్కడి గంగాయమునాసంగమ దృశ్యమున కాతఁడు ముగ్ధుఁడయ్యెను. అప్పుడు రఘువంశములోని యీక్రింది శ్లోకము లాతనికి స్ఫురణకు వచ్చినవి.

క్వచిత్ప్రభాలేపిభి రింద్రనీలైః ముక్తామయీయష్టి రివానువిద్ధా
అన్యత్ర మాలాసితపంకజానా మిందీవరై రుత్ఖచితాంతరేవ
క్వచి త్ఖగానాం ప్రియమానసానాం కాదంబసంసర్గవతీవ పంక్తిః
అన్యత్ర కాలాగురుదత్తపత్రా భక్తి ర్భువ శ్చందనకల్పితేవ
క్వచిత్ప్రభా చాంద్రమసీ తమోభి శ్ఛాయా విలీనైః శబలీకృతేవ
అన్యత్ర శుభ్రా శరదభ్రలేఖా రంధ్రేష్వివాలక్ష్యనభః ప్రదేశా
క్వచిచ్చ కృష్ణోరగభూషణేవ భస్మాంగరాగా తను రీశ్వరస్య
పశ్యానవద్యాంగి విభాతి గంగా భిన్నప్రవాహా యమునాతరంగైః॥

అటుతరువాత కాశీ, సారనాథ్, గయా, బోధిగయ, కాళీఘట్టము, జగన్నాథము, సింహాచలము క్రమముగా నాతనియాత్రాస్థానములు. వీనినన్నిటిని వర్ణించుట యనావశ్యకము. ఈయాత్రలవలన మనబుద్ధుని బుద్ధి వికసించినదని తెలిసిన మనకుఁ జాలును. ఎన్ని వేదాంతగ్రంథములు పఠించినను

యింటికి యేయాత్రికుఁడు వచ్చినను, ఏయతిథి వచ్చినను దగు రీతి నాతనికష్టముల నూహించి గౌరవింపఁగలుగును. ఇఁక తీర్థములయందలిపుణ్యమునుగూర్చి చెప్పఁ బురాణములకే విడిచెదము. తీర్థములు మహాపురుషుల కాస్థానము లగుటవలనఁ బవిత్రములై యాత్రికులకుఁ బవిత్రభావములఁ గలిగించి వాంఛనీయమైన యేకాగ్రతను వారికిఁ గలిగించును.

ఇట్లు సచ్చిదానందము యాత్రలకు బయలుదేఱిన మఱుసటిరోజుననే శాంతిపురమున నొకవిచిత్రముజరిగెను. కొంచెము ప్రొద్దెక్కినపిదపఁ బురుషోత్తములు విహారార్థము దమబీటికేగిరి. అచట నొక విచిత్రదృశ్యము వారికంటఁ బడెను. నొడ్లఁగాయుచున్న పిల్లలందఱు నొకచోటికిఁ జేరిరి. వారిలో నొకఁ డచట మిట్టమీఁదఁ గూర్చుండి యాంబాలురతగవును దీర్చుచుండెను. ఆమిట్టపై నుండి వాఁడు మహారాజతేజముతో మెరయుచు దేశశాసనములను మన్వాదిస్మృతులను గంతపాఠముగ నుదాహరించుచు మాటలాడుచుండెను. పురుషోత్తములు చాటుగా వెళ్లి దానినంతయుఁ జూచి యదియైనతరువాత నచ్చటికివెళ్లి యాంబాలుని లేచిరమ్మనిరి. అతఁడు దగ్గఱికి వచ్చి నిలుచుండి మాటలాడనైన చేతగాని, నిరక్షరకుక్షి యగు పసులకాపరి యనిపించెను. మఱల నాతని నామిట్టపై కెక్కించి ప్రశ్నింప ననేకవిచిత్రవిషయములకు సక్రమముగ జవాబిచ్చెను.

# ఇరువదినాలుగవ ప్రకరణము.

## సంసారము.

—:o:—

" అసారభూతే సంసారే సారః సారంగలోచనా॥ "

పురుషోత్తములు తమనూతన భవనమున కింద్రభవన మని పేరిడిరి. చంద్రరేఖాసచ్చిదానందులతో గృహప్రవేశ మహోత్సవము గావింపవలయునని వారుసంకల్పించిరి. ఇంద్ర భవనము నావరించియున్న విశాలోద్యాన మింద్రుని నందనవన మును మించి యుండెను. అందుఁ గాన్పింపనిసురభికుసుమము లింకనెచ్చటను గాన్పింపవు. అందు పండనిపండు లీభారతమున నెచ్చటను లభింపవు. ఒక్కచోట మనోహరకదళీతరువులు, ఒక్కచోట దివ్యసహకారములు, ఒక్కచాయ మకరందము స్రవించు ప్రసవములుగల పొగడచెట్లు, ఒక్కయెడ నల్లిబిల్లిగ నల్లుకొనినతీవలతో నిర్మింపఁబడిన పొదరిండ్లు, ఒక్క ప్రదేశ మున మృదువులైన పచ్చికబయళ్లు, ఒక్కస్థానమునఁ దూగు టుయ్యాలలు, ఒక్కతెరువున సురుచిరకమలవిభాసితసరోవర ములు, ఆయాప్రదేశముల కేగుటకుఁ జిత్రవిచిత్రవృక్షనియ మితమార్గములు, వృక్షలతాదులను బెంప నిరంతరము ప్రవ హించు కాలువలు, ద్రాక్షామండపములు, మాధవీలతామండ

ఇందు గోడలకు గొప్పగొప్పనిలువుటద్దములు దివ్యము లగు పటములు గలవు. ఒకపటమున నహల్యావృత్తాంతము చిత్రింపఁబడినది. మఱియొకచిత్రమునఁ దారాశశాంకులు శయ్యాగృహమున నున్నట్లు లిఖింపఁబడినది. మఱియొక లేఖన మున విశ్వామిత్రుఁడును మేనకయుఁ బ్రదర్శింపఁబడినారు. ఇంకొకచో నొకపెద్దపటమునందు చౌశీతిబంధములు ప్రదర్శిం పఁబడినవి. వేఱొకచిత్రమునఁ జుంబనవిధులు వివరించు బొమ్మలు గలవు. పురుషభేదములు స్త్రీభేదములు మొద లగుకామశాస్త్రవిషయములుకూడ కొన్నిచోట్లఁ జిత్రింపఁ బడినవి. ఒకమూల గోపికావస్త్రాపహరణము, ఒకవంక శివ దారుకావనవిహారము, ఒకచక్కి సత్యవతీపారాశర్యసమాగ మము, ఒకదెస రంభానలకూబరవిలాసము, ఒకయెడ నూర్వశీ పురూరవస్సమావేశము, రాధాకృష్ణలీల, సీతారామప్రేమ, నలదమయంతుల శృంగారము, గంగాశంతనసంగమము, శకుం తలాదుష్యంతగాంధర్వవివాహము మొదలగుచిత్రములు గలవు. చిత్రవిచిత్రశిల్పములుగలిగి గిలుకలతో గులుకువందిరిపట్టెమంచ ముపై హంసతూలికాతల్ప మమర్చియున్నది. బంగారుజల్తారు పోగులనుండి మంచిముత్యములు వ్రేలాడుచున్నవి. పాదరసము నింపినగాజుబుడ్లు రంగురంగుల గాజుకుప్పెలు ప్రకాశించుచు న్నవి. చుట్టుప్రక్కలఁ గూర్చుండుట కనేకవిధముల యాసన ములు గలవు. పునుఁగు, జవ్వాజి, కస్తూరి, మంచిగంధము,

అత్తరులు, అగరువత్తులు మొదలగు సకలసుగంధ ద్రవ్యములమర్చియున్నవి.

వీరభద్రశాస్త్రి చంద్రరేఖతో సకుటుంబముగ విద్వాంసులయింటికి వచ్చెసినాఁడు. పురోహితమంత్రములు చదువుచు లక్ష్మీదేవతపూజల నేర్పాటుచేయించి యజమానుని గలసి నూతనగృహమునందుఁ బ్రవేశించినారు. సత్యానందుఁ డిం వెనుక యనేకసంవత్సరములనుండి చంద్రరేఖను గాంచలేదు. ఆమె నిప్పు డీశోకమునకు దూరమై యౌవనోద్యానసమాగవిలాసముతోఁ గాంచి యాతఁ డున్మత్తుఁడువోలె నయ్యెను. ఆమెముఖము పున్నమనాటిచంద్రుని దిరస్కరించుచు దివ్యప్రభల నీనుచుండును. ముఖాంబుజము ముసిముసినగవుల వికసించుచు దివ్యమకరందము చిలుకునట్లుండును. ఫుల్లేందీవరపత్రముల నపహసించుచున్న లాకర్ణాంతవిశాలములైన వీక్షణవిశిఖముల సచ్చిదానందముపై బాణపరంపరలు గుప్పినట్లుండును. శిరోజములు తుమ్మెదరెక్కలో, కాటుకలో, చీకటులో, వర్షాకాలమేఘములో, నిర్ణయించుట కష్టము. నునుచెక్కుటద్దములు, మెరుఁగు లీనుచుఁ గర్ణభూషణములఁ బ్రతిబింబించుచుండును. నాసిక నవసౌరభము వెదజల్లు చంపకరాజము. కంఠము శంఖసదృశము. భుజములు లేఁదామరతూండ్లు. నారు చీమలబారు. జఘనము భూమండలమువలె విశాలము. నడుము గగనము. ఊరువులు కదళీస్తంభములనునుపుఁ దనమును గరి

కరములమార్దవమును గల్గి యున్నవి. పిక్కలు వెన్నుపొట్లలు, పదములు మృదుశిరీషకోమలములు. నఖములస్వచ్ఛసితకాంతు లలోఁ బదములయెఱ్ఱనికాంతులు రత్నములలోఁ బుష్యరాగ ములు గలసిన ట్లుండును. మేనిచకచకలు భూషణములకాంతి జిగి నపహసించును. ఆపోఁతఁబోసినబంగారుబొమ్మ నునుపసిడి మెరుంగులలోఁ సచ్చిదానందము ముగ్ధుఁడై మునిగిపోయెను. ఆతఁడు మొట్టమొదటఁ దనకన్నులను విశ్వసింపఁజాలక యిది బంగారుబొమ్మయా, దేవకన్యకయా, గంధర్వకాంతయా, చిత్ర పటమా, యని సంశయించియు బంధువులందఱు నచ్చట నుం టచే స్మృతిగలిగి చంద్రరేఖగదా యని గుర్తించెను.

సచ్చిదానంద మేమి తక్కువవాఁడా? వధువునకుఁ దగినవరుఁడు. దీర్ఘకాయము, స్వర్ణచ్ఛాయ, విశాలనేత్ర ములు, మొదలుగ నన్నిసల్లక్షణములు గలిగి చంద్రరేఖకన్ను లకుఁ బరమానందముఁ గూర్చెను. ఈదంపతులను జూచిన బందుగులు వీరిదాంపత్యమును బలువిధములఁ బ్రశంసించి వీరి నాశీర్వదించిరి. విందులకు విచ్చేసినబంధువులు సచ్చిదానం దను చేయుసత్కారములను గ్రహించుచు, ‘ పునర్జీవితుఁడ వైతివా ? ’ యని యభినందించువారును, ‘ చంద్రరేఖ యెదురుచూచుచున్న ’ దని మేలమాడువారును, ‘ కవులకును దేశసేవకులకును యాత్రికులకును సంసారముతో నేమిపని ’ యనువారును, ‘ సంసారమునఁ బడినతరువాత నన్నియు

శోన్యమే' యనువారును, 'ఇంక మనవంక (జూచునా' యను
వారునునై యనేకవిధముల సంతోషముతోఁ బ్రొద్దుపుచ్చిరి.
తల్లి ముత్తైదువలును చంద్రరేఖతో ననేకవిధములఁ బ్రసంగిం
చిరి. ఒకపెద్దముత్తైదువ, సచ్చిదానందముతల్లిని స్మరించి యున్నా
రని, 'మహాపతివ్రత, ఒక్కబంగారుమొలకను మాకిప్పై నుంచి
పోయినది. తీగె పందిరికెక్కి నాలుగుకాయలు కాసిన సంతో
షింతుము. ఆమెయే యున్న నెంతసంతోషపడునో!' అనెను.
మఱియొకయామె, 'పోనీయవమ్మా! అత్తలేనికోడ లుత్తమ్మురా
రాలు, కోడలులేనియత్త గుణవంతురాలు,' అని యీకాల
ములో నత్తలులేకుండుటయే శ్రేయస్కరము అని తనకోడలిని
జూచి పలికినది. మఱియొకప్రజ్ఞాంగన, 'చంద్రరేఖ యత్త
గారిని మించినకోడలు, రూపమున రంభ, సుగుణముల సీత,
తగినమహాపతివ్రత కోడలుగ లభించినది' అని యోదా
ర్చెను. ఒకయువతి, 'సచ్చిదానందముతోఁ గూడి యీయామె
మనతో మాటలాడునా? మనమందఱము నింతవఱకు నవ్వా
సెల్లెండ్రముగాని ఇఁకముందు కాము సుమా! చంద్రరేఖా!
ఎల్లు సవరింతువో, సచ్చిదానందము నాత్మీకుఁడు, అమాయి
కుఁడు సుమా' అనెను. మఱియనేకు లనేకవిధముల నామెతో
మేలమాడుచుండఁ జంద్రరేఖ సిగ్గుతోఁ దలవంచుకొని యుం
డెను. వధూవరుల కాపగలు, కడుదీర్ఘముగ నుండెను. ఎంత
కాలమునకోగాని కమలబాంధవుఁ డస్తమింపనట్లు తోఁచెను.

ఎట్టకేలకు ప్రొద్దు గ్రుంకినది. చీకటి విజృంభించినది. తారలు అవతరించినవి. చీకటిని జిమ్మివేయ మృగలాంఛనుఁ డుదయించినాఁడు. భోజనములు లైనవి. సచ్చిదానందము పడుకగదిఁజేరి మిక్కిలియసహనముతోఁ జంద్రరేఖకై యెదురు చూచు చుండెను. ముత్తైదువులు చంద్రరేఖను బలవంతముగ నాగదిలోనికిఁ దీసికొనివచ్చిరి. చంద్రరేఖ తల యెత్తలేదు. ముత్తైదువులు శోభనపుఁ బాటలఁ బాడిరి. ఒక్కరొక్క రేవేవో నెపములతో దాటిపోఁజొచ్చిరి. పసిపిల్ల యేడ్చుచున్న దని యొకరు, మంచినీరు త్రావి మరలవచ్చెద నని యొకరు, మాయమ్మ పిలిచిన దని యొకరు, జారిపోవుచుండ "నన్నొంటరిగ డించి పోయెదరా. నేనుగూడ వచ్చెదను" అని చంద్రరేఖ యనినది. "ఎంత సంగనాచివే అమ్మా! అదిగో నీకొఱకెదురుచూచుచున్నాఁడు. ఈవగపుల కేమిలే" యని చివరకు నిలచిననెచ్చెలి తప్పించుకొనిపోయెను. ఆసమయమునఁ బోవు నట్లు నటించుచంద్రరేఖను వరుఁడు చేయిఁబట్టుకొని, వారు బంధువులు నేను పరుఁడనా యని దగ్గఱికిఁ జేర్చికొనియెను. ఇఁకను వారి కేళీవిలాసములు, వారిచుంబనసౌభాగ్యములు, వారిరతిరహస్యములు, వారికే విడిచి వేయుదము. తెల్లవారుచున్నది. కోళ్లు కొక్కొరోకో యని తుదిసారి యొక్కసంఘముగఁ గూయ మొదలిడినవి. నక్షత్రములు క్రమముగ జారిపోయినవి. పక్షులు గూండ్లనుండి వెలువడి కలకలములు చేయు

చున్నవి. చంద్రకాంతి క్షీణించుచున్నది. తూర్పున నెఱ్ఱని కాంతి తోఁచినది. క్రమక్రమముగఁ దూర్పు తెల్లవాఱినది. చక్రవాకములకు విందుసేయుచుఁ, గమలములను వికసింపఁ జేయుచు, కలువలు ముకుళితములగుచుండ లోకములు నమస్కరించుచుండ భాస్కరుఁ డుదయించెను. చంద్రరేఖాసచ్చిదానందములు పెండ్లికడ లేచి ప్రాతఃకాలకృత్యములను దీర్చికొని బంధువులతోఁ జేరి సుఖంబుండిరి. చంద్రరేఖను ముత్తైదువులు కాటుక కఱిగినదనియు, ముఖము వాడినదనియు, కన్నులు నిద్రలేమిని సూచించుచున్నవనియు మేలమాడిరి. సచ్చిదానందమున కింద్రభవనమున దివ్యకన్యాసమాగమము లభించినట్లయ్యెను. అది వసంతర్తువు. నన్నయభట్టారకుఁడు వచించినట్లు,

"కమ్మనిలతాంతముల కుమ్మొనసి వచ్చుమధుపమ్ముల సుగీతనినదమ్ము లెసగెం జూ । తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధివకుళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా । లమ్ములగు కోకిలకులమ్ములరవమ్ము మధురమ్మగుచు వించెనని శమ్ము సుమనోభా । రమ్మున నశోకనికరమ్ములును జంపకచయమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్". మఱియు, "చందనతమాలతరులందు నగరుద్రుమములందుఁ గదళీవనము లందు లవలీమా । కందతిరుషండములయందు ననిమీలదరవింద సరసీవనములందు వనరాజీ । కందళితపుష్పమకరందరసముం దగులుచుం దనుపుసౌరభమునొంద జనచిత్తా । నందముగఁ బ్రోషి

తులడెందములు వంచురగ మందమలయానిల మమందగతి వీచెఁ".

ఇట్లు సర్వప్రాణులకు సమ్మోహజనకమైన వసంతకాలమున నిర్భరవయః స్థితినున్న యాదంపతులు పూఁదేనెలొలుకు పద్మములు గలసరస్సీరములను, చలువలనీనులతామండపముల యందును, కమ్మనిపూసెజ్జలవిరాజిలుచుఁ దరుచ్ఛాయాచ్ఛాదితము లగుపచ్చికలయందును, శీతలశిలావేదికలయందును, సురుచిరజలయంత్రస్థలంబులయందును సుఖముగ విహరించుచుండిరి. గ్రీష్మఋతువున కమ్మనిసహకారఫలమ్ముల భుజించి, లేతబొండముల నారికేళజలములఁ గ్రోలి, వట్టివేళ్ల వీవనలచల్లని గాలి ననుభవించి, సుఖించుచుండిరి. వర్షాగమమున, "మేఘాలోకే భవతి సుఖినో ప్యన్యథావృత్తి చేతః" యన్నట్లు వర్షాసారంబులు భూనభోంతరముల నిండి యింద్రధనుస్సులు వ్యాపించి, ఉరుములు మెఱుములు బ్రహ్మాండమునిండి కేకుల సంతోషనాదములు మిన్నుముట్ట నానందంబున నవినాభావముగ రేయింబవళ్లు గడపుచు, శరత్కాలమున "కుముదంబులు ముదంబంద, లాంగలి చెంగలింప, తెల్లుల్లసిల్లఁ గాసరగాయ, దోస దోరగిలంబార బమ్మెర విసర, నస లడుగుపడ, దవనిక పొసల" జడివానలు వెలిసి దిశలు తెలివొంద దూదిపింజలువోలె శరన్మేఘంబులు నింగి నటునిటు పర్వఁ బిండియారబోసిన ట్లుండువెన్నెలరాత్రుల నమందానందమున నుండిరి. ఇట్లు హేమంతశిశిరఋతువులును వారికి క్షణకాలమువోలె గడచుచుండినవి.

# ఇరువదియైదవప్రకరణము.

## విచారణము.

ప్రొష్మ గ్రీష్మమున్నది. మందమలయానిలమునకు గజ్జె పరకలు వహ్వాయని తల లూపుచున్నవి. వర్ష కాలము ముగిసి నందున విష్ణుక్రాంతపుష్పము లాకసమునుజూచి మాపర్ణమును మఱలఁజేరవచ్చితేవా యని యూక్షేపించుచున్నవి. గలిజేరు మొక్కలు బన్నిదిక్కులకు వ్యాపించుచున్నవి. మిమత లెగురు లాడుచున్నవి. కేచుమని కుమ్మరపుర్వులు సంగీత మారంభించి నవి. అచ్చటచ్చట తుమ్మెగుబురులపై జీరంగు లెగురుచు బుంయిమని ధ్వనిసేయఁ గడఁగినవి. పక్షులు గూండ్లకుఁ బరువు లిడుట మొదలు. సాయంసమయవసంతోత్సవమునఁ బ్రపంచ మంతయు నెఱ్ఱవారినది. నిశాసతిని పేరంటమునకుఁ బిలువఁ బశ్చిమదిక్కాంత వెలికిఁ దీసినకుంకుమబరిణివలె సూర్యబింబ మెఱ్ఱనై పతనోన్ముఖ మైనది. లోకమంతయు మఱుగుపడు చున్నది. ఒడలినిండఁ గాటుకపూసికొని నిశాసతి వేంచేసినది. మానధనులకుఁ బరసతిని జూడ సిగ్గుగావున పగలనుపురుషుఁడు పరువెత్తి పోయినాఁడు. సచ్చిదానంద మానసమయమున గాఢ చింతామగ్నుఁడై ప్రకృతిలీనుఁడైనట్లు కదలక మెదలక సాధ

ప్రాంతమునఁ గూర్చుండి యున్నాఁడు. ప్రక్కన రెండేండ్ల బాలుఁ డొకఁడు పారాడుచు నాడుకొనుచున్నాఁడు. సచ్చిదానందము వ్రాసికొనుట కక్కడనుంచిన సిరాబుడ్డి నాతఁడు కొరలించినాఁడు. ఆసంగతి మనమిత్రుఁడు చూడలేదు. బాలుఁడు పూర్ణచంద్రునివలె దివ్యతేజోమయుఁడై ప్రకాశించుచున్నాఁడు. మొలను గజ్జలు, మెడలో పులిగోరు, చేతులకు బంగారువత్తులు మొదలగుభూషణములతో నాబాలుఁడు ప్రకాశించుచున్నాఁడు. బాలుఁ డట్లే యాడుచుండెను. చంద్రరేఖ వెనుకనుండి వచ్చి, కన్నులు మూసినది. నెమ్మదిగా నామె చేయిని మనమిత్రుఁడు తొలగించి నాఁడు. ఆమె, "నాథా! మీవైఖరిఁ జూడ నాకు భయ మగుచున్నది. చూచితిరా! చీకటు లెట్లు గ్రమ్ముచున్నవో, వెదకి వెదకి వెలుతురులేని యీప్రదేశములో గాఢచింతామగ్నులై యిట్లుకూర్చుండుట యేమి? మనకళాపూర్ణుఁడు మీకంటె గట్టివాఁడు. మిమ్ములను బలుకరింపక సిరాను ముఖముపైఁ బూసికొని, కళంకసహితచంద్రబింబమువలెనున్న మోముతో నాడుచున్నాఁడు" అనెను. అంతట సచ్చిదానందము బాలునెత్తికొని భవనముఁ బ్రవేశించెను.

ఇదియేమి? సచ్చిదానందమునకు సాంసారికజీవన మిప్పటికి నాల్గుసంవత్సరము లైనది. రెండవసంవత్సరములో నొక బాలుఁ డుదయించినాఁడు. చంద్రరేఖ గర్భమును దాల్చినది

మొదలు పుట్టినింటికిఁ దీసికొనివెళ్ల, వీరభద్రశాస్త్రిప్రభృతు లెంతయో ప్రయత్నించిరి కాని లాభము లేదయ్యెను. ప్రియునిపేడి చంద్రరేఖ యొక్కక్షణ ముండజాల దయ్యెను. ఇక్కడనుంచియే యామెకుఁ బుట్టినింటివారు వలయులాంఛనములన్నియు జరపిరి. పుంసవనము సీమంతము వంటియుత్సవములకు లెక్కయే లేదు. తుదకు శుభలగ్నమున నామె మగశిశువును గనినది. ఆశిశువునందమునకు ముల్లోకము లచ్చెరు వందినవి. అట్టిసుందరు లగుతల్లిదండ్రుల కెట్టిశిశు వుదయించును. ఆశిశువునకుఁ బెద్ద లాలోచించి కళాపూర్ణుఁ డని పేరిడిరి. ఇంతటితోఁ బురుషోత్తములయానందము మిన్నుముట్టెను. ఆయన తనకుఁ గోర్కెలు లేమిచే, యోగమగ్నుఁడై కాలము గడపుచుండెను.

కొలఁదిరోజుల యనంతరము పురుషోత్తము లానంద సమాధినుండి శరీరమును వీడిరి. సచ్చిదానందమున కపారదుఃఖము గలిగెను. వారి పారలౌకిక క్రియలు జరిగినతరువాత నాతనిమనస్సునం దొకమార్పు గలిగెను. ఇహపరవిచారణమున కాతఁడు పూనుకొనెను. కేవలసంసారభోగములతో నన్నివిద్యలను మానివేసినయాతఁడు ప్రస్థానత్రయమును మఱలఁ జదువ నారంభించెను. పురుషోత్తములు నిర్వహించిన వ్యవహారములన్నియు నాతనినెత్తిపైఁ బడినందున వానిని నిర్వహించుట కాతఁడు వీరభద్రశాస్త్రిగారిని బిలచెను. వీరభద్ర

శాస్త్రి ప్రబలధనికుఁడు గాకపోయినను తినను గుడువను గల వాఁడు. ఒకరియింట నుండుటయం దాతని కిష్టములేదు. అయి నను ముద్దులకుమార్తెయు నల్లుఁడును మిక్కుటముగ బ్రతి మాలుచున్నప్పు డాతఁ డేమిచేయగలఁడు అంగీకరించి వచ్చి యుండెను. అంతటినుండియు సచ్చిదానందము కొంతకాలము వేదాంతగ్రంథకాలక్షేపముతోడను గొంతకాలము సాంసారిక గోష్ఠితోడను గడపుచుండెను. చంద్రరేఖ కీవైఖరి కొంత మొట్టమొదట నచ్చకపోయినను గ్రమక్రమముగ నామెకూడ పారలౌకికచింతన మారంభించినది. ఇంతచిన్నవయసున వీరల కీవిచారణము లేల యని లోకము వీరిపై కారములు మిరి యములు నూర నారంభించినది.

ఇఁకఁ గథకుఁ గాళ్లు లేవు. నడచుట మానుచున్నది. సచ్చిదానందమునుగూర్చి యిచ్చట వ్రాయఁజాలక యాతఁడు వ్రాసినవిషయ మొకటి యథాప్రకారముగ నిం దుదాహరించు చున్నాము.

“ కొలఁదిమాసముల క్రిందట. అది సుదినము. అపార ముదమున నే నానాఁడు మేల్కాంచితిని. సకలదిఙ్ముఖము లానందసూచకవికాసభాసురములుగ నుండెను. ప్రకృతి యనం తలలిం నా కమందానందము నొసఁగుచుండెను. ఆనాఁడు సంతోషవీచీసముల్లాసలీలాడోలికల నమేయస్థితి నూగుచుంటిని. ఒకానొకసదయహృదయుఁడు, పరమమిత్రుఁడు, సత్వగుణపరి

పూర్ణుఁడు, సంతృప్తిమంఁ దసమానుఁడు, నాగరపరివేష్టితభూ
మండలమున నాధ్యాత్మికసాధనమున నుత్తములలో నొకఁడు
విచ్చేసి నన్ను సగౌరవముగ నాలింగనము గావించికొనియెను.
అప్పుడు నేను,

'కిం చందనైః సకర్పూరైః కిం తుహినైః కించ శీతలైః
సర్వే తే మిత్రగాత్రస్య కలాం నార్హంతి షోడశీం ॥'

అంటిని. "మిత్రమా!" అని యాతఁడనెను.
"కృతార్థోఽస్మి" అని నేను బదులుపలికితిని. అతఁడు.

"విను మీయూరి వాయవ్యభాగమున, నొకవనము,
మధురకుసుమఫలభారనమ్రికమైశాఖాతరుశోభితము, శుకపిక
శారికాగీయమానావ్యక్తశ్రుతిసంపూరితము, మృదుపేశలగ్రాస
పరివ్యాప్తభూతలస్వర్గము కలదు. అట నవసుధాధౌతపరిశుద్ధ
ప్రాసాదోపరిభాగమునఁ గన్నులపండు వగునొకనితాంతశాంత
స్థల మున్నది. అది పామరుల కగోచరము. ప్రాజ్ఞుల కపార
ముదావహము. ఆస్థలమున నొక్కజ్యోతి గలదు. దానిని
వర్ణింప నాతరమా. దానితేజోవిలాసము కోటిసూర్యులకు
లేదు. దాని నిర్మలశాంతశీతలాహ్లాదము కోటిచంద్రుల కుండదు.
దాని నొక్కమారు చూచినవారు మరల నేజ్యోతిని జూడ
వాంఛింపరు. అందుఁ గోరినవారికిఁ గోరినరీతి కాంతులు స్ఫురిం
చును. దానివైభవమును జెప్ప వాగ్దేవత జంకును. అదృష్ట

వశమున నాకది గోచరించినది. పరమమిత్రుఁడవు గాన నీకు దానిఁ జూపెదను. ఫలితము ననుభవించి గ్రామాంతరస్థితుఁడ నగునాకుఁ దెలియఁజేయుము. మనమిరువురమప్పు డామధువును దుల్యముగఁ గ్రోలుదుము. దానిని గన్నులారఁ జూతము. అయిన నీ వొక్కపనిని జేయవలసియున్నది. బహుకాలము నుండి నీయధీనమున నొకదీపపుస్తంభము గలదు. దానిలో నపూర్వాజ్యము నశ్రుతపూర్వవర్తియు నుంచి యాజ్యోతినుండి వెలిగించుకొని నీయింట నుంచుము. అయ్యదియు నామూల జ్యోతియందలిదివ్యశోభతో ప్రతిబింబింపఁ గలదు. చూతును గదా నీప్రజ్ఞావిశేషము. పోయివత్తును. అశ్రద్ధనలదు సుమా" అని వెడలిపోయెను.

అప్పుడు నాహృదయము నిండినది. నామనస్సు పరిపూర్ణమైనది. నాకన్నులానందాశ్రులఁ గురిసినవి. నాదేహము గగుర్పాటుఁ జెందినది. నే నానందపూర్ణుఁడనైతిని. మఱునాఁడు ప్రయాణము. పరికరములు సిద్ధమైనవి. స్నాతానులిప్తసకలాంగుఁడను, మాల్యాంబరభూషితుఁడను, గంధాక్షతాలంకృతనిటలతటుఁడనై నిర్దిష్టోద్యానమార్గము ననుసరించితిని. వనము దృశ్యమైనది. ప్రాసాదము కన్నులపండువైనది. జ్యోతి యభిముఖమైనది.

" శ్రేయాంసి బహువిఘ్నాని " నాముం దొకపెద్ద గోడ యున్నది. నామిత్రుఁడు దీనినిగూర్చి చెప్పలేదు. నే

నెవ్వరి నడుగుదును ? వ్యష్టి నారించితిని. ఈవిఘ్నము నుత్త్రరించుట కేమహామహుఁడును గోచరముగాఁడా? ఈయాత్మకము నతిక్రమించుట కుపాయముఁ జెప్పఁ బ్రత్యక్షపురుషుఁడు లేఁడా ? ఈయభ్యంతరము నంతరింపఁ జేయుపరమనాథుఁడు లభింపఁడా ? అని బిగ్గరగా నంటిని. అంతలో నొకపురుషుఁ డెటు నుండియో నాకు గోచరించెను. అతనిచేతియం దొకలాంతరు గలదు. అందు దివ్యజ్యోతి కనుగుణ మగునొకజ్యోతి గలదు. "నాయనా! నేనాపత్స్థానముకడ కేగవలయును. నాకు మార్గముఁ జెప్పవా ?" యంటిని. "చెప్పెదను. మరల వత్తును. ఉండుము". అని యాయన వెడలిపోయెను. "అంతతేజోవంతున కొకింతకరుణ లేదా ? స్వార్థ మెంతి చేయదు" అని వెంటనే బుద్ధిని సన్మార్గమునకుఁ దెచ్చి కొని "నాకర్మమున కెంతగడువున్నదో ? ఆయనపని యెంత యావశ్యకమైనదో ? నా కేమి తెలియును. నాకొఱకుఁ దగిన సాధనములఁ దెచ్చుట కట్టె వెడలెనుగాఁబోలు". అని సరి పుచ్చుకొంటిని. అట్టిపురుషు లొకరిద్దరు కాన్పించిరి, గాని నేను వారిని మార్గ మడుగలేను. నాకు బిడియము అమితము. బిడియముచే మార్గమడుగక యనేకవారులు నామాన్యమార్గములందును నొకటిరెండుమార్గారణ్యమందును బూర్వము త్రోవతప్పితిని. కాని త్రోవతప్పుటయు నొకసంతోషము. ముండ్లుగ్రుచ్చుకొనుట యొకవిచిత్రానుభవము. కాళ్లు నొప్పి యెత్తుట యొకయపూర్వదృశ్యము. తిరిగి తిరిగి విసుగుఁజెందుట

యపారభాగ్యము. దొంగలను తదితరాపాయములను గాంచుట యమేయసుఖము. మఱల మార్గము నెఱిఁగి గమ్యస్థానముఁ జేరుట యశ్రుతపూర్వసాహసానుభూతి.

మఱికొందఱును నిచ్చటికి వచ్చిరి. అందఱికి నాజ్యోతి యగమ్య మని తోఁచినది. ఆయాతంక మవిలంఘ్య మని స్ఫురించినది. కొందఱు గడ్డపారలు తెచ్చెద మనిరి కాని కొందఱది యినుపగోడ యనుటచేఁ దత్ప్రయత్నమును విరమించిరి. కొందఱు హృదయపూర్వకనమస్కృతిఁ జేసి నిష్క్రమించిరి. ఆరోజున కింటి కేగితిని. ఇట్లే ప్రతిరోజు నచ్చటికి వచ్చి నమస్కరించి యేగుచుంటిమి. ఎన్నటికో పరమభాగ్యము లభించుట. ఎన్నటికో మాదీపముల నాజ్యోతితో వెలిగించుకొనగల్గుట. అదేమి చిత్రమో దానిని చూచినప్పటినుండియు నెవ్వరికిని విచారములేదు. ఎవ్వరికి ననుమానము లేదు. ఎవ్వరికిని నిరాశ లేదు. అందఱకు నానందము. కొంతకాలమున కందఱు నానందనాట్యము నారంభించిరి. ఆనాట్యములో మూరెడుమూరెడు గడ్డాలవారు, జేనెడు జేనెడు మీసాలవారు, తాటిచెట్టంత పొడుగువారు, తంగేడుచెట్టంత పొట్టివారు, గరిసెలంత లావువారు, గడ్డిపోచంత సన్నటివారు, చక్కనిసూక్ష్మదృష్టిగలవారు, చిక్కని రేచీఁకటికలవారు, చిన్నవారు, పెద్దవారు చిత్రవిచిత్రాలజుట్లవారు, భేదభేదముల బొట్లవారు, చొక్కాలవారు, టోపీలవారు, అవివాహితులు

వివాహితులు, పసిపిల్లలు, యువతులు, అవ్వలు, బోసినోటి వారు, పూర్వసువాసినులు, పేరు వారసనేల, సర్వజనులు కలరన్న నతిశయోక్తి కాదు. అది జ్ఞాననాట్యమా? అజ్ఞాన నాట్యమా? ఏదియైనను నా కందు నామరహస్యము స్ఫురించినది. జ్యోతిః స్ఫురణవలన నందు విశ్వశ్రుతి కనుకూల్య మగుశ్రుతి యొకటి జనించినది. ఆత్మశ్రుతిలోఁ దమశ్రుతిఁ గలిసి యచ్చట నున్నసిద్ధు లోంకారనాదము నవలంబించిరి. కొంతకాలము గడచినది. ఒకానొకనాఁడు నాకొక్క విచిత్రము గోచరించి నది. అంతకుముందే మాలోఁగొందఱు సన్మార్గము నెఱింగి నట్లును, ఆతంకమును దాటఁగలిగినట్లును నాకు స్ఫురించినది. కాని సాక్ష్యములేనిది నమ్మకపోవుట లౌకికధర్మము. నా కిది విచిత్రముగఁ దోఁచినది. పరులమోస మందునా? కర్మవిపాక మందునా? విధివిధాన మందునా? ఏదియుఁ గాదు. అనింద్య మగుసత్యస్వరూపము. ఒకనాఁడు వేళతప్పించి వెళ్లితిని. నాతోఁ బూర్వము నాట్యముచేసిన వారిద్దరుముగ్గురు గోడలో నుండి వచ్చుచుండిరి. అక్కడి కొక్కదుముకు దుమికితిని. ఏమని చెప్పుదును! ఆగోడ, కాగితపుగోడ. అం దెప్పటి కప్పుడు వచ్చుచుఁ బోవుచు నుండువారికి, మార్గమిచ్చుచు మరల మూసికొనిపోవుద్వారము లున్నవి.

దొరకినది త్రోవ. చిక్కినది నిధి లభించినది బంగా రము. సంప్రాప్తమైనది జ్యోతి. ఆతంకమును దాటినాను.

ఇంద్రియాతీత మగుసుఖము చేకూరినది. సకలదిగ్వ్యాప్తమై సమస్తప్రేమాస్పదమై సర్వభ్రాంతిహరమై, విశ్వప్రమోద దాయకమై పరంజ్యోతి పరబ్రహ్మమై వెలిగినది. ఇంక నాకేమికొఱత ?

దీపో జ్యోతిః పరంబ్రహ్మ దీపో జ్యోతిః పరాయణం
దీపేన హ్రియతే పాపం పరందీప ముపాస్మహే ॥"

# ఇరువదియాఱవ ప్రకరణము.

## పతిత్యాగము.

—: 0 :—

సచ్చిదానందము వ్రాసికొనియుంచిన కాగితములనుండి మఱికొంత యుదాహరించి మీఁదటికథఁ జెప్పెదను.

“ ద్వైతము చిత్రసంఘటనధర్మమునన్ బహుభంగి లోకులన్
జీవములన్ విచిత్రగతిఁ జేయును మార్పులఁ జెందునట్లు, తా
నా! వివరింప శక్యమె విరాగిని రాగిని జేయు నట్టులే
శ్రీనిలసిల్లురాగయుతుఁ జేయు విరాగిని జింతవాయఁగన్॥
కర్మ మటండ్రు కొంద, ఱటుకాదు విధాతృనికార్య మిద్దియం
చోర్మిని బూనకే సలుపుచుందురు నిందను గొంద, ఱెచ్చటన్
గర్మము లేదు పౌరుషమె కాని యటందురు కొంద, ఱైన, త
న్నిర్మలనిత్యతత్త్వపరనిస్తులసత్యవిలాస మందు నేన్॥ ౨
అటుగాదేనియు సాధ్యమే యవిరళం బై వట్టి సంసారదు
ర్ఘటఝంఝానిలఘాతమానవకమాత్రప్రాయు నాబోటి కి
క్కటురక్షాచణదక్షమేరుగిరియై బ్రహ్మంబు జ్ఞానాత్మకం
బిటుఁ జింతింపఁగ నేర్పుగల్గుట సమావిష్టప్రబోధంబునన్॥ ౩
బాల్యమునందు నన్ను సమభావమునన్ గని చెప్పె యోగి కై
వల్యవిలాస మీకనుగవన్ గలదంచు మదంబతోడ సా

కల్యముఁగాఁగ వింటి నది గల్గెను భాగ్యము నేఁడు జన్మసా
ఫల్యముఁ గంటి జ్ఞానసముపార్జనరక్తి గురూక్తి గల్గఁగన్॥౪
నాజంబై లభియించె భావిశుభవిస్తారప్రభావంబునన్
నాజీవం బదియెల్ల నేటిస్థితిఁ జెందన్ సిద్ధమున్ జేయున
ట్లీజన్మంబునఁ గష్టముల్ సుఖములున్ హింసల్ శుభంబు ల్సము
ద్రాభ్యాజత్తీర్థసమాగమంబులును విద్య ల్మిత్రసంప్రాప్తియున్॥
గృహిణిన్ గూర్చెను ధాత యుక్తగుణవాగ్రీతుల్ ప్రకాశింపఁ
ద,ద్గృహిణీసంగతి సంస్మృతిన్ మునుఁగనీ కెంతో దయన్ రక్షణం
బహామున్ రాత్రియు నాక చేసెను,మహాభారంబుఁబూనంగఁ
డం, డ్రి హితంబొప్పగ దీర్ఘజీవనమునన్ దీపించిసిద్ధిన్ గనెన్॥౬.

శృతిధర్మపోషణమతి వృద్ధిఁబొందంగ
సంభాషణాసక్తి సంతరించె
స్నానసంధ్యాద్యనుష్ఠానరక్తి చెలంగ
నేకాగ్రమతిఁ గర్మహితముఁ దెలిపె
శ్రీశైలవేదాద్రిశితనగప్రయా
గాదితీర్థాసక్తిఁ బాదుకొలిపె
యోగాసనాదిసంయోగచింతానిరూ
ఢతాత్త్వార్థప్రత్యక్షతత్త్వ మొసఁగె
వ్యక్తిగత మగుశృతిని నాసక్తిఁ బరమ
శబ్దమందున లీనంబు సలుపువిధము
సేసె సుజ్ఞాననిధి నీయచింత్యతేజ
మెక్కడే సుమ్ము పరము వేఱొండు గలదె॥ ”

మఱియొకటి,

“ నే నొకపరి విహారార్థము బయలుదేఱితిని. అప్పటికి సాయంసమయ మైనది. సంజచీఁకట్లు క్రమ్మినవి. క్రమ్మక బ్రహ్మాండమునందలి పదార్థము లున్నవో లేవో నిర్ణయించ వీలుగాకుండెను. అట్టిసమయమున బయలుదేఱవచ్చునా కూడదా యనుశంక నాకుఁ గలుగలేదు. నాది కోఁతిము మూర్ఖపద్ధతి. సరియే బయలుదేఱినాను. కొంతదూరము పోవునప్పటికి కొక పెద్దమడుగు నడ్డగించినది. దాని వైశాల్య లోతెంతయో నిర్ణయించుటకుఁ దగినవెలుఁగు లేదు. అప్పటికి కట్టియుద్రోవముఁగూడ నాకు లేదు. ఈమడుఁగు దాటిపోదమని యూహ పొడమినది. అందు దిగితిని. పోను పోను లో తెక్కువ యైనది. లోతుగ నున్నదే, వెనుదిరుగుదునా యనుభావ మెన్నటికిని లేదు. స్వామిదయవలనఁ గొంచెమీఁదుట నాకువచ్చును. మునుఁగ కుండఁ దేలఁగలను. ఇది ప్రబలమైన ప్రవాహము గాదు. పోఁగా పోఁగా నాయీఁతఁ బ్రయోగించవలసిన యావశ్యకత గలిగినది. కాని ప్రవాహము క్రమముగా బలవత్తర మైనది. అబ్బో! దాటగలనా యను క్షణసంశయము గలిగి వెంటనే చిరునగవుతో నాసంశయము మాయమైనది. చుట్టుపట్ల లంకల వంటివి కొన్ని గోచరమైనవి. ఆలంకలలో నాగుదునా ? అవి మనోహరముగనున్నవి. అందెవ్వరో కొంద ఱుండియుండవచ్చు నని తోఁచినది. నాకచ్చట యాగుట తృప్తికర మనిపింపలేదు.

గమ్యస్థానమేదో యచటికే చేరవలయును. ఇంతలో నొకజల జంతువు కనుపడినది. దానిని నీటిపాప యందురు. అది మిక్కిలి మృదువుగానుండి ప్రజల నాకర్షించి యాశ్రయించినవారిని నీటిలోని కీడ్చి తినివేయు నఁట. ఇదివఱ కెందఱో దానిపాలైరట. అయిన నేమి? దానిని జూడగనే, 'దానిమీఁదఁ గూర్చుండవచ్చును. ఈఁదకుండ సుఖముగాఁ జక్కని ప్రయాణము జరుగును'. అనుకొంటిని. నీటిపాపను బట్టుకొంటిని. పరమానందదాయివలె తోచినది. నాకు దొఱకిననీటిపాప పిచ్చిదో, నాకు దానికిఁ జిక్కకుండు నేర్పరితనము గలదో నిర్ణయింపఁ జాలను. అప్పుడప్పు డది శరీరమును బెంచును. అప్పుడు దాని శరీరమున నేదుపందిముండ్లవంటి కఱకుపదార్థములు బయల్పడును. ఆసమయమున బాధ. దానిపైఁ గోపము గలిగినది. దరిని జేర్చని యీపాప యేలనని దానిని తన్ని వేసితిని.

గమ్యస్థానము బహుదూరము. ప్రవాహము బలవత్తరము. తేలియుండుటకంటె నెక్కువయీఁత రాదు. ఇంక నెట్టిజంతువులు, కొండలు, ముండ్లచెట్లు, నడ్డువచ్చునో తెలియదు. ఆసమయమున నొకచిన్న ప్రవాహము వచ్చినది. అది నాకనుకూలమైన ప్రవాహము. ఆప్రవాహము గమ్యస్థానమునకుఁ జేర్చుదానివలె కొంఁతదూరము తీసికొని వెళ్ళి వదలివేసినది. అప్పటికి నేను ప్రవేశించిన దొకమహాసముద్రమని గ్రహింపఁగలిగితిని. అంతటఁ బ్రబలతరమైన మఱియొక

ప్రవాహము సహాయమున వచ్చినది. నేను [illegible] ప్రవేశించితిని. అందుండి [illegible] తెల్లనివెలుగుచున్న [illegible] ప్రవాహములు [illegible] గొప్పిసనాసలు కన్పించినవి. [illegible] మాత్రము [illegible] తరమున నున్నది. ఈ ప్రవాహసహాయమున [illegible] పోవలెఁ [illegible] వారును [illegible] వారును. [illegible] కొంతకాలమున కదృశ్య మగువారును. [illegible] వారు [illegible] నేను వారిపై [illegible] కాలహరణము చేయఁదలంప లేదు. [illegible] ప్రవాహము [illegible] నున్నది. [illegible] గమ్యస్థానమును [illegible] చుచున్నాను ".

అది యమావాస్యనిశ. కటికిచీకటులు బ్రహ్మాండభాండము నంతటిని నావరించినవి. కన్నుఁబొడచుకొనినను గాన వచ్చుసూచన లెచ్చటను లేవు. మినుకుమినుకుమనుతారక లప్పటికప్పుడు గ్రమ్ముచుండిన మేఘములచాటున దోబూచు లాడుచున్నవి. లోకమంతయును శరీరములు దెలియక నిద్రించుచున్నారు. ఊరిలో దొంగలును, కాటియందుఁ బిశాచము లును, వీథులలో స్వైరిణులును, ఊరిబయట నక్కలుమొద లగుజంతువులును దప్ప ప్రాణిసంచారము లేదు. చెట్లలో నున్న పక్షు లప్పుడప్పుడు లేచి ఱెక్కలు తటతటఁ గొట్టుకొని

కన్నులుగానక మరల నెట్లో తమగూండ్లలోఁ జేరుచున్నవి. కీచురాళ్లు గంభీరముగ నరచుచున్నవి. ఏకోనలోనో గుడ్లగూబలహుంకారములు చెలరేగినవి. కాటుక యలమినట్లు చీఁకట్లు గంభీరముగ వ్యాపింప, నిది మిట్టయనియు నిది పల్లమనియు మార్గమునఁ దెలియుట దుర్ఘటముగనున్నది. పురుషోత్తముల యింట నందఱును నిద్రించుచున్నారు. సచ్చిదానందము మాత్రము మేలుకొనియున్నాఁడు. ఆతనిముఖము నూతనకాంతులతోఁ బ్రకాశించుచున్నది. ఆతనిలక్షణము విపరీతాలోచనముల సూచించుచున్నది. ఒకతల్పముపైఁ జంద్రరేఖ యమావాస్యచీఁకట్లనుబాఱఁద్రోలుచుఁ గాంతితోఁ బ్రకాశించి శయ్యపై నిద్రించుచున్నది. ఆమెప్రక్కనఁ గళాపూర్ణుఁడు షోడశకళాప్రపూర్ణుఁడై వెలుఁగుచు నిద్రించుచున్నాఁడు. సచ్చిదానందము నిశ్శబ్దముగ లేచి యాతల్పముకడ నిలుచుండి యిట్లు రహస్యముగ ననుచున్నాఁడు.

“ సాధ్వీలలామా ! చంద్రరేఖా ! పూర్వపుణ్యవశమున మనజన్మము లన్యోన్యబద్ధములై యీశిశువుమూలమున నను స్యూతము లైనవి. నేను పుట్టినప్పటినుండియు విద్యార్జనమును, దేశసేనను గావించుచు నీకై యువ్విళ్లూరుచుంటిని. తుదకు నిన్నువివాహమాడి సమస్తసుఖముల ననుభవించితిని. ఇంకను నీసంసారమున పొందగలసౌఖ్యములు పెక్కులుగలవు. కాని శాని నీఁక, నేనొల్లను. ఈశిశుసహితముగ నిన్ను వీడిపోవుట

జ్ఞానవైరాగ్యయుతులై యోగసాధనము గావించి యనంతము నచింత్యము నప్రమేయము నవికార్యము నప్రతర్క్యము నగు బ్రహ్మమును జేరిరి.

అయిన నేనిప్పుడు సేయునది దేశసేవయా, లోకసేవయా, ప్రాణిసేవయా ? ముక్కుమూసికొని మూలఁగూర్చుండుటవలన, లోకమున కేమి ప్రయోజనము ? ఇది యజ్ఞులవాదము. పరమార్థము నెఱుంగనివారితర్కము. లోకనిమగ్నుల యాశయము. లోకమున కేది యుత్తమశ్రేయోదాయకమో నిర్ణయింపలేనివారిప్రశ్న. మహర్షులు తాము తరించి లోకమును దరింపఁజేయుదురు. కొందఱు వేదఋషులవలెను, బుద్ధభగవానులవలెను లోకదుఃఖనివారకము లగుపరమసత్యముల వెల్లడింతురు. కొందఱు కేవలము తమదివ్యతేజముచేతనే లోకమును దుఃఖరహితము చేయుదురు. ఇంగువ, కర్పూరము, పునుగు, జవ్వాది మొదలగుపదార్థములు, తమస్థలమునుండి కదలకయే, క్రిమినాశన మొనర్చి, లోకుల కామోదము నెట్లిచ్చునో, సూర్యభగవానుఁడు, దేశసేవకులవలె నూరూరికి నింటింటికిఁ దిరుగకయే తనకిరణములచే నన్నిచోట్లఁ బ్రవేశించి యందఱకు జీవనము నెట్లొసంగునో, అట్లే ఋషులు కొందఱు లోకప్రచారము గావింపకపోయినను, శ్రేయస్సు నొసంగుదురు. పాపపుణ్యములును, ధర్మాధర్మములును, మానవునియున్నతినిబట్టి నిర్ణయింపవలసియుండును. ఉత్తమాశయా

ద్వేషణమునఁ గానపుణ్యములు లేవు. కర్మానుష్ఠానములు లేవు. శ్రీకృష్ణభగవానుఁడు, 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'. యని యుపదేశించినాఁడు. నా ప్రకారము యము లన్నియు వదలివేసినవాఁడ నేను. నాకిఁక నేమియు నక్కఱ యూరామెడ పరలోకముకొఱకు". యనుచు నతఁడు నుత్తరా మునకుఁ బోయెను.

ఇట్లు పోయిపోయి తెలతెలవారుచున్నట్టి నాఁ డొక దూరపుగ్రామమును జేరెను. అందొక బ్రాహ్మణుఁ డాతనిని బిలిచి యాహార మిచ్చెను. ఇట్లు దొఱకినచోట నాహారమును భుజించుచు లేనిచోట నుపవసించుచుఁ బోయిపోయి కొన్ని రోజులకు జగన్నాథక్షేత్రముఁ జేరెను. ఇష్టం జాతినికి క్షేత్రములఁ జూచుటయం దుత్సాహము లేదు. తీర్థముల మునుఁగుటయం దాసక్తి లేదు. ఏలక్ష్యముకొఱకు నాతఁ డిల్లువెడలెనో యట్టి లక్ష్యమునం దేకాగ్రబుద్ధిఁ గలిగి వెడలిపోవుచుండెను. కొంత కాలమున నాతఁడు కాశీపట్టణముఁ జేరెను. కాశీక్షేత్రలో నెల్లప్పుడు నొకసిద్ధుఁడు తప్పక యుండువాఁడట. కాని సామా న్యముగ నాతఁ డెవ్వరో యెచ్చట నుండునో తెలియుట కష్టము. కాశీనుండి హరిద్వారమార్గమున నాతఁడు హిమా లయములయందుఁ బ్రవేశించెను. ఏపర్వతములనుండి గంగ మ్మతల్లి బయలుదేరి భారతదేశమును బవిత్రముగావించు చున్నదో, ఏపర్వతపంక్తి నిరంతరము హిమమున కాలవా

63½

లమో, ఏపర్వతరాజు శివునకు మామయై ఋషులకాటపట్టై దివ్యస్పందనమును గలిగియుండునో అట్టిహిమాలయమును జేరి సద్గురువు నన్వేషించెను. మనస్సు పరిపక్వముగనుండి సత్సంకల్పముగలవానికి మార్గదర్శకుఁడు లభించుట కష్టమా? ఆతఁడు గురుదత్తభావమును మననముఁజేయుచు అష్టాంగయోగము నవలంబించి ధ్యానము ప్రధానముగఁ గాలముగడపుచుండును. గొంతకాల మాతఁ డేకభుక్తము గావించి తపము గావించెను. కొంతకాలము నిరాహారుఁడై జలపానమును మాత్రము చేసి, కొంతకాలము వాయుభక్షణము చేసి, కొంతకాలము కేవల సమాధిస్థుడై యద్వైత తత్త్వము ననుభూతిఁజెంది యాపరం జ్యోతిస్స్వరూపమే తానుగ నెఱుంగఁ గలిగెను. ఏమహర్షుల తేజముచే భారతదేశము పవిత్రమగుచున్నదో, ఏమహర్షుల దివ్యప్రభావము ప్రపంచమునకు శుభమును గలిగించుచున్నదో, ఏమహర్షుల దివ్యదృష్ట్యనుగ్రహము భారతజాతి నశింపకుండుటకుఁ గారణమో, యట్టిమహర్షులలో నొక్కఁడై సచ్చిదానందము సచ్చిదానందస్వరూపుఁడై దేశకాలాతీతపరబ్రహ్మమై విరాజిల్లుచుండును.

సర్వేలోకా స్సుఖినో భవన్తు.

---

రాజమండ్రి : శ్రీసత్యానందప్రెస్‌నందు, ముద్రింపఁబడినది.